*Issued*— 6-6-1956






# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## FRIDAY, 22nd JULY 1955

## VOLUME IV—No. 2

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1956
PRICE, 6 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Friday, 22nd July, 1955.**

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.



## I. QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTION

*Thefts, robberies etc., in Nandyal Taluk:*

208-A-

*1293-D. Sri E. AYYAPU REDDI :- (Put by Sri P.RANGA REDDI:-) Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) the number of thefts, robberies and dacoits reported from 1st January 1955, till 10th July, 1955 in Nandyal Taluk, Kurnool District; and

(b) the number of cases detected and charge-sheeted and the number of cases undetected out of the reported cases ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— Sir, I would like to know whether Mr. P. Ranga Reddi has got power to put questions on behalf of all absentee members in this House.

Mr. SPEAKER : I wish to know from Mr. Ranga Reddi whether he has general power.

Sri P. RANGA REDDI :— No, Mr. Speaker. I have got authorization from Sri P. Gopalakrishna Reddi only. As this question relates to my district, Kurnnol, I thought that the Minister should answer.

The Hon. Sri N. SANJEEVA REDDI : I have no objection, Sir.

(a) While there were no cases of robberies and dacoities in Nandyal taluk from 1—1—55 to 10—7—55, the number of thefts reported in that Taluk during the above period is 31.

(b) The number of cases of theft detected and charge-sheeted is :— 21.

and the number of cases undetected is :— 5.

*Note* :- Out of the 21 cases charge-sheeted, 14 cases ended in convictions. One was discharged and the remaining 6 are pending trial.

Sri G. SURYANARAYANA :—అధ్యక్షా, బళ్ళారి జిల్లాలో బోర్డ్స్టలు స్కూలు వుండేది. ఆంధ్రజిల్లాలనుండి అది వేరయిన తరువాత ఆంధ్రకు వేరే బోర్డ్స్టలు స్కూలు పెట్టారా ?

Mr. SPEAKER :- అది వేరే ప్రశ్న వేయవచ్చు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Theft detect చేయడానికి third - rate methods ఉపయోగించిన కేసులు ఏన్నో చెప్ప గలరా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— అలాంటి methods మన పోలీసు department ఎప్పుడూ ఉపయోగించదు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— పోలీసు department యిదివరకు ఉపయోగించిందని, ఉపయోగిస్తున్నారని ప్రభుత్వానికి తెలుసునా ? Enquire చేస్తుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇదివరకు చేస్తే punish చేసే వుంటారు. ఇప్పుడు ఇందులో దేనికీ ఆలాంటి methods adopt చేసినట్టులేదు.

Sri B. SANKARAIAH :—రిపోర్టుచేయబడినటువంటి కేసులలోకొన్నిటికి charge-sheet లు పెట్టారు. కొన్నిటి విషయాలలో ఏ దయినా రాజకీయ పక్ష పాతంతో పెట్టినట్టు ప్రభుత్వముకు రిపోర్టు వచ్చిందా ? ఏమి చర్యతీసుకున్నారు ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— శంకరయ్య గారికి నేను చదివిన జవాబు అర్థము కాలేదనుకుంటాను. Charge-sheet పెట్టి convict చేసిన కేసులు యిన్ని, enquire చేసినవిన్ని, అని చెప్పాము. కాంగ్రెసువాళ్ళకు వీళ్ళతో లూటీ చేయించే ఆచారములేదు.

## STARRED QUESTIONS:

### *Village Fire Fighting Squads :*

209.

*378 Q. Sri S. VEMAYYA :— Will the Hon. the Deputy Chief Minister be pleased to State :

(a) Whether there is a scheme of village fire watching and fire fighting squads in the State; and

(b) If so, the number of villages in which the scheme is in force now ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

(a) "Yes Sir"

(b) "The scheme is now in force in 6280 villages".

Sri S. VEMAYYA :— ఏ ఏ జిల్లాలలో యీ రకంగా fire fighting squads పనిచేస్తున్నాయో తెలుసుకోవచ్చా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

| | | |
|---|---|---|
| అనంతపురం | = | 496 |
| చిత్తూరు | = | 352 |
| కడప | = | 620 |
| కర్నూలు Urban | = | 56 |
| కర్నూలు Rural | = | 362 |
| నెల్లూరు | = | 459 |
| తూర్పుగోదావరి | = | 397 |
| క్రిష్ణా | = | 721 |
| గుంటూరు | = | 369 |
| విశాఖపట్నం South | = | 395 |
| విశాఖపట్నం North | = | 1456 |
| పశ్చిమ గోదావరి | = | 597 |

*District and Provincial Maps for sale :*

210.

* 220.–Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether there are new District Maps and Provincial Maps for sale according to the formation of Andhra State: and

(b) if not, why ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) Does not arise.

Sri N.C. SESHADRI :— District map లు provincial map లు కనీసం శాసన సభ్యులకైనా సప్లయిచేసే ఏర్పాటు చేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— అమ్మకానికి వున్నాయి.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అమ్మకానికి వున్నాయని చెప్పారు. మామూలుగా ఏ book-stalls లోనూ అగుపడడంలేదు. అన్ని book-stalls లో అమ్మేదానికి ఏర్పాటు చేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— అమ్మకానికి వచ్చే ఏర్పాటు చేస్తాం.

*Development of " Araku Valley."*

211.

*152-Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) the amount of money spent on various departments for the development of 'Araku Valley' from its inception till 1954 ; and

(b) the progress made so far ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) The total amount spent on the scheme till 1954 is Rs. 31,02,350/-.

(b) The progress made so far by the various Departments is given below :

REVENUE DEPARTMENT :— This Department attends to the repairs of temporary sheds in the valley from year to year. It co-ordinates the work of all Departments working there and maintains the Jildavagu Irrigation Channel.

PUBLIC HEALTH :— Anti-malarial operations are being carried out successfully controlling malaria, with D. D. T., spraying within a area of 120 sq. miles in 191 villages in Araku Valley agency in the transmission season from September to May every year.

MEDICAL :— A hospital with in-patient accomodation has been opened and it is attracting a good number of hill tribes people for treatment. The medical officer visits the villages rendering medical aid.

AGRICULTURE :— There is one Agriculture Farm and several crops viz., vegetables, potatoes, fruits, paddy, millets, samai, barley etc., are being raised every year. Agricultural Department has been educating the hill men in improved methods of cultivation supplying them with improved strains of seed and fertilizers. Seedling of the successful varieties are also supplied to the hillmen.

Administration farms are run for practical guidance to the hillmen. This department maintains an archard containing fruit trees. The receipts on account of the sale of agricultural produce grown in the experimental farm are as follows :

| | | |
|---|---|---|
| 1950 — 1951 | ... | Rs. 18,514/- |
| 1951 — 1952 | ... | Rs. 19,441/- |
| 1952 — 1953 | ... | Rs. 14,902/- |
| 1953 — 1954 | ... | Rs. 16,233/- |

Tractors are being given to the hillmen at concessional rates.

SERICULTURE :— There is an experimental sericulture farm for rearing silk-worm and for producing silk. This department teaches the hillmen to grow mulberry and to take silk manufacture as a cottage industry. The climatic conditions of the valley are well suited for this industry and the growth of mulberry gardens.

PUBLIC WORKS DEPARTMENT :— Jildavagu Channel Scheme at a cost of Rs. 56,520/- to irrigate an area of 129 acres has been completed. Flood damages to the bridges across the Pathalagedda were repaired. 4. G. tyye sheds and a pucca travellers' bungalow were constructed.

RURAL WELFARE :— This Department is training the hill men to maintain the beehive colonies.

EDUCATION :— An Elementry School and a Boarding House are also run by Government for the benefit of the hill tribes.

Sri PILLALAMARRI VENKATESWARLU :— Point of order Sir, ఇంతింత lengthy answers వచ్చినపుడు ముందుగా table మీద పెట్టినట్లయితే సభ్యులందరూ చదివి యింకా వివరాలు తెలుసుకోడానికి వీలుంటుంది కనుక యికముందయినా పెడితే బాగుంటుంది.

Mr. SPEAKER :— It would have been better. We may follow it later.

Sri S. VEMAYYA :— 31 లక్షల 20 వేల రూపాయలు ఖర్చుపెట్టబడిం దని మంత్రిగారు చెప్పారు. ఇందులో establishment ఖర్చులక్రింద ఎంత పోయిందో చెబుతారా ?

The Hon. Sri G. LATCHANNA :— Establishment Charges విడి విడిగా లేవు. కాని ఏ ఏ డిపార్టుమెంటుకు ఖర్చయిందో ఆ భాగం వున్నది.

Sri K. SUBBA RAO:— ఈ పట్టు అభివృద్ధిశాఖకు చెందిన అధికారి హిందూపురంనుండి ప్రతినెల అక్కడకు పోతున్నారు. హిందూపురం arku valley కి ఎంత దూరమో మీకు తెలిసినదే. ఈ పరిస్థితిని గమనించి అక్కడ పట్టు శాఖ నభివృద్ధి చేస్తే బాగుంటుందేమో, ఆలోచిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :— అది ప్రత్యేకప్రశ్న. తప్పకుండా ఆలోచిస్తాం.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇప్పుడు జిల్లాలవారీగా ఏ ఏ సంవత్సరాలలో ఎంత allot చేశారో ఎంత ఖర్చు పెట్టారో చెప్పగలరా ?

Mr. SPEAKER :— A separate question may be put.

Sri P. RAMACHARLU :— అధ్యక్షా, Araku valley చుట్టు సర్పగంధిమూలిక చాల దొరుకుతుంది. దానిని అంతా కంట్రాక్టరుకు ఇచ్చారని, దానిని అమెరికాకుపంపి వేలకువేలు గడిస్తున్నారని తెలుస్తుంది. అట్లా monopoly ఇవ్వకుండా, ఆ దివ్యమైనటువంటి మూలికను కాపాడేటటువంటి ప్రయత్నం చేస్తారా అని అడుగుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA :— భోగట్టా పూర్తిగాలేదు, నేను కనుక్కొంటూ ఉన్నాను.

Sri P. VENKATASUBBAYYA :— అరకు వాలీని అభివృద్ధిచేసే దృష్ట్యా అక్కడ కొంతమంది settlers ను రావించి వారికి భూములు assign చేసి గృహపరికరాలన్ని ఉచితంగా సప్లయిచేయడానికి ప్రభుత్వం సహాయం చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :— కొంతమందికి భూములు assign చేసి ఉన్నారు. కాని గృహపరికరాలు ఉచితంగా బయటివాండ్లకు ఇచ్చేబదులు, అక్కడనే ప్రజలు ఉన్నారనుకొంటాను.

Sri S. VEMAYYA :— ఇక్కడ తాత్కాలికంగా కట్టబడినటువంటి ఉద్యోగస్థుల గృహాలు ఇప్పటికే చాలవరకు శిథిలమై అయిపోయ్యే పరిస్థితిలో కనబడుతున్నాయి. ఇప్పుడైనా ఆ ఉద్యోగస్థుల గృహాలను నిర్మించేదానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA :— మరామత్తులన్నీ పూర్తిచేశామని నా సమాధానంలో ఉంది.

Sri RAJA V. V. KRISHNAMRAJU BAHADUR :— Frishermen Co-operative society లు అని చెప్పారు. వాండ్లకు ఏ రూపంలో ఎక్కడ మీరు సహాయం చేస్తున్నారో చెప్పగలరా ?

The Hon. Sri G. LATCHANNA :— అరకులో చేపలు లేవండి.

Sri S. VEMAYYA :— ఇప్పుడు Araku valley ఎంత విస్తీర్ణాన్ని cover up చేస్తుంది ? ఎంత విస్తీర్ణంలోపల అక్కడ వుండే ఉద్యోగస్థులు ఎంత జనాభాకోసం పాటుపడుతున్నారో తెలవిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:— 191 ఎకరములకు సంబంధించినటువంటి కార్యక్రమం ఇక్కడ జరుగుతున్నది. ఇప్పుడు ఇరిగేషన్‌వల్ల 129 ఎకరాలు సాగు అవుతున్నది.

Sri S. BRAHMAYYA :—Araku valley లో ఇంకా భూములు అమ్మకానికి ఉన్నట్లు భోగట్టా చెప్పగలుగుతారా ?

The Hon. Sri G. LATCHANNA:- వెంటనే చెప్పలేను. సభ్యులు వ్రాస్తే విచారించి తెలియచేస్తాను.

Sri K. V. S. PADMANABHA RAJU:— ఒకటి మీ దృష్టిలోనికి తెస్తున్నాను. Question hour లో ఉన్నది ఏవిధంగా ఉందంటే, సభ్యులువేసిన ప్రశ్నలకు సరియైన సమాధానం ఇవ్వకపోవడం, ఆలోచనలో ఉందని చెప్పడం, లేక పోతే నోటీసుఇవ్వండిఅనేధోరణిలో వెళ్ళుతున్నదేతప్ప, supplementary question అవసరంలేదేమో. నేను answer చేస్తే సరిపోతుందేమో ? అందు చేత మంత్రిగారు question వచ్చినప్పుడు తొలిరోజు prepare అయి దానిని answer చేయాలనే ఉద్దేశంతో రావాలి గాని ప్రతిదానికి సరియైన సమాధానం లేకుండా ఆలోచనలో ఉంది అనే ధోరణి బాగాలేదు అని అనుకొంటూను.

Mr. SPEAKER :—You seem to say that the information given by the Minister is not satisfactory.

Sri PILLALAMARRI VENKATESWARLU :— There is no information at all, Sir.

Mr. SPEAKER :— The difficulty will be avoided by the hon. Members putting more specific questions.

The Hon. Sri G. LATCHANNA :- అది సభ్యుల అభిప్రాయం కావచ్చును. గౌరవసభ్యులు వేసిన ప్రశ్నకు సంబంధించిన file వస్తుంది. ఒక ప్రశ్న వేశాం. అందులో మరొక ప్రశ్న ఇమిడిస్తాం అంటే, భోగట్టా మళ్ళీ రావాలి. వెంటనే సమాధానం ఇక్కడనే రావాలంటే, మొదట వ్రాసినపుడే జ్ఞాపకం పెట్టుకొని ప్రశ్నివేస్తే బాగుంటుందని నా మనవి.

Sri PILLALAMARRI VENKATESWARLU :— జ్ఞాపకం పెట్టుకొని ప్రశ్నవేసినపుడు దానికి సంబంధించింది ఏమిటి ? 31 లక్షలు ఖర్చుపెట్టామన్నారు. ఎంత ఎలాటు చేశారంటే, దానికి information లేదు. 169 ఊళ్ళ

ఉన్నాయని అన్నారు. జనాభా ఎంతఅంటే information లేదు. వెంటనే ఉండే దానికికూడ సమాధానం లేకపోతే చాలకష్టం.

Mr. SPEAKER :— Hon. Member can have saparate questions wherever necessary.

Sri M. MATCHARAJU :— అధ్యక్షా, చింతపల్లిలో సిల్కుఫారం గురించి నిరుడే రెండు లక్షలు ఖర్చుచేస్తామన్నారు. వాండ్లకు ఇల్లువగైరా ఏమిలేదు. చింతపల్లిలో Silk Farm Industry ని గురించి ఇంకా అభివృద్ధి చేస్తామన్నారే?

Mr. SPEAKER :—Araku valleyని గురించి మనం మాట్లాడుతున్నాం.

Sri M. MATCHARAJU :— చింతపల్లిలోకూడ ఎక్కువపెట్టవలెనని నాకోరిక.

Sri P. KODANDARAMAYYA :— కాంగ్రెసు ఈ ఉద్యోగాల విషయమై ఏదోచెప్పారు. అక్కడ ఉండేటటువంటి tribes people యొక్క progress ను గురించి ఏమైనా చెప్పుతారా? ముఖ్యంగా ఆ భూములు యిదివరకు tribes people దగ్గరనుంచి తీసుకున్నారు. మళ్ళీ వాండ్లకు ఎన్ని భూములు తిరిగి ఇచ్చారు? ఎంతవ్యవసాయం చేస్తున్నారు? వారికి ప్రభుత్వం ఇచ్చేటటువంటి సహాయం ఏమిటి? అవి కొంచెం దయచేసి చెప్పవలెనని కోరుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA :–Tribes peopleకు tractors ద్వారా ఆధునిక పరికరాలు ద్వారా వ్యవసాయము నేర్పుతూ ఉన్నట్లుగా, భోగట్టామాత్రం తెలియజేసిఉన్నారు. మరి ఇపుడు 129 ఎకరములు department వారి అజ్మాయిషి క్రిందనే, tribes people చేత సాగుబడి చేయిస్తున్నట్లు భోగట్టా ఇందులో ఉన్నది. ఆసామివారిగా ప్రతికుటుంబానికి ఎంతెంత భూములు యిచ్చింది, పూర్తిభోగట్టా ఇక్కడ లేదు.

Sri C. SUBBARAYUDU :— ఈ మధ్య పత్రికలలో బెంగాలునుంచి evacuee లను అరకు వాలిలో settle చేస్తారని వార్త పడ్డది. ఆ ఆలోచన ఉందా? మంత్రిగారికి తెలుసునా?

The Hon. Sri G. LATCHANNA:— ఇంతవరకు దానిని గురించి ఈ మంత్రివర్గము వచ్చిన తరువాత ఉత్తర ప్రత్యుత్తరాలు జరగడంలేదు.

Sri P. SATYANARAYANA :— Araku valley silk పరిశ్రమ అభివృద్ధికి పెట్టే ఖర్చు సెంట్రల్ సిల్కు బోర్డువారి contribution నుంచా, లేక రాష్ట్ర ప్రభుత్వము నుంచి ఖర్చు పెట్టుతున్నారా? రెండవది, అక్కడ జరుగుతున్నటువంటి సిల్కు పరిశ్రమ అభివృద్ధిలోఎంత progress జరిగిందో స్పష్టముగా మనవిచేస్తారా?

The Hon. Sri G. LATCHANNA:— ఇటీవలనే ఒక వ్యవసాయిక సంబంధములో ఇచ్చినటువంటి return మీదనే సిల్కు పరిశ్రమను గురించి కూడా information వచ్చింది. Silk పరిశ్రమ ఇటీ

వలనే ఏర్పాటు చేసినట్లు కనుపిస్తుంది. అందుచేత return ను గురించి వివరములు లేవు.

Sri A. C. SUBBA REDDI:-Araku valley లో summer resorts క్రింద ఇండ్లు కట్టుకొనుటకు ఉచితంగా ఇండ్ల స్థలములు ఇవ్వడానికి వీలుందా ?

The Hon. Sri G. LATCHANNA:— ఇటీవలనే ప్రభుత్వము కొంతమంది దరఖాస్తులను పరిశీలించి కొంత ఖరీదుకే ఇస్తున్నదిగాని ఉచితముగా ఇచ్చేపద్ధతి లేదు.

*Extension of the life of the Municipal Councils* :

212.

*530. Q: Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state whether there are proposals with the Government to extend the life of the Municipal Councils from three years to five years ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:— This suggestion was made by the Chamber of Municipal Chairmen. The matter is under consideration.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— పురపాలక సంఘాధ్యక్షుల సంఘసూచనప్రకారం సూచన వచ్చింది. ఈప్రభుత్వం ఆలోచిస్తున్నది.

Sri S. VEMAYYA :—ప్రభుత్వంవారు ఈపురపాలకసంఘాధ్యక్షులసంఘము నుంచి వచ్చిన తీర్మానాలను పురస్కరించుకొని వెంటనే 5 సంవత్సరములకు చేసేదానికి పూనుకొంటారా ? లేక పాతపద్ధతి ప్రకారమే ఇది ఉంచుతారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :- ఇది పురపాలకసంఘాధ్యక్షుల సంఘసూచన, ఇది పురపాలక సంఘాలదికాదు. ఆలోచనలో ఉంది అని మనవిచేశాను.

Sri P. SURYANARAYANA :— అధ్యక్షా, ఇపుడు జనవరి సరికి పురపాలక సంఘాలు ఏర్పడుతాయికదా, ఈలోపున యీ ఆలోచన తేలుతుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :- జనవరి అని ఎక్కడ చెప్పలేదు. అక్టోబరుతో ఆఖరు అయిపోతుంది. వీలైనంత త్వరలో పైసలు చేయబడుతుంది.

Sri S. BRAHMAYYA :— ప్రస్తుతం అధికారంలో ఉన్న పురపాలక సంఘాధ్యక్షుల ఎన్నికలు జరుగవు. వారు తీర్మానాలుచేసి పంపాము అని అంటున్నారు. ఈ ఎన్నికలు ఈ లోపున జరుపుటకు ఏర్పాటుచేశారా లేక వారి సూచనను అనుసరించి పొడిగించడానికి తలపెట్టారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — ప్రభుత్వ ఆలోచనలో ఉందని మొదటిలోనే మనవిచేశాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— అక్టోబరులో ఆఖరు అయిపోతుందన్నారు. ఆఖరు అయ్యేలోపున వెంటనే ఎన్నికలు జరిగేందుకుగాను ఇప్పటినుంచి కార్యక్రమం తీసుకోనేదానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—ఎన్నికల ప్రణాళికలో ప్రస్తుతం ఉన్న ప్రకారం జరుగుతుందిగాని 5 సంవత్సరములకు extend చేయడం అని decide చేస్తే, postpone అవుతుంది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:— మీరు ఏదో త్వరగా నిర్ణయం తీసుకుంటే బాగా ఉంటుంది. ఇపుడే election వస్తుందని ఊళ్ళలో పోట్లాటలు ఎక్కువ అవుతున్నాయి. Postpone చేసేటట్లయితే పోట్లాటలులేకుండా పోతాయి. వెంటనే జరుపుతామంటే పోట్లాటలు ఉంటాయి. పరిష్కారంచేసి త్వరగా నిర్ణయం చేస్తారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— నాయొక్క సూచన ఏమంటే election కు తయారుకమ్మనే. అయినప్పటికి ఆలోచనలో ఉంది అని చెప్పుతూ ఉన్నాను.

Sri V. VISWESWARA RAO :– పురపాలక సంఘాధ్యక్షులు 5 సంవత్సరాలు చేయమని, ఏ పురపాలకసంఘమైనా సరే 5 సంవత్సరములు చేయకూడదని, 3 సంవత్సరములలోనే ఎన్నికలు జరుపవలెనని చెప్పి ఏమైనా తీర్మానాలు పంపిందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— కొన్ని పురపాలక సంఘాలు extend చేయడానికి వీలులేదని అర్జీలు పంపించాయి.

Sri PILLALAMARRI VENKATESWARLU :– 5 సంవత్సరాలకు ఒకవేళ చేయతలచుకొంటే ఇపుడు ఉన్న పురపాలక సంఘాలకు వర్తిస్తుందా లేక కొత్తగా ఎన్నిక అయి వచ్చిన పురపాలకసంఘాలకు వర్తింస్తుందా ?

The Hon. Sri A. B. NAGESWARA BAO :— ప్రస్తుతం ఉన్న పురపాలక సంఘాల జీవితం పొడిగించబడితే తక్కినవికూడ పొడుగించబడుతాయి.

Sri A. YERUKU NAIDU :— అధ్యక్షా ! కొన్ని మునిసిపాలటీలలో Special Officers time లో wards విభజన సరిగాలేదు. ఇప్పుడు పునర్విభజన చేయవలసిందని మునిసిపాలిటీలు కోరారు. రాబోయే ఎన్నికలకు అటువంటి పునర్విభజనకు ప్రభుత్వము అనుమతి ఇస్తుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— Wards విభజన చేయడానికి ప్రస్తుతం సావకాశం లేదు. దానికి చాలా కాలాతీతమవుతుంది. కాబట్టి ఈ ఎన్నికలలో ఆపని జరుగదేమో అనుకొంటాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇప్పుడున్న పురపాలక సంఘాలు, ఈ మూడు సంవత్సరాలలో అపివేయడమా, లేకపోతే, ఇంకా పొడిగించడానికి ప్రయత్నం చేస్తున్నారా ?

Mr. SPEAKER :— It is hypothetical.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ప్రస్తుతము ఉన్న పురపాలక సంఘములయొక్క జీవితము విషయం కూడ ఆలోచనలో ఉన్నది.

*Fishermen Co-operative Societies in the State :*

213.

* 35. - Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) the number of Fishermen Co-operative Societies in the state for 1953–54, and

(b) the nature of assistance given to them.

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) There were 188 fishermen co-operative societies on 30–6–1954.

(b) The following concessions are granted to them :

1. Leases of fishing rights in all tanks and water-courses on an average rental of the preceding 5 years, without public auction in preference to Panchayat Board of the locality and private individuals.

2. Leases of forest coupes (specified areas in a block of forest) on a rental equal to the average of preceding five years without auction, as in the case of other backward classes and scheduled castes.

3. Scriptory grants to pay for part-time clerical work or for maintaining clerical establishment on a limited scale to write up accounts :

4. Exemption from contributing from their net profits to the audit fund under Rule XII [a] of the Rules framed under the Madras Co-operative Societies Act VI of 1932.

5. Exemption from payment of yarn licence fees to deal in yarn under the Madras Yarn Dealers' Control Order, 1948.
6. Free services of Junior Inspectors of Co-operative Societies for organising and supervising fishermen Co-operative Societies.

Besides the above concessions, proposals for supplying fishing hooks and mechanised boats, at subsidised rates and for supplying vans for transporting the catches of fish to marketing places at concessional rates to the Fishermen Co-operative Societies are under contemplation.

Sri S. VEMAYYA :—మంత్రిగారు చెప్పినప్పుడు ఈ చెరువులలో చేపలు మాత్రం వేలంపెట్టేటం కాకుండా సొసైటీలకుఇస్తామని చెప్పారు. కాని ఇప్పుడు గ్రామాలలో వీటిని సొసైటీలకు ఇవ్వకుండా వేలముపద్ధతి అనుసరిస్తున్నారు. Co-operative Department వాళ్ళు సిఫార్సులు చేస్తే Revenue Department వాళ్ళు మరొకరేటు వేస్తున్నారు. ఈ రెండు మానేసి Fisheries Department వాళ్ళు మరొకరేటు వేస్తున్నారు. ఇది ఈవిధంగా మూడు రకాలుగా ఉంటున్నది. వీరందరికి co-operation కుదిరి ఏ డిపార్టుమెంటునైనా final గా ఉంచేటట్లు చేసేదానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :- అటువంటిది జరుగుతున్నట్లే నాకు తెలియదు. ఏదైనా specific case నా నోటీసుకు తీసుకొనివస్తే దానిమీద చర్యతీసుకొంటాను.

Sri P. SREERAMULU :— ఈ Fishermen Co - Operative Societies లో సభ్యులుగా చేరవలసింది, ప్రత్యేకంగా ఆ కులమువారేనా లేక ఈ వృత్తిలో ఉన్నటువంటి ఏ కులాలవారైనా చేరవచ్చునా ?

The Hon. Sri D. SANJIVAYYA :-- ఆ వృత్తిఉంటే చేరవచ్చును. వృత్తి చాలును.

Sri G. YELLAMANDA REDDI :— ఈ సొసైటీలకు ప్రభుత్వం ఇచ్చిన హక్కులు సక్రమంగా అమలు పెట్టుకోడానికి వీలులేకుండా కలిగే ఆటంకాలను ప్రభుత్వము తొలగించడానికి ప్రయత్నం చేస్తుందా, అలాంటివి ఏవైనా వారి దృష్టికి వచ్చాయా ?

The Hon. Sri D. SANJIVAYYA.:— ఎల్లప్పుడు ప్రయత్నం చేస్తూనే ఉన్నాము. అటువంటిది నా దృష్టికి ఏమి రాలేదు.

Sri PRAGADA KOTAIAH :— ఈ చేపల అమ్మకంకోసం vans ఏవో ఇవ్వబడు తున్నాయని అంటున్నారు. ముఖ్యంగా గుంటూరు జిల్లా కోస్తా

ప్రాంతములో ఉన్నటువంటి ఈ చేపల పారిశ్రామికులకు ప్రత్యేకంగా ఇలాంటి van ఒకటి supply చేసేందుకు ప్రభుత్వము పూనుకొంటుందా ?

The Hon. Sri D. SANJIVAYYA :— సహాయం చేయవలెననేటటు వంటి ఉద్దేశం ప్రభుత్వానికి ఉన్నది. తప్పకుండా చేస్తాము.

Sri S. VEMAYYA :— మంత్రిగారు, scriptory grant ఇస్తున్నామని చెప్పారు. ఇది ఏ యే జిల్లాలవారికి ఎంతెంత ఇచ్చారో తెలవిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఇన్ని details ఇప్పుడు చెప్ప లేను. ప్రత్యేకప్రశ్న వేయండి.

Sri A. BAPINEEDU:— చేపల సొసైటీలని చెప్పి ఇది ఒక వ్యక్తిక్రింద తయారై కొందరు అక్కడ కలతలు పెడుతున్నారనేది ప్రభుత్వం నోటీసుకు వచ్చిందా ?

The Hon. Sri D. SANJIVAYYA :— మీరు చెప్పడం తప్ప నాకు ఇదివరకు ఏమిరాలేదు. వ్రాత పూర్వకంగా ఇస్తే అక్కడకూడ ఏమి జరుగు చున్నదీ విచారించి చర్య తీసుకొంటాము.

Sri PRAGADA KOTAIAH :—ఈ సంఘాలకు సరియైన నాయకత్వము లేక, వాటి పనులు సమన్వయం చేసే టటువంటి విధానాన్ని ప్రభుత్వము తీసుకోనందు వల్ల, ఈ సంఘాలు సక్రమంగా పనిచేయడంలేదు. అందువల్ల వీటిని సమన్వయం చేయ డానికి రాష్ట్ర మొత్తంమీద ఒకరాష్ట్ర చేపలపనివారి సహకార సంఘాన్ని పెడుతారా?

The Hon. Sri D. SANJIVAYYA :— అటువంటి ఆలోచన ఇప్పటికి లేదు. సంఘాలన్నీ సక్రమంగానే పని చేస్తున్నాయని అనుకొంటాను. ఎందువల్ల నంటే ఒక్కొక్క సంఘానికి Junior Inspectors ను ఇస్తున్నాము. ఇంకా వాటికి free గా కొన్ని జాగాలు ఇస్తున్నాము. బాగానే జరుగుతున్నాయి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా ! Colombo plan క్రింద మన ఆంధ్ర రాష్ట్రానికి కొన్ని mobile vans వగైరా వచ్చాయని చెపుతున్నారు. చేపల transportation sea coast లో ఏర్పాటు చేసుకోడానికి ఈ Colombo plan క్రింద cars, vans, staff కొంత ఇస్తారా? ఈ plan గురించి పత్రికలలో వచ్చిన వార్త నిజమేనా !

The Hon. Sri D. SANJIVAYYA:— పత్రికలలో వచ్చిందేమోగాని నా వరకు ఏ information రాలేదు.

Sri B. SANKARAIAH :— Fishermen Co-operative Societies చేసేటటువంటి పనులకు ఆటంకాలు కలుగచేస్తున్నారనే విషయం మంత్రిగారి నోటీసుకు రాలేదన్నారు. మేమంతాకూడా ముఖ్యమంత్రిగారికి ఒక పిటీషన్ ఇచ్చాము. ఏ మంత్రి కిచ్చినా అది concerned department కు రాదా ?

The Hon. Sri D. SANJIVAYYA:—దీనికి రెండు Departmentsతో సంబంధము ఉన్నది. ఒక వైపున Fisheries Department ఉన్నది.

ఇంకోవైపు Co-operative Department తో ఉన్నది. Fisheries కు సంబంధించినటువంటి petitions, Fisheries incharge ఉండే మంత్రికి పోతాయి. Co-operative Societies లో ఏదైనా ఇబ్బంది ఉంటే ఉద్యమంగా గాని, ఇతర ఆటంకాల మూలకంగా గాని, అవి నాకు వస్తాయి.

Sri K. SUBBA RAO ;— ఇప్పుడు Fishermen Co-operative Societies అని అంటున్నారు. Fish Consumers Co-operative Societies organize చేస్తే ఇస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA:— ఆలోచిస్తాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇప్పుడు చేపలకోసమై రెండు Departments ఉన్నాయని చెప్పారు. చేపలన్నీ ఒకే మంత్రి గారి వద్దకు వచ్చేటట్లు చేస్తారా ? (నవ్వు)

The Hon. Sri D. SANJIVAYYA:— దానికి మీరు సహకరించాలి.

*Bridge between Gudur and Manubole on the G. N. T. Road :*
214.

*468. Q: Sri P. GOPALAKRISHNA REDDI (Put by Sri P. Ranga Reddi):- Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

[a] whether the Government are aware that the bridge between Gudur and Manubole on G. N. T. Road was breached about four years back; and

[b] if so, when the bridge construction will be completed ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

[a] The answer is in the affirmative.

[b] As the bridge is on the National Highways namely, the Madras-Calcutta Road, the work requires the sanction of the Government of India. An estimate for Rs. 14,43,000 for diverting the National Highway near Gudur and constructing a single bridge across the Upputeru in this section instead of reconstructing the collapsed bridge and the other weak bridges on the existing alignment has been forwarded to the Government of India. The work will be begun as soon as the Government of India accord their technical approval and financial sanction to the estimate.

Sri P. RANGA REDDI :— ఈ bridge పడిపోయి నాలుగు సంవత్సరాల పైబడి అయిందని అంటున్నారు. తరువాత National Highways డిపార్టుమెంటు

వారు యీ నాలుగు సంవత్సరాలుగా అక్కడ ఏమైనా ఏర్పాట్లుచేసి, రవాణా జరుపుతున్నారా? తాత్కాలికంగా నైనా ఏర్పాట్లు ఏమైనా చేశారా? చేస్తే ఏమిచేశారు?

The Hon. Sri. N. SANJEEVA REDDI :- తాత్కాలికపు diversion కు కావలిసిన ఏర్పాట్లు అన్నీ చేశారు. మొదట్లో ఈ bridge నే కట్టాలని అనుకున్నారు. కాని యీలాంటివే, అక్కడ రెండుమూడు కాలువలు దగ్గర దగ్గరగా కలుస్తున్నవి. వాటికి వేరు వేరుగా బ్రిడ్జిలు కట్టేబదులు ఒక్క మైలు దూరములోనే యీ చిన్న చిన్న నదులు, ఉప్పుటేరు వగైరాలు కలుస్తున్నవి కాబట్టి, వాటి అన్నిటికి కలిపి ఒకే బ్రిడ్జి strong గా కట్టితే గట్టిగా వుంటుందని, వేరే కొత్తగా ప్లాను తయారుచేసి పంపించారు. ఈ కొత్త ప్లాను యీ సంవత్సరమే పంపించారు. త్వరలోనే శాంక్షనుఅయివస్తుంది. ఛీఫ్ యింజనీరుగారు ఢిల్లీ పోయినప్పుడు అక్కడ వారితో మాట్లాడారు. శాంక్షను అయి రాగానే పని ప్రారంభిస్తాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— శాంక్షను కోసం సెంట్రల్ గవర్నమెంటుకు ఎప్పుడు పంపించారు?

The Hon. Sri N. SANJEEVA REDDI :— 1954 వ సంవత్సరం నవంబరు నెలలో Chief Engineer పోయి మాట్లాడారు. అంతకుముందు కొద్దిరోజులక్రితమే పంపించారు అనుకుంటాను.

Sri S. VEMAYYA :— ఇది National Highways Road. మద్రాసునుంచి పోయే రోడ్లలో యిది చాలా ముఖ్యమైనరోడ్డు. పోయిన ఎసెంబ్లీ సమావేశములోగూడా యిదే ప్రశ్న దీన్ని గురించి వచ్చింది. కాబట్టి యీ రోడ్డు యొక్క ప్రాముఖ్యము గమనించి, 1954 వ సంవత్సరము నవంబరులో Chief Engineer వెళ్ళి వచ్చారన్నప్పుడు, అటుతరువాత ఎన్ని reminders పంపిచారు? వెంటనే యీ bridge ని repair చేసే యేర్పాట్లు చేయడానికి ప్రభుత్వము పూనుకుంటుందా?

The Hon. Sri N. SANJEEVA REDDI :— సెంట్రల్ గవర్నమెంటువారి శాంక్షనువచ్చేవరకూ దాన్ని రిపేరుచేయించే అధికారము మనకు లేదు. తరువాత ఎన్ని నెలలు, ఏ దినము, ఏ గంట, అని అడిగితే, దానికి information నావద్ద యిక్కడలేదు. కనుక వేరే ప్రశ్న వేస్తే చెప్పగలను. రెండు నెలలకొకసారి reminders గూడా పంపుతూనే ఉంటారు. ఈ పని మనము చేయవలసిందికాదు. శాంక్షను రానిదే ప్రారంభించడమంటే 'it will be our responsibility. Therefore we will have to await the approval of the Government of India.'

Sri V. VISWESWARA RAO :— ఈ బ్రిడ్జిపోయి నాలుగు సంవత్సరాలు అయిందని చెబుతున్నప్పుడు 1954 నవంబరులో శాంక్షను కోసము, అంత ఆలస్యంగా పంపటానికి కారణమేమి? అప్పటివరకు యీ ప్రభుత్వము యీ బ్రిడ్జి అవసరము గుర్తించలేదా? దాని విషయములో ఏదైనా proposals ఆలోచిస్తూనే ఉన్నారా?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

ఈ బ్రిడ్జి 1952 వ సంవత్సరం డిశంబరులో పడిపోయింది. తరువాత రెండు సంవత్సరాలు పట్టింది. గవర్నమెంటు పక్షములో రెండు సంవత్సరాలంటే నాలుగు సంవత్సరాలక్రింద లెక్కలోకి తీసుకోవచ్చు. కాబట్టి 1952 డిశంబరు నుంచి యిప్పటివరకూ నాలుగు సంవత్సరాలు యింకా కాలేదు. బ్రిడ్జి 1952 డిశంబరులో పోయింది. తరువాత 1953, 1954 and odd అయింది. అంటే రెండేళ్ళ ఆరుమాసాలు యిప్పటికి అయింది. ప్లాను పంపింది నవంబరులో. అంతవరకు మనం మద్రాసులోనే వున్నాము. అప్పటివరకు అక్కడ వుండగా యేమిచేశారని అడిగితే, దానికి నేను సమాధానము చెప్పలేను. బ్రిడ్జి మరల original గా కట్టాలని original estimates 12 లక్షలకు వేశారు. చెడిపోయిన బ్రిడ్జి కట్టాలంటే అది సరియైనదికాదని ఆ ప్లానుఅంతా మార్చారు. ఆ చెడిపోయినబ్రిడ్జి కట్టితే, ప్రక్కన అన్ని బ్రిడ్జిలుగూడా చాలా weak గా వున్నవి. గనుక అది గట్టిగావుండదని దానికి ప్లానుఅంతా మార్చవలసి వచ్చింది. ఇంకా చిన్న చిన్న బ్రిడ్జిలు ఒక ఫర్లాంగు రెండు ఫర్లాంగుల దూరములోనే రెండు కట్టవలసిన అవసరంవుంది. గూడూరులో Congestion ఎక్కువగా వున్నదని అందరికీ తెలుసు. దాన్ని avoid చేయవచ్చు. వీటిఅన్నిటికి నాలుగు అయిదు బ్రిడ్జీలు కట్టే బదులు ఒకే బ్రిడ్జి Upputeru మీద dams గా కట్టవచ్చు అనేది మంచి సలహాగాతోచింది. అందువల్ల దీనికి ఖర్చు రెండులక్షలు యింకా ఎక్కువ అయినప్పటికినీ, ఒకే బ్రిడ్జి కట్టాలని యింకొక ప్లాను పంపించారు. అది శాంక్షను అయివస్తుంది. రాగానే పని ప్రారంభిస్తాము.

*Village Servants in certain villages of Rajampet Taluk :*

215.

* 316. – Q. Sri P. VENKATASUBBAYYA :— Will the Hon. the Minister for Revenue be pleased to state : whether it is a fact that in certain villages in Rajampet taluk, Cuddapah District, there is only one village servant for doing duty with the Village Karnam as well as the Village Munsiff ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

There are no ryotwari villages in Rajampet Taluk in which only one village servant is doing duty under both the Village Munsiff and the Village Karnam. There are however 3 small shotriam villages in which only one village servant is working under both the Village Munsiff and Village Karnam as their population and beris are both limited.

Sri P. VENKATASUBBAYYA :— Population, ల్యాండు రెవెన్యూ తక్కువగా వున్నందువల్ల ఒక్కొక్కరే పనిచేస్తున్నారని అంటున్నారు. పని

22nd July 1955]

తక్కువగా వున్నందున వారిని ఎన్నో శతాబ్దాల క్రింద appoint చేసి వుంటారు. ఇప్పుడు పని పెరిగింది కాబట్టి, కరణం దగ్గర ఒకరు, మునసబు దగ్గర ఒకరు వుండేటట్లు ప్రభుత్వము appoint చేస్తుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— పని పెరగడం గాని, లేక ఒక్కొక్కప్పుడు వైశాల్యము ఎక్కువగా వుండేటటువంటి పరిస్థితులు గాని ఏమైనా ఏర్పడితే, అప్పుడు ఆ ఆలోచనలు జరుగుతుంటాయి. అలాంటి పరిస్థితులున్నప్పుడు appointments కూడా జరుగుతాయి.

Sri S. NARAYANAPPA :— ఈ నౌకర్లకు యిచ్చే జీతాలు చాలా స్వల్పంగా వుంటాయి. కాబట్టి, వారి జీతాలు ఎక్కువ చేయటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— వేరే ప్రశ్న వేయండి.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ప్రభుత్వమువారు స్వాధీనము చేసుకున్న ఈనాము గ్రామాలలో యింకా తలారీలను ఎవరిని appoint చేయలేదు. పైగా పాతవాళ్ళను మాత్రం తొలగించారు. వాళ్ళను మరల appoint చేయటానికి consider చేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— అటువంటివి ఏమైనా చెబితే ఆలోచిస్తాము.

Sri G. YELLAMANDA REDDI :—చిన్న చిన్న గ్రామాలకు కరణము మునసబు ఇద్దరుగా వుంటున్నారు. ఇటువంటి గ్రామాలలో యిద్దరు village servants వుండడానికి ప్రభుత్వానికి ఆక్షేపణ వున్నదా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— ఒక్కొక్కచోట రెండు మూడు చిన్న గ్రామాలకు కర్ణము, మునసబు, యిద్దరినిగూడా కలిపి ఒక్కరుగానే వుంటారు. వీరు triune officer అనే పేరుతో ఒక్కరుగానే వుండడం వున్నది.

Sri B. SANKARAIAH :— ఇద్దరు నౌకర్లు వుండవలసినచోట ఒక్కరే వుంటే అతడు ఒక్కడే పనిచేయుటానికి కష్టమని అనుకున్నాము. అందువల్ల యిద్దరు వుండేచోట్ల యిద్దరిని appoint చేయటానికి ఆలోచిస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— జనాభా తక్కువగావున్న చిన్నచిన్న గ్రామాలకు ఇద్దరిక్రింద ఒక్కడే నౌకరు వుంటాడు.

Sri T. JIYYAR DAS :— అధ్యక్షా, ఈ గ్రామ నౌకర్లను నియమించే సందర్భములో వారసత్వం అనేది కేవలం హరిజనులమధ్యనే వున్నది. ఇది యింకెవరికైనా సంక్రమించేటట్లు చేస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— వారసత్వపు హక్కులు వుండేది కరణము మునసబులకే ?

Mr. SPEAKER :—Please repeat your question.

Sri T. JIYYAR DAS :– నౌకర్లను appoint చేసేటప్పుడు యీ నౌకరి కేవలం హరిజనులమధ్యనే వారసత్వంగా వుంటున్నది. దీన్ని యింకొకజాతికి సంక్రమించేటట్లు ప్రభుత్వం చేస్తుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— వారసత్వపు హక్కులు వుండేవారికి వారసత్వపు హక్కు లుంటాయి.

Sri D. KONDAYYA CHOWDARI :— ప్రభుత్వమువారు స్వాధీనము చేసుకున్న Estate గ్రామాలలో కొన్ని సుమారు నాలుగు, అయిదు, ఆరువేల రూపాయల వరకూ లాండు రెవిన్యూ వచ్చేవి వున్నవి. అటువంటి గ్రామాలలో ఒక్కరే నౌకరు వుంటున్నాడు. అతడు ఒక్కడే యీ కరణము మునసబుల మధ్య తిరగలేక యిబ్బంది పడుతూ వుంటాడు. ఇంతవరకు అతడు Estate నుంచి కొద్ది జీతాలు తీసుకుంటున్నాడు, యిప్పుడు ఆ గ్రామాలు ప్రభుత్వము క్రిందకు వచ్చినప్పుడు, యితర నౌకర్లతోబాటు అతనికి జీతము ఎక్కువ చేయటానికి వెంటనే ప్రభుత్వము యోచన చేస్తుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— అటువంటివి వుంటే ఆలోచిస్తామని నేను యిదివరకే మనవిచేశాను.

*Industrial Housing Scheme in the State :*

216.

*654. Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

[a] the number of houses built in 1953-54; 1954-55 up to the end of March under the Industrial Housing Scheme in the State; and

[b] the action taken for construction of houses for the Industrial Labour in the State ?

The Hon. Sri G. LATCHANNA :-

| | | | | |
|---|---|---|---|---|
| [a] | 1953–54 | ... | ... | Nil. |
| | 1954–55 | ... | ... | 143. |

[b] This Government are encouraging private employers to apply and secure Central assistance under the scheme of the Government of India for construction of houses for their workers.

22nd July 1955]

Sri S. VEMAYYA:— మంత్రిగారు సమాధానము చెబుతూ 1953-54 లో యిళ్ళు ఏవీగూడా కట్టబడలేదని 1954-55 లో 143 కట్టాపని చెప్పారు. ఇటువంటి సందర్భములో ప్రభుత్వము సెంట్రల్ గవర్నమెంటు నుంచి డబ్బు తీసుకొని ప్రైవేటు ఏజన్సీలకు యిచ్చి యిళ్ళుకట్టించేందులు ప్రభుత్వమే యీ యిళ్ళు కట్టే policy ని adopt చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :— ప్రభుత్వం డబ్బు తెచ్చి ప్రైవేటు వారికి యివ్వడం అనేదికాదు. కేంద్రప్రభుత్వముయొక్క స్కీములోనే ప్రైవేటు industrialists దరఖాస్తు పెట్టుకుంటే కేంద్ర ప్రభుత్వము గూడా కొంత లోను కొంత subsidy యిస్తుంది. కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన పరిశ్రమలలో యిళ్ళు కట్టే విషయములోనే రాష్ట్రప్రభుత్వము ఆలోచిస్తుంది.

Sri K. V. S. PADMANABHA RAJU :— అధ్యక్షా, 1954-55 లో ఆంధ్రప్రభుత్వానికి ఎంత గ్రాంటు యిచ్చారు ? అలాంటప్పుడు factory ownersకు యిందుకు గాను దరఖాస్తులు ఏవైనా వున్నవా ? ఎన్ని grants వచ్చాయి ? గ్రాంట్లు వచ్చినప్పుడు ఎవరైనా యీ గ్రాంట్లు తీసుకున్నారా ? తీసుకోక పోతే దానికి కారణము ఏమిటి ?

The Hon. Sri G. LATCHANNA:— రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వము grant యిచ్చే విధానము లేదని యిప్పుడే వేమయ్యగారికి మనవి చేశాను. కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వానికి యిళ్ళు కట్టటానికి గ్రాంటు యివ్వదు. ప్రైవేటు industrialists వుంటే, వారు యిళ్ళు కట్టడానికి ప్రయత్నము చేస్తే రాష్ట్రప్రభుత్వము సిఫార్సుమీద వారికి కొంత అప్పు కొంత subsidy యిచ్చేపద్ధతి వుంది. ఈ పద్ధతి ప్రకారంగా వారు ప్రైవేటుకంపెనీలు అయితే 50% loan, 50% subsidy యిస్తారు. అప్పుమీద 4½% వడ్డీ పుచ్చుకుంటారు. ఇచ్చిన అప్పు తిరిగి 25 వాయిదాలలో పుచ్చుకుంటారు. అంత పెద్దమొత్తాలు కో ఆపరేటివ్ సొసైటీలు ఇళ్లు కట్టడానికి పుచ్చుకుంటే 50% అప్పు, 25% subsidy యిస్తారు. వడ్డీ 4½% పుచ్చుకుంటారు. యిచ్చిన అప్పు 25 వాయిదాలలో తీసుకుంటారు. Employees మామూలుగా గ్రామాలలో కట్టడానికి ప్రయత్నించినప్పుడు వారికి 37½%అప్పు, 25% గ్రాంటు ఇస్తారు. 4½% వడ్డీ 15 వాయిదాలలో చెల్లించాలి. ఇది కేంద్ర ప్రభుత్వముయొక్క విధానము. రాష్ట్ర ప్రభుత్వము కట్టడానికి ప్రారంభముచేస్తే ఒక్క దమ్మిడీకూడా grant యివ్వరు. రాష్ట్ర ప్రభుత్వము తమయొక్క డబ్బుతోనే కట్టుకోవాల్సి వుంటుంది.

Sri K. SUBBA RAO :— Motor Transport Workers కు యిళ్లు కట్టించటానికి proprietors దరఖాస్తు పెట్టుకుంటే వారు Industrial Housing Scheme క్రిందకువస్తారా ? వస్తే, వారికి subsidy యిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :—తప్పకుండా వారు వస్తారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఎన్ని industrial concerns వీటికోసం దరఖాస్తులు పెట్టుకున్నాయి. పెట్టుకుంటే, ప్రభుత్వము ఎన్నిటిని సిఫార్సు చేసింది ?

The Hon. Sri G. LATCHANNA :—

(1) ANDHRA SUGARS LIMITED, TANUKU :

అప్పు రు. 84,450 లు
సబ్సిడీ రు. 54,000
Quarters 72 యిళ్లుగల స్కీము.

(2) ANDHRA CO-OPERATIVE SPINNING MILLS, GUNTAKAL :

అప్పు రు. 1,81,350
Grant రు. 1,20,000
Quarters 200 యిళ్లుగల స్కీము

(3) LAKSHMI SATYANARAYANA FACTORY, CUDDAPAH :

ఇది 12 యిళ్ళకు సంబంధించిన స్కీము.

ఇందులో అప్పు రు. 10,110
Grant రు. 6,700

ఇవి యిప్పుడు ప్రభుత్వం పరిశీలనలో వుంటున్నవి. ఇదివరకు ప్రభుత్వము చేత గ్రాంటుపొంది కట్టబడినవి.

(4) Andhra Cement Company వారు యింతవరకు 50 యిళ్లు complete చేశారు. ప్రభుత్వము యొక్క అనుమతి యివ్వబడి శాంక్షనుఅయిన స్కీములకు దరఖాస్తులు పెట్టుకున్నారు. వాటికి వివరాలు మాత్రం నేను యివ్వగలను.

Sri P. KODANDARAMAYYA :— ఈ సహాయము urban industrial housing కేనా లేక rural housing కు, cottage industries కు కూడా ఇస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :—Rural housing scheme మీద ఈ శాసనసభలో గతవారం చర్చ జరిగింది. ఈ Scheme లు వేరు. ఇది industrial housing కు సంబంధించిన ప్రశ్న.

Sri PILLALAMARRI VENKATESWARLU :— గవర్నమెంటు 'రన్' చేస్తున్నటువంటి industrial concerns కు కేంద్ర ప్రభుత్వము ధన సహాయం ఇవ్వదు అని చెప్పారు. వీటిని industrial concerns గా తీసుకొని కేంద్ర ప్రభుత్వానికి ఈ Industries కు కూడా ఇవ్వాలని మన ఆంధ్ర ప్రభుత్వం తెలియజేయడానికి ఆలోచిస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA :—ఒక్క ఆలోచనే కాదు, చర్చించడము, తర్కించటము, లేదనిపించుకోవడము అన్నీ జరిగాయి.

22nd July 1956]

Sri P. SREERAMULU :- ఈ స్కీములో గుంటూరు తాలూకా శీతా నగరమువద్దర ఏదైనా కాలనీ ఏర్పాటుచేసే ఆలోచన ప్రభుత్వమువారికి ఉన్నదా ?

The Hon. Sri G. LATCHANNA :— గుంటూరువద్దర. Ex-criminal tribes colony ప్రభుత్వం కట్టింది, నిర్వహిస్తున్నది.

Sri A. C. SUBBA REDDI :- ఈ స్కీము వ్యవసాయ కూలీలకు ఏమైనా వర్తిస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA :- కోదండ రామయ్యగారి ప్రశ్నకు చెప్పిన సమాధానమే దీనికికూడా వర్తిస్తుంది.

Sri G. YELLAMANDA REDDI :- అధ్యక్షా, ప్రభుత్వం కొన్ని గ్రాంటులు అప్పులుఇస్తున్నది. అలాంటప్పుడు కార్మికులకు యిండ్లువుచితంగా ఇస్తారా ? లేక బాడుగకు ఇచ్చేట్లయితే బాడుగ నిర్ణయించే అధికారం ప్రభుత్వానికి వున్నదా?

The Hon. Sri G. LATCHANNA :- బాడుగలు నిర్ణయించే విషయంలో ప్రభుత్వానికి అధికారము ఏమీలేదు.

Sri K. V. S. PADMANABHA RAJU :- మంత్రిగారు పరిశీలనలో వున్నదని చెప్పారు. ఎన్నాళ్ళకు ఈ పరిశీలనలు పూర్తిఅవుతాయి ? ఎప్పటికి వాళ్ళు డ్రాచేయడానికి authorisation ఇవ్వగలరు ?

The Hon. Sri G. LATCHANNA :- Estimate లు స్కీములు అన్ని పూర్తిఅయి sanction అవగానే కార్యక్రమము వీలైనంత త్వరలో ప్రారంభిస్తాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇప్పుడు గవర్నమెంటువద్దర డబ్బుతీసుకొని ఇళ్ళుకట్టి ఇండస్ట్రియల్ concerns వాళ్ళ ఇష్టము వచ్చిన లాభములతో అద్దెలను వసూలుచేస్తున్నట్లు తెలుస్తున్నది. దానిని గవర్నమెంటు కొంచెము కంట్రోలు చేసేటటువంటి పద్ధతి ఆలోచిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :— వారి ఇష్టము వచ్చినటువంటి లాభాలు ఎక్కడ అయితే పుచ్చుకుంటున్నారో గౌరవసభ్యులు తెలియజేస్తే labour department ద్వారా తప్పకుండా విచారిస్తాము.

Sri V. VISWESWARA RAO :-అధ్యక్షా, మంత్రిగారు సెలవిస్తూ 1954-55 లో 143 ఇళ్ళు కట్టించామని చెప్పారు. అవి ఏవి కన్‌సరన్స్? అందులో ఆంధ్రసిమెంటు ఫ్యాక్టరీ 50 ఇళ్ళు కట్టిందని చెప్పారు. అవి ఖాళీగా వున్నాయని చెప్పబోతూ మరల మాట్లాడ్డము మానేశారు. ఏవి కన్‌సరన్స్, క్రింద ఈ 143 ఇళ్ళు కట్టించారు? వివరాలు చెప్పుతారా ?

The Hon. Sri G. LATCHANNA :- ఆంధ్ర సిమెంటు కంపెనీవారు 50 ఇళ్ళు పూర్తిచేశారు. 50 ఇళ్ళుపూర్తికాబోతున్నవి. K. C. P. Ltd., వారు 93 ఇళ్ళు పూర్తిచేశారు. ఇంకా 7 ఇళ్ళు పూర్తికాబోతున్నవి.

Sri PILLALAMARRI VENKATESWARLU :— కట్టినటువంటి ఇళ్ళకు ప్రభుత్వమువారు ఏ విధంగా అద్దెలు వసూలుచేస్తున్నారో చెప్పగలరా ?

The Hon. Sri G. LATCHANNA :— వేరే ప్రశ్న వేస్తే తప్పకుండా జవాబు చెబుతాను.

Sri G. YELLAMANDA REDDI :- అధ్యక్షా ! మన ప్రభుత్వానికి కంట్రోలుచేసే అధికారం లేదని చెప్పారు. ఇప్పుడు ఆ సిమెంటు ఫ్యాక్టరీ దగ్గర కట్టిన ఇళ్ళలో అద్దెలు జాస్తీగా వున్నాయని చెప్పి కార్మికులు చేరటములేదని ప్రభుత్వానికి తెలుసునా ? ఈ పరిస్థితులు ఇలా వున్నప్పుడు కేంద్రప్రభుత్వాన్ని మనము దీనిని కంట్రోలుచేసే విషయము అడగడానికి వీలుంటుందా ?

The Hon. Sri G. LATCHANNA :— ఈ విషయాన్ని గురించి వారం రోజులక్రిందటే ఇక్కడ ఫ్లోరుమీద చర్చించుకున్నాము. ఏదైనా విషయం వుండి తెలియజేస్తే మధ్యవర్తిత్వము వహిస్తాను అని మనవిచేశాను.

Mr. SPEAKER :—The question is whether the Government will control the house rent.

The Hon. Sri G. LATCHANNA:—అవకాశము లేదనిచెప్పి 30 పర్యాయములు మనవి చేసినట్లు నాకు జ్ఞాపకమువుంది.

*Establishing of Andhra Panchayat Engineering Service :*
217.

*834. Q:— Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) Whether the Government propose now to establish Andhra Panchayat Engineering Service : and

(b) If so, the details of the scheme ?

The Hon. Sri A. B. NAGESWARA RAO:-

(a) A separate Engineering service called the 'Andhra Panchayat Engineering Subordinate Service' has been ordered to be constituted.

(b) The details of the 'Andhra Panchayat Engineering Subordinate Service' are in G. O. Ms. No. 315, [i] L. A. dated 14th March, 1955 as amended in G. O. No. 427 [ii] L. A. dated 21st April, 1955 copies of which are placed on the table of the House.

---

[i] Vide appendix I at page 237 infra
[ii] Vide appendix II at page 240 infra

Sri S. VEMAYYA :— ఈ ఇంజనీర్లకు service conditions, scales ఏవిధంగా fix చేస్తారు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఇంజనీర్లకు ఇదివరకు ఏ స్కేలు వున్నదో అదే స్కేలు ఇస్తారు. కొత్తరూల్సు చేయడానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:–ఇప్పుడు ఈpercen-tage పంచాయితీబోర్డులకు ఎంత ఇవ్వాలని నిర్ణయించారు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — 100 కి 1½ ఇవ్వాలని నిర్ణయించాము.

Sri N. RAMULU :- ఈ Panchayat Engineering Service ఖర్చు పంచాయితీలే భరించాలన్నారు. పంచాయితీలు భరించడము అంటే చాలా కష్టంగా వుంటుంది. ఆంధ్రప్రభుత్వము ఎందుకు భరించకూడదు ?

The Hon. Sri A. B. NAGESWARA RAO — ప్రభుత్వానికి దానిని భరించేందుకు ఆర్థికస్తోమత లేదు.

Sri S. NARAYANAPPA:— ఈ పంచాయితీ ఇంజనీరింగు సర్వీసును మేజరు పంచాయితీలకే అన్వయింపజేస్తున్నారా ? లేక మైనరు పంచాయితీలకు కూడా అన్వయ మవుతుందా ? మైనరు పంయిచాతీలలో కూడా తీసుకోవలసినటు వంటి పనులు విచారిస్తున్నారు కాబట్టి వాటిని చురుగ్గా చేసేదానికి ప్రయత్నముచేస్తారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO —ఈ ఇంజనీరింగు సర్వీసు మేజరు పంచాయితీలకు, మైనరు పంచాయితీలకు, కలిపియే వున్నది.

*Sales Tax Appeal cases :*

218.

* 168. Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Co-opeartion and Commercial Taxes be pleased to state :

[a] the number of Sales Tax Appeal cases received ;

[b] the number of cases disposed of ;

[c] the number pending ; and

[d] the amount of revenue foregone by Government for the year 1954 by "Sales Tax Tribunal's award.' ?

The Hon. Sri D. SANJIVAYYA :-

[a] 655 including 129 pending on 1-1-'54.

[b] 400 disposed of during 1954.

[c] 255.

[d] Rs. 2,14,118-15-7.

equipment for the Andhra Special Armed Police for the year 1954-55.?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

A total sum of Rs. 2,63,047/- has been spent towards the purchase of arms and equipment for the Special Armed Police.

Sri P. RANGA REDDI :— Arms and equipment అంటే ఏమిటి కొన్నారండీ ?

The Hon. Sri N. SANJEEVA RDDDI :— ఏవో గుడ్డలు, చెప్పులు, టోపీలు మొదలగునవి ఉంటాయి.

Sri B. SANKARAYYA :— ప్రస్తుతమున్న శాంతి పరిస్థితులలో కూడా S. A. P. అవసరమని ప్రభుత్వము భావిస్తున్నదా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— ప్రస్తుతం శాంతి పరిస్థితులు ఉన్నా రానున్న పరిస్థితులకు కూడా తయారుగా ఉండాలి.

Sri S. NARAYANAPPA :— S. A. P. వారిని recruit చేయడానికి ఎప్పుడెప్పుడు పిలుస్తారు ? లేక ప్రతి సంవత్సరము పిలుస్తారా ? ఈ వివరములు మంత్రి గారు సెలవు ఇచ్చెదరా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— మదరాసునుంచి చాలా మంది వచ్చారు. తరువాత disband అయిన వాళ్ళను కొంతమందిని చేర్చారు. అయినా వారిని ఎప్పుడు పిలుస్తారో నాదాకా రావు. నాకు సమాచారము తెలియదు. కావాలంటే సమాచారము తెప్పించి చెప్పెదను.

Sri PRAGADA KOTAIAH :— అయినదానికి, కానిదానికి, హింసను అవలంభించేవారు ఉన్నంతవరకు ఇలాంటివి అవసరంకాదండీ ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— అలాంటి పరిస్థితులకు తయారుగా ఉండాలని చెప్పానుగా మరి.

Sri PILLAMARRI VENKATESWARLU :— అయినదానికి కానిదానికి అబద్ధాలు హింసను ప్రోత్సహించేవారిమీద ఉపయోగించడానికి కదండీ ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— Police ఉన్నది అందుకేగా. అయితే అది ఎవరికి అన్వయిస్తుందో మరి.

*Buildings taken over under the Estates Abolition Act, 1948.*

221.

*641. A/Q : Sri P. GOPALAKRISHNA REDDY :—Will the Minister for Revenue be pleased to state : the number of buildings taken over by the Government under the Estates Abolition Act, 1948, in Nellore District ?

The Hon. Sri K. CHANDRAMOULI :— The number of buildings taken over by the Government is 12.

Sri PILLALAMARRI VENKATESWARLU:— తీసుకొన్నవి గాక ఇప్పుడు అక్కడ ఎన్ని buildings ఉన్నాయండి ?

The Hon. Sri K. CHANDRAMOULI:— అందులో గదులుకూడా చెప్పాలా ? ఇంకా buildings ఉంటే తప్పక తీసుకుంటారు.

Sri PILLALAMARRI VENKATESWARLU:— తీసుకోడానికి చట్టంలో loop-hole ఉన్నదని తీసుకోవటము లేదనే విషయము మంత్రిగారికి తెలుసు ననుకుంటాను. ఆచట్టాన్ని సవరించడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI:— చట్టములో loop hole కాదు. దానిలో బాగా విచారణజరిగి న్యాయం జరగాలి.

Sri B. SANKARAYYA:—వెంకటగిరిలో చాలా buildings ఉన్నవి. ఇప్పుడేమైనా తీసుకున్నారా లేక తీసుకొనే ఆలోచన ఉన్నదా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— ఇప్పుడు తీసుకున్నది వెంకటగిరిలో town hall మాత్రమే.

Sri N. C. SESHADRI: కొన్ని estate గ్రామములలో శ్రోత్రియందారులు ఉన్న buildings తీసుకోలేదు. అక్కడ వారికి భూములులేవు. ఆ buildings ను ఏమి చేయాలండీ ?

The Hon. Sri K. CHANDRAMOULI:–శ్రోత్రియందారులున్నవి కొన్ని buildings తీసుకున్నారు.

Sri K. V. S. PADMANABHA RAJU:— ఇప్పుడు తీసుకున్నవాటికి compensation యిచ్చారా ?

The Hon. Sri K. CHANDRAMOULI:—Buildings కు compensation యివ్వరు.

Sri G. YELLAMANDA REDDI:— అధ్యక్షా, ఇప్పుడు వెంకటగిరి, కనిగిరి, పొదిలి, దర్శి తాలూకాలలో ప్రభుత్వము తీసుకున్నది. కాని అక్కడవుండే State buildings ప్రభుత్వము ఉపయోగించనందున buildings చాలా పాడై పోయినవి. వీటిని తీసుకొని వుపయోగించుకొనే విషయం ప్రభుత్వము consider చేస్తుందా?

The Hon. Sri K. CHANDRAMOULI :— ప్రభుత్వమునకు ఉపయోగపడేవాటిలో offices పెట్టారు. ఏమైనా పాడైపోయిన buildings ఉంటే వాటిని మరమ్మతు చేయుటకు ప్రభుత్వం ప్రయత్నిస్తుంది.

Sri S. VEMAYYA :— Buildings ఎక్కడెక్కడనుంచి తీసుకున్నారు? అవన్ని మంచి condition లో ఉన్నవా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— Town hall at Venkatagiri, ఎస్టేటు తాలూకా ఆఫీసు, నాయుడుపేట: ఎస్టేటు తాలూకా ఆఫీసు, పొదిలి: ఎస్టేటు తాలూకా ఆఫీసు, కట్టుబ్రిందపల్లి, కురిచేడు ; పాలూరు ; మనుబోలు ; వీరనపాల్లి ; పోతకమూరు ; పాలపాడు; నుండి.

Sri G. YELLAMANDA REDDI :— అధ్యక్షా, నాకు తెలిసినంత వరకు ఈ భవనములు చాలవరకు ఉపయోగపరచబడములేదు. పాడైపోతున్నవి. వాటిని public ఉపయోగమునకు గాని, లేదా అమ్ముటకుగాని ప్రయత్నం చేస్తారా.

The Hon. Sri K. CHANDRAMOULI :— ఖాళీగాఉంటే తప్పకుండా ఆలోచిస్తాము. స్కూల్సుకుగూడా యిస్తాము.

Sri N. VENKAIAH :—ఎస్టేటుబిల్డింగులు చాలా అధ్వాన్నముగా నున్నవి. వాటి మరమ్మతులను గురించి ఆలోచిస్తారా ?

The Hon. Sri K. CHANDAMOULI :— ఇదివరకే సమాధానము చెప్పాను.

## *II. ADJOURNMENT MOTION re : Proposed Strike by the Andhra Provincial Electricity Employees' Union.*

Mr. SPEAKER :— The hon. Member Sri B. G. M. A. Narasinga Rao has given notice of an adjournment motion which reads :

"That this House should adjourn to discuss a matter of great public importance and urgency arising out of the strike decision of the Andhra Provincial Electricity Employees' Union for the failure of the Government to implement the conditions of the agreement entered into between the Chief Engineer for Electricity and the Union, with regard to the payment of increments and other facilities"

As the Electricity Demand is coming up for discussion, this motion anticipates discussion on that demand. So, I rule it out of order.

Sri PILLALAMARRI VENKATESWARLU :— On a point of Informanion, sir, ఈ విధంగా adjournment motions యిచ్చినప్పుడు మీరు adjournment motions అన్నీ గూడా ఆలోచించి అవసరమైనవన్నీ అజెండాలోనే వున్నవని అంగీకరించి, ఎంతమంది దానికి అనుకూలంగా వున్నారో నిలుచోమని అన్నప్పుడు, adjournment motion యిచ్చిన సభ్యుడు గూడా నిలుచోవలెనా, నిలుచోకుండాకూడా వుండవచ్చునా ?

Mr. SPEAKER :— It is only after I give permission that question will arise. I may say for the information of the House that I am not bound to bring every adjournment motion to the House and read it. I can refuse consent in my chamber if I find no case. If the object of the motion is only for publicity, I certainly rule it out of order in my chamber itself and I do not read it at all here in the House.

Sri PILLALAMARRI VENKATESWARLU :— నేను అడిగిన information అదికాదండీ. ఇప్పుడు ఏదైనా adjournment motion ఒకటి అవసరమేనని మీరు అంగీకరించనట్లుగా గుర్తిస్తే, దానిని allow చేస్తారా?

Mr. SPEAKER :- Certainly.

Sri PILLALAMARRI VENKATESWARLU :- నేను నోటీసు యిచ్చిన adjournment motion విషయములో నేనుగూడా నిలుచోవలసిన అవసరము వుందా, లేదా అని నేను అడుగుచున్నాను.

Mr. SPEAKER :- When I call him to read his motion, that arises.

Sri PILLALAMARRI VENKATESWARLU :- No, Sir. When you admit that.

Mr. SPEAKER :— I have not admitted it.

Sri PILLALAMARRI VENKATESWARLU :- I am not speaking about this, Sir,

Mr. SPEAKER :- Hypothetical questions need not be answered.

Sri PILLALAMARRI VENKATESWARLU :- I am asking for information, Sir. I am not speaking on this. I only want information so that it may guide members when they give adjournment motions.

Mr. SPEAKER :-It is only when I call the member to read the motion. In cases where I admit it he will rise. In other cases I will read it myself, or I will not read it at all and I rule it out in my chamber.

[Note:- An asterisk at the commencement of a speech indicates revision by the member.

[22nd July 1955

## III. BUDGET FOR THE YEAR 1955 - 56.

### *Voting of Demands for Grants (Continued)*

### *Demand XXII - Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes.*

The Hon. Sri G. LATCHANNA :—

Mr. Speaker Sir, On the recommendation of the Governor, I move :

"That the Government be granted a sum not exceeding Rs. 99,99,600/- under Demand XXII - Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes."

ఈ డిమాండును ప్రతిపాదిస్తూ గౌరవసభ్యుల దృష్టికి ఈ దిగువ వివరాలు తీసుకు రావలచుకున్నాను. 1951 జనాభా లెక్కలను బట్టి చూస్తే మన రాష్ట్రంలో 2,07,07,801 మంది జనాభా వున్నది. ఇందులో backward classes, scheduled castes, scheduled tribes కు సంబంధించిన వారి వివరాలు ఈ దిగువరీతిగా వున్నవని మనవి చేస్తున్నాను. Scheduled castes లో 39 కులాలవారు వున్నారు. వారి జనాభా 27,22,949. వారు మొత్తం జనాభాలో 13.3% వున్నారు. వీరిలో చదువుకున్నవారు 6.22% వున్నారు. Ex-criminal tribes మన రాష్ట్రంలో 62 కులాలవారు వున్నారు. వారి జనాభా మొత్తం 2,03,343. వీరు మొత్తం జనాభాలో 0.9% వున్నారు. వీరిలో చదువుకున్నవారి సంఖ్యావివరాలు ప్రభుత్వంవారికి లభ్యంకాలేదు. Other backward classes లో 77 కులాలవారున్నారు. వీరి మొత్తం జనాభా 70,40,316. వీరి జనసంఖ్య మొత్తం జనాభాలో 34.3% వీరిలో చదువుకున్న వారి సంఖ్య 10.26% వుంటుంది. మన ప్రభుత్వం ఏర్పడినప్పటినుంచి ఈ వెనుకబడిన జాతులకు, హరిజనులకు, గిరిజనులకు, నేరస్థ జాతులకు అందరికి సాంఘిక ఆర్థిక అభివృద్ధి కలిగించాలనే ఆలోచనచేత మొట్టమొదట 1949 లో ఇప్పుడు Social Welfare అనే పేరుతో పిలువబడుతున్న డిపార్టుమెంటు ఏర్పడింది. దానికి జిల్లా కలెక్టరు హోదా కలిగినవ్యక్తి డైరక్టరుగావుండి జిల్లాల్లో కలెక్టర్లు, వారి సలహాలమీద వ్యవహారము చేయగలిగిన District welfare officers ద్వారా పరిపాలన సాగుతోంది. ఇందులో ముఖ్యంగా జరుపబడుతున్న కార్యక్రమాలు మూడు విధాలుగా వుంటున్నాయి. ఒకటి విద్య, రెండవది ఆరోగ్యం, మూడవది సాంఘిక అభివృద్ధి. 1953-54 వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన ఆరు మాసాలలో రు. 30,40,000 లు ఖర్చు పెట్టారు. 1954-55 వ సంవత్సరంలో రు. 60,29,000 లు ఖర్చు చేశారు. 1955-56 వ సంవత్సరములో రు. 50,53,000 లు ఖర్చు చేయడానికి బడ్జెటులో ఏర్పాటు చేయబడింది. విద్యాభివృద్ధి విషయమై ప్రభుత్వము చేసే కార్యక్రమాల్లో labour schools, ఉచిత వసతి గృహాలు, స్కాలరుషిప్పులు,

betterment grants, mid-day meals, పుస్తకాలు, విద్యకు సంబంధించిన పరీక్షలరుసుములు ఏర్పాటు చేయబడి వున్నాయి. హరిజనులు ఎక్కువగా ఏ స్కూలు వారికి అందుబాటులో లేని పరిస్థితుల్లో Harijan welfare schools ప్రత్యేకం ఏర్పాటు చేయడం ఇందులోని ప్రత్యేకత. ఈ స్కూళ్ళల్లో చదివేవారికి పుస్తకాలు కొనుక్కోడానికి మధ్యాహ్నం భోజనానికి కూడా ఉచితంగా సౌకర్యాలు చేయబడినాయి. తద్వారా హరిజన బాలబాలికలకు చదువుయెడల ఆసక్తి కల్పించాలనే యీ కార్యక్రమం సాగించబడుతోంది. ఇండ్ల స్థలాల విషయములో ప్రతి సంవత్సరం కొంత డబ్బును ఏర్పాటును చేస్తున్నా, 1954-55 సంవత్సరములో అదనంగా 10 లక్షల రూపాయలు special fund ఏర్పాటుచేసి ప్రత్యేకంగా ఇండ్ల స్థలాలు సమకూర్చే కార్యక్రమం తొందరగా పూర్తి చేయించ డానికి acquisition తదితర పద్ధతుల ద్వారా 13 మంది special officers నియమించబడినారు. విద్యా విషయంలో residential and non-residential grants ఇస్తున్నారు. హరిజనులలో స్కాలరు షిప్పులు లెక్కలు చూస్తే 1953-54 వ సంవత్సరములో ఆరుమాసాలకు హైస్కూళ్ళలో 507 విద్యార్థులకు కాలేజీలలో 497 మందికి ఇవ్వబడినవి. హైస్కూలు విద్యార్థులకు 90 వేల రూపాయలు కాలేజీ విద్యార్థులకు ఒక లక్ష 50 వేల రూపాయలు ఖర్చు అయినది. క్రిస్టియనులుగా convert అయిన హరిజనులకు కూడా 1953-54 వ సంవత్సరం 6 మాసాల్లో హై స్కూ లు వి ద్యా ర్థు ల్లో 96 మందికి 18 వేల రూపాయలు కాలేజి విద్యార్థుల్లో 458 మందికి ఒక లక్షా 36 వేల రూపాయిలు ఖర్చు అయినది. Examination fees క్రింద ప్రభుత్వం ఇంతవరకు 1100 మంది హరిజనులు గాని హరిజనులుగావుండి Christians గా మారినవారికి కాని 19 వేల రూపాయలు పరీక్ష రుసుముల క్రింద 1953-54 వ సంవత్సరం 6 మాసాల్లో ప్రభుత్వం చెల్లించింది. ఇంక రాష్ట్రములో నడపబడుతున్న హాస్టలు లెక్కల వివరాలు ఇస్తాను. ప్రభుత్వ ఆధిపత్యాన గాని subsidised hostels గాని 333 రాష్ట్రములో నడుపబడుతున్నాయి. వీటిలో 11 ప్రభుత్వము నడుపుతోంది; ఇందులో 3 girls hostels, 8 boys' hostels.

1955-56 వ సంవత్సరములో మరి రెండు hostels ఏర్పాటు చేయడానికి orders ఇచ్చాము. 455 Harijan Welfare Schools మన రాష్ట్రంలో వున్నాయి. ఇందులో రెండు High Schools. వాటిలో 95 మంది ఉపాధ్యాయులు వున్నారు. వీటిల్లో 32,478 మంది హరిజన బాలబాలికలు చదువు కొంటున్నారు. ఖర్చు రు. 2,86,705 లు అవుతోంది. మొత్తం ప్రభుత్వం నడిపే హాస్టల్సు క్రింద అయినఖర్చు రు. 80,585 లు. Private Hostels 336కు గాను రు. 8,98,900 లు ఖర్చు అయినది. ప్రైవేటు హాస్టల్సులోవున్న విద్యార్థులసంఖ్య 8,560 మంది. ప్రభుత్వ హాస్టల్సులోవున్న విద్యార్థులసంఖ్య 756 మంది. Harijan converts and other eligible communities వారు 19 మందికి non-residential scholarships ఇవ్వడం జరుగు

తోంది. దీనిక్రింద రు. 4,282 లు ఖర్చుచేయబడ్డది. Backward classes విషయంలో మొత్తం 401 విద్యార్థులకుగాను రు. 1,64,461 లు ఇస్తున్నారు. Residential and non-residential scholarships క్రింద రు. 57,664 లు ఇవ్వడం జరిగింది. సంగ్రహంమీద హరిజనుల అభివృద్ధికి ఈ ప్రభుత్వం జరుపుతున్న కార్యక్రమాలు స్థూలంగా మనవిచేశాను. సాంఘిక అభివృద్ధిశాఖ నిర్వహణలో హరిజనులకు జరుపుతున్న కృషిని చర్చించడానికి ఏప్రెల్ 18 వ తేదీన హరిజన శాసనసభ్యులతో ఒక Conference ను ఏర్పాటు చేయడం జరిగింది. అందులో శాసనసభ్యులు అనేకమంది ప్రభుత్వం నడిపిస్తున్న హరిజన అభ్యుదయ కార్యక్రమాలు గురించి చర్చించి, సలహాలు సూచనలు చేశారు. ప్రభుత్వం ఇచ్చిన నివేదికకూడా Conference లో చర్చించబడింది. హరిజనులకు ఆరోగ్యం, మంచినీటి సదుపాయాలేకాక వైనందిన జీవితంలో ఆర్థిక అభివృద్ధి కల్గించడానికి చేతిపరిశ్రమలు మున్నగు వాటిని అభివృద్ధి పరచాలనే సూచనకూడా చేయడం జరిగింది.

దీనితోబాటుగా హరిజన హాస్టల్సు మీద చాలవరకు చర్చలు జరిగాయి. హాస్టల్సు సంపూర్ణంగా బాల బాలికలకు సక్రమంగా ఉపయోగపడడం లేదనీ అందుచేత వాటిని ప్రభుత్వం నిర్వహిస్తే బాగుంటుందని కొంతమంది శాసనసభ్యులు సలహాలివ్వడం జరిగింది. దానిననుసరించి ఆసలహాలు ప్రభుత్వం విచారించి కొన్ని బాగుగాలేవని అభిప్రాయ పడుతున్న 20 హాస్టల్సు ప్రభుత్వం నిర్వహించడానికి orders జారీచేయడం జరిగింది. అదనంగా ప్రభుత్వం కొత్తగా నిర్వహించడానికి 10 హాస్టల్సుకు grants, recognition withdraw చేస్తూ అక్కడి బాల బాలికలందరికి కూడా వసతి కల్పించడానికిగాను, ప్రభుత్వం ఆయా కేంద్రాలలో బాధ్యతనిర్వహించడానికి తీర్మానించి orders జారీచేశారు. ఈ బాధ్యత నిర్వహణకు అదనంగా 48,400 రూపాయలు ఖర్చవుతుంది. ఈ ఖర్చు చేయడానికి ప్రభుత్వం సమ్మతించి orders జారీ చేసినదని తెలియజేస్తున్నాను.

తరువాత ఇండ్లస్థలాల విషయంలో ప్రభుత్వం యిప్పటికి ఆరోగ్యానికి సంబంధించినంతవరకు ప్రభుత్వం అవలంభించిన విధానాలు మూడు అని చెప్పవచ్చు. అందులో ఒకటి పరిశుభ్రమైనటువంటి ఇండ్లస్థలాలు ఏర్పరిచాం. మరి వారికి ఆరోగ్యకరమైన మంచినీటి వసతులు కల్పించాలనీ, తరువాత వారి స్థలాలలో దారులు ఏర్పాటు చేయడానికి ఇతర స్మశాన భూములు లేకుండా వున్న హరిజన ప్రాంతములలో burial grounds ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం అవలంభించే పద్ధతులలో వున్నవి. నూతులు, చెరువులు విషయంలో నూతుల క్రింద Rural Welfare and Water Supply స్కీము క్రింద Revenue Department ద్వారా యీ కార్యక్రమాలు ఎక్కువగా జరపమని Public Health Authority కి వ్రాయబడింది. Public Health Authority అవసరాన్ని బట్టి హరిజనాభ్యుదయ నిధినుండి

మంచినీటి వసతి కల్పించడానికి చర్య తీసుకుంటుంది. ఇండ్లస్థలాలకు ప్రతివారికి ఒక గృహానికి కనీసం 5 సెంట్లు భూమయినా వుండాలనే ప్రాతిపదికమీద ఇండ్లస్థలాలు ఏర్పాటుచేయడానికి మాగాణిగాని, మెట్టగాని, దానికయ్యే ఖర్చు ప్రభుత్వమే భరిస్తూ ప్రత్యేకంగా సప్లయిచేయడం జరుగవలసియున్నది.

తరువాత యీ హరిజనాభ్యుదయ వ్యవహారంలో కేంద్ర ప్రభుత్వం నుంచి వస్తున్న సహకారం, అంటరానితన నిర్మూలనకు కేంద్రప్రభుత్వం ప్రత్యేక గ్రాంటులు ఏర్పాటుచేస్తున్నది. ఆ విధంగా గత 1954-55 లో కేంద్రప్రభుత్వం వారు యిచ్చిన 2 లక్షల గ్రాంటులోను 1 లక్ష 62 వేల గ్రాంటు ముఖ్యంగా హరిజనేతర హాస్టల్సులో హరిజన విద్యార్థుల ప్రవేశమునకు, హరిజన హాస్టల్సులో హరిజనేతర విద్యార్థుల ప్రవేశమునకు, అంటరానితన నిర్మూలన సూత్రం ప్రాతిపదికమీద ఖర్చయినది. ఇందులో ఇటీవల ప్రభుత్వం ఆవిధంగా 1 లక్ష 62 వేల రూపాయలు కేంద్రప్రభుత్వంయొక్క గ్రాంటు నుంచి ఖర్చుపెట్టడం జరిగింది. దీనికి సంబంధించి ఒకటి ప్రభుత్వం ఒక స్కీము కేంద్ర ప్రభుత్వానికి పంపడం జరిగింది. ఆంధ్ర హరిజన సేవక సంఘంవారు పంపించిన స్కీము కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. దానికి సంబంధించి propaganda విషయం అంద రికి సమానంగా ఒక సమం అయినటువంటి సాంఘిక సూత్రాలపైన వారికి విద్యా వసతి ఏర్పాట్లు జరపాలనే సూత్రాలకు సంబంధించిన స్కీములున్నవి. ఈ అంట రానితన నిర్మూలన కార్యక్రమంలో ప్రభుత్వవిధానం గురించి ప్రజలయొక్క కర్తవ్యాలగురించి హెచ్చరికపరచే కార్యక్రమం గురించి హరిజనసేవాసంఘంవారు ఒక స్కీము పంపించారు. అది 35 వేల రూపాయలు విలువ కలిగిన స్కీము. దానిని కేంద్రప్రభుత్వం ఆమోదించారు. ఈ ఏడాది అమలుపెట్టడానికి ప్రభు త్వం ఆలోచిస్తున్నారు. ఈ ఏడాది ప్రభుత్వం అంటరానితన నిర్మూలనకుగాను చేసిన స్కీము 2 లక్షల 5 వేల రూపాయలు విలువగలది, కేంద్రప్రభుత్వం ఆమో దించి పంపడంజరిగినది క్రిమినలు tribes విషయంలో మొదట మీకు మనవిచేసి నట్టు యిదివరలో 1954-55 revised estimate ఒకలక్ష 24 వేల రూపాయలు ఖర్చుపెట్టడంజరిగింది. ఈయొక్క criminal tribes అభివృద్ధిక్రింద 1955-56లో ఒక లక్ష 25 వేల రూపాయలు ఖర్చుచేయడానికి ఏర్పాటుచేసిన సంగతి గౌరవ సభ్యులకు తెలిసిన విషయమే. ఈ criminal tribes గుంటూరు చిత్తూరు, నెల్లూరు, అనంతపురం ప్రాంతాలలో ఎక్కువగా వున్నారు. వీరియొక్క సాంఘికాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి విషయంలో కూడా హరిజనులకు ఏ సూత్రాలపైన, ఏ పద్ధతులపైన కార్యక్రమం కొనసాగింపబడినదో అదే విధమైన కార్యక్రమాలు ఈ ex-criminal tribes పట్ల చేయబడుతుంది, దానికి కేంద్రప్రభుత్వం 1954-55 లో 2 లక్షల గ్రాంటు, 1955-56 లో 2 లక్షల రూపాయల గ్రాంటు ఏర్పాటుచేసింది. కాని గత ఏడాది రాష్ట్రప్రభుత్వంపంపించినటువంటి యీగ్రాంటును వారుsanction చేయడంలో జాప్యం అయినందువల్ల పూర్తిగా వినియోగించడానికి అవకాశం లేకపోయింది. అందువల్ల ఆ గ్రాంటును యీ ఏడాది వినియోగం చేయడానికి ప్రభుత్వం అవ

కాలం యివ్వవలసినదిగా కోరడమైనది. మొదటి పంచవర్ష ప్రణాళికలో యీ యొక్క ex-criminal tribes కు సంబంధించినంతవరకు ఒక స్కీము, elementary school స్థాపన గురించి, హాస్టల్సు ఏర్పాటుల గురించి తతిమ్మా హరిజనుల మాదిరి కార్యక్రమాలు ఏర్పాటు చేయడమే కాకుండా ప్రత్యేకంగా వారికి rural instruction నైతికభావాలు కలిగించుడానికి ప్రత్యేకమైన చిన్న కేంద్రాలు ఏర్పాటు చేయడం అనేది ప్రత్యేక కార్యక్రమంకు సంబంధించిన విషయం. ఆ విషయాలకు సంబంధించిన వాటిలో సిద్ధాపురం, సీతానగరం, స్టూవర్టుపురంలలో ప్రత్యేకమైన colony లు ఏర్పాటు చేయడం, ప్రత్యేక సిబ్బందివుండి పనిచేస్తున్న విషయం గౌరవ సభ్యులందరికి తెలిసిన విషయమే. తరువాత antimalarial measures యీ ex-criminal tribes కు ఏర్పాటు చేయడమైనది. వారికి ప్రత్యేకంగా యిండ్లు ఏర్పాటు చేయడమేకాకుండా వున్నయిండ్లు బాగుచేసుకోడానికి గ్రాంట్లు సహాయం చేయబోతున్నది ex-criminal tribes కు తరువాత వెనుకబడిన జాతులకు సంబంధించినంతవరకు ప్రభుత్వం వారి మొత్తం జనాభా వివరాలను ముందు తెలియజేశాము. వారికి విద్య నేర్పుకోడానికిగాను high school, college లలో చదువుకునేవారికి half scholarship ఏర్పాటు చేయడమైనది. Boarding scholarships, residential scholarships, non-residential scholarships ఏర్పాటు చేయడం, ఉద్యోగవసతులు, తదితర reserved Communites మాదిరిగా resreve స్థానాలకు ఏర్పాటుచేయడంజరిగింది. వీటినిగురించి యింతవరకు scholarships గాను, boarding grants కు గాను, పరీక్ష రుసుముకుగాను.

| | | | |
|---|---|---|---|
| 53-54 లో | — | 220 వేలు | |
| 54-55 లో | — | 530 వేలు | ఖర్చుఅయినది. |
| 56-57 లో | — | 530 వేలు రూపాయలు | ఖర్చుచేయడానికి |

ప్రభుత్వం ఏర్పాటుచేసినది.

Backward classes విషయములో 1954 ఆగస్టులో మన రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వము ఏర్పాటు చేసిన కమిషన్‌వారు పర్యటనచేసి ఉన్నారు. వారి రిపోర్టు కేంద్ర ప్రభుత్వానికి అందజేయబడింది. కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలు త్వరలో జరుగవలసియున్నది. ఆ నిర్ణయాలు వచ్చిన వెంటనే ప్రభుత్వము ఇతరత్రా అభివృద్ధి కార్యక్రమాలు ఏ విధంగా కొనసాగించడం అనే విషయము పరిశీలించ గలదని మనవి చేస్తున్నాను. మొత్తంమీద వెనుకబడిన జాతుల, హరిజనుల అభివృద్ధికిగాను first five year plan లో ప్రభుత్వము మొత్తము 190 లక్షల రూపాయలు ఖర్చు చేసే దానికి గాను ఒక పథకం వేసింది. దాని ప్రకారము Headquarters staff కు గాను 12 లక్షల రూపాయలు మాత్రమే ఖర్చు అవుతుంది. తరువాత ఎడ్యుకేషన్ క్రింద 143,05,334 రూపాయలు ఖర్చు అవుతాయి. Public health క్రింద 21,00,700రూపాయలు ఖర్చు అవుతుంది.

Other schemes క్రింద 12,00,825 రూపాయలు ఖర్చు జరుగుతుంది. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈ సూత్రము మీదనే ఈ స్కీములన్నీ అభివృద్ధి పరచుటకు గాను ప్రభుత్వం ఒకే పథకం తయారుచేసి కేంద్ర ప్రభుత్వ ఆమోదానికిగాను పంపినది. స్కీములయొక్క విలువ మొత్తము 662,29,000 రూపాయలు. ఇప్పుడు ఈ స్కీములను deficit budget వల్ల కొంతవరకు తగ్గించ వలెనను ప్రతిపాదనలు జరుగుతున్నాయి. ప్రభుత్వము దానిని గురించి చర్చిస్తున్నది. కేంద్ర ప్రభుత్వముతో చర్చించి ప్రస్తుతము తయారు చేసినటువంటి స్కీములు 286 లక్షలకు తగ్గించడానికి వస్తుందని గౌరవ సభ్యులకు తెలియజేస్తున్నాను.

తరువాత hill tribes forest ప్రాంతములకు సంబంధించిన విషయాలు కొన్ని మనవిచేస్తాను. hill tribes ఇంతవరకు ముఖ్యంగా శ్రీకాకుళం విశాఖపట్టణం, East Godavari ప్రాంతాలలోని agency areas లో ఎక్కువగా ఉన్నారు. ఆ ప్రాంతాలలో 5 లక్షలమంది hill tribes వారు నివసించుచున్నారు. ఈ hill tribes యొక్క విషయంలో కేంద్రప్రభుత్వం వారు వీరి అభివృద్ధినిగురించి ప్రత్యేకంగా కార్యక్రమం కొనసాగించవలెనని భారత రాజ్యాంగ చట్టములో ఏర్పాటుచేసుకొన్న విషయం గౌరవ సభ్యులందరకు తెలుసును. ఆ సూత్రం మీదనే మద్రాసు రాష్ట్రం అడవి ప్రాంతముల అభివృద్ధిని గురించి అడవి ప్రాంతములలో ఉండే ఈ గిరిజనుల అభివృద్ధిగురించి, మలయప్పన్ కమిటీని ఏర్పాటుచేయడం, మలయప్పన్ కమిటీవారు 1950-51 సంవత్సరంలో అడవి ప్రాంతములన్నీ పర్యటనచేసి వారియొక్క రిపోర్టు ప్రభుత్వానికి అందజేయడం జరిగింది. ఈ రిపోర్టులోని కొన్ని సలహాలను మాత్రమే వెనుకటి మద్రాసు ప్రభుత్వం అమలులోకి పెట్టడానికి ప్రయత్నం చేయడం జరిగింది. ఈ schedule areas లో ఎన్నో తెగలవారు ఉన్నారు. చెంచు వారు ఉన్నారు. వారు ఎక్కువగా కర్నూలు జిల్లా నల్లమల hills లో నివసించుచున్నారు. వారి జనాభా 4 వేలవరకు ఉంటుందని ప్రభుత్వం అంచనావేసింది. ఇదివరకు ఈ మలయప్పన్ కమిటీ రిపోర్టు సూత్రంపైని, మన ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత ఆంధ్ర ప్రభుత్వం 1954 జూలైలో ప్రత్యేకంగా ఒక డైరక్టరును Schedule areas, hill tribes యొక్క అభివృద్ధిని గురించి, పరిశీలనకోసం నియమించడం జరిగింది. ఆ డైరక్టరు కొంతకాలము కార్యక్రమం నడిపించిన తర్వాత నవంబరులో, ప్రత్యేక డైరక్టరు ఉండి పనిచేయతగినంత అవకాశం లేదని చెప్పి, ఆ డైరక్టరు పోస్టును కాళీచేస్తూ Deputy Director ఇప్పుడు ప్రభుత్వం ఏర్పాటుచేశారు. ఆ Deputy Director ను ఇప్పుడున్న Social Welfare Director యొక్క అధ్వర్యాన ఉండి పనిచేయడానికి గాను విశాఖపట్టణం కేంద్రగా ఏర్పాటుచేసి ఈ కార్యక్రమం కొనసాగించడం జరుగుతుంది. ఈ hill tribes అభివృద్ధినిగురించి ఇంతవరకు 1953-54 ఆఖరు అర్ధసంవత్సరంలో రు. 14,95,000 ప్రభుత్వం ఖర్చుచేసింది. 1954-55 లో రు. 29,49,000 ఖర్చు చేసింది. 1955-56 లో రు. 38,13,000 ఖర్చు చేయబడుతుంది. Constitution లోని atricle 275 (1) అనుసరించి ఈ అడవి ప్రాంతముల అభివృద్ధినిగురించి

Hill tribes అభివృద్ధినిగురించి కేంద్ర ప్రభుత్వంవారు రాష్ట్ర ప్రభుత్వాలకు ఆర్థిక సహాయం చేయాలి అనే సూత్రమును అనుసరించి మన రాష్ట్రంలో

1951-52 లో 4,00,000
1952-53 లో 8,60,000
1953-54 లో 7,60,000
1954-55 లో 12,03,000
1955-56 లో 15,00,000

కేంద్ర ప్రభుత్వమువారు ఏర్పాటుచేసిఉన్నారు. Aids & grants క్రింద కేంద్ర ప్రభుత్వము మన రాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చిన వివరములు ఇవి. ఇంతవరకు Hill tribes అభివృద్ధిని గురించి మనరాష్ట్ర ప్రభుత్వము క్రిందటి ఏడాది ఒక ప్రత్యేకమైన స్కీము ఏర్పాటు చేయడం జరిగింది. దానిని 1955-56 లో అమలు పెట్టుటకు ప్రభుత్వం ఏర్పాట్లు చేస్తుంది. ఈ స్కీము క్రిందనే ముఖ్యంగా చేతి పనులు రహదారి వసతులు కల్పించడం, agency ప్రాంతాలలో agricultural research జరిపించి వ్యవసాయాన్ని అభివృద్ధి జరిపించడం, కుటీర గృహ పరిశ్రమలు ఏర్పాటు చేయడం మున్నగు స్కీములు అన్నీ ఏర్పాటు చేయడం జరుగుతున్నది. మొత్తం State funds నుంచి

1951—52 లో రు. 6,00,031
1952—53 లో రు. 7,09,000
1953—54 లో రు. 8,71,000
1954—55 లో రు. 11,00,000 ఖర్చు చేయబడింది.

అడవి ప్రాంతాలను అభివృద్ధిపరచడానికి గాను రహదారి సౌకర్యాలను కల్పించవలసిన అవసరం చాలా ఉన్నదనే సంగతి గౌరవసభ్యులందరికి తెలుసును. రహదార్లు, రోడ్లు మున్నగునవి నిర్మించడానికిగాను ఒక ప్రత్యేక ఇంజనీరును, కొంత సిబ్బందిని ప్రభుత్వము sanction చేసింది. త్వరలోనే ఆ సిబ్బంది నియామకము జరుగబోతున్నది. క్రిందటిఏడు ప్రభుత్వము తయారుచేసినటువంటి Schedule Tribes Finance and Marketing Corporation Act ననుసరించి రెండులక్షల రూపాయల గ్రాంటు ప్రభుత్వాన్ని కోరడం జరిగింది. అయితే ఆ గ్రాంటు sanction మాత్రం మార్చినెలలో వచ్చినందువల్ల క్రిందటి ఏడాది దానిని అమలుపరచడానికి అవకాశం లేకపోయింది. ఈ ఏడాది ఆ డబ్బును వినియోగించుకోడానికి అవకాశము కల్పించాలని కేంద్రప్రభుత్వాన్ని కోరి ఉన్నాము. వారి ఆమోదము వస్తుందనే ప్రభుత్వము ఆశిస్తున్నది. కేంద్ర ప్రభుత్వం యొక్క ఆమోదం వచ్చేలోపల మన ప్రభుత్వమే ఆ స్కీమును అమలుపరచడానికిగాను 2 లక్షల రూపాయలు advance చేయడానికి Standing Finance Committee వారు తీర్మానం చేయడం జరిగింది. Standing Finance Committee వారి ఆర్డర్లు జారీఅయిన వెంటనే ఆ స్కీము అమలుపరచడానికి కార్యక్రమము ప్రారంభమవుతుంది. Hill tribes

యొక్క అభివృద్ధిగురించి అనధికార సంస్థలయొక్క సహకారము పొందడానికి, అనధికార సంస్థలను ప్రోత్సాహించడానికి ప్రత్యేకముగా ఒక ఐదు లక్షలు విలువ గలిగినటువంటి ఒక స్కీముకూడ ఈ second five year plan లో చేర్చబడింది. ఆ స్కీముకు ఆమోదం వచ్చిన తరువాత అది ఆచరణలో పెట్టడం జరుగుతుంది. ఈ విధముగా ప్రభుత్వము హరి జనులకు, మాజీనేరస్థుల జాతులవారికి, వెనుకబడిన తరగతులవారికి, గిరిజనులకు వీరి అభివృద్ధిగురించి ప్రత్యేకంగా వేరువేరుగా allotment చేసి కృషి చేస్తు న్నటువంటి విషయం అందరికి తెలిసినదే. వీటికి సంబంధించి హరిజనాభ్యుదయ కార్యక్రమాలను అప్పుడప్పుడు పరిశీలిస్తూ ప్రభుత్వానికి తగిన సలహా ఇవ్వడానికి గాను ఒక హరిజన వెల్ఫేర్ బోర్డు అనేది ఏర్పాటుచేస్తున్నారు. అదేవిధంగా backward classes కు ఒక బోర్డు, hill tribes కు ఒక బోర్డు ఉన్నవి. ఇప్పుడు ప్రభుత్వము Backward classes లో ఒక భాగంగా ఉంటూ కార్యక్రమము కొనసాగింపబడుతున్నటువంటి ఈ మాజీ నేరస్థులకు కూడ ప్రత్యే కంగా ఒక సలహా సంఘాన్ని ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో అనే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నది. దానిమీద త్వరగా నిర్ణయం జరిగి వారికి ప్రత్యేకంగా ఒక సలహాసంఘము ఏర్పాటు చేసినట్లయితే, మాజీ నేరస్థులయొక్క కార్య క్రమాన్ని పరిశీలించడానికి వీలుగా ఉంటుంది. ఈ విధంగా ప్రభుత్వము చేస్తు న్నటువంటి కార్యక్రమాలు చాలవు అని గౌరవసభ్యులు చెప్పవచ్చును. కాని ప్రభుత్వము ఉన్నటువంటి ఆర్థిక పరిస్థితుల ననుసరించి, ఉన్నంతవరకు ఈ వెనుకబడిన జాతులకు తదితర నిరుపేదలైనటువంటి హరిజనులకు, గిరిజనులకు, మాజీ నేరస్థులకు, వీరందరియొక్క విద్య, సాంఘిక, ఆర్థిక అభివృద్ధి గురించి ప్రభుత్వము చేయగలిగినటువంటి కృషి చేస్తున్నదని, ఈ కృషికి సంబంధించినటు వంటి కార్యక్రమాలలో ఇంకా వాస్తవికదృష్టితో ఎక్కువ ఉపయోగకరమైనటు వంటి విధానాలనుఏవైనా సలహాసంఘాలవారుగాని, ఇతర సభ్యులుగాని, ప్రజా సంస్థలుగాని సూచించియుండిన, వాటిని పరిశీలించి వారిని అదనంగా అభివృద్ధి పరచడానికి, ఆర్థికస్తోమతును దృష్టిలో పెట్టుకొని, అవకాశమున్నంతవరకు ఈ కార్యక్రమాలను కొనసాగిస్తుందని, వీటిని కొనసాగించడములో ప్రభుత్వము ఏలాటి వెనుకంజ వేయడంగాని, ఉపేక్షించడంగాని, అశ్రద్ధ వహించడంగాని జరుగదని, గౌరవసభ్యులకు మనవి చేస్తున్నాను.

ఇప్పుడు అనేకమంది సభ్యులు cut motions ఇచ్చారు. వీటిలో చాలా భాగము, ఇళ్ళస్థలాల విషయంలో జాప్యం జరుగుతున్నదని, policy గురించి, programme గురించి discuss చేయాలని ఎక్కువ general గా నూటికి 90 వరకు ఆ విధంగా ఇచ్చినటువంటివే. వాటిని గురించి హామీ ఇస్తున్నాను. ఎక్కడ ఎలాటి జాప్యము జరిగినా, ఎక్కడైనా, ఎవరైనా ఇదిగో మా యిం టికి అద్దె రాలేదని, మొగ పరిచయము లేకపోయినా, ఒక కార్డు వ్రాసినప్పటికినీ, అది పరిశీలింపబడి, చర్య తీసుకోబడుతుంది అనే విషయాన్ని సభ్యుల దృష్టికి తీసుకుని వస్తున్నాను. ఇళ్ళ స్థలాల విషయంలో ఏలాటి జాప్యం లేకుండా, ఇళ్ళస్థలాలసేకరణకు ఇదివరకు ఉన్న proposals ను పూర్తి చేయడానికిగాను

ప్రభుత్వం 10 లక్షల రూ॥ల special fund ఏర్పాటు చేసింది. దాన్ని గురించి, ప్రత్యేకంగా 13 మంది తాహశీల్దారు గ్రేడు గలిగిన ఆఫీసర్లను ఏర్పాటుచేసి, ఇళ్ళ స్థలాల సేకరణ కార్యక్రమాన్ని ఈ అక్టోబరు 1 వ తేదీలోగా పూర్తి చేయాలని జిల్లా అధికారులకు తాకీదులు జారీ చేయబడ్డాయి. ఇకముందు ఇళ్ళ స్థలాలు ఇవ్వడమేకాకుండా ఇళ్ళ వసతులుకూడ ఏర్పాటు చేసుకోడానికి వీలుగా ఏవైనా పథకాలు ఆలోచించి, కేంద్ర ప్రభుత్వంవారు చేస్తున్నటువంటి స్కీముల దృష్ట్యా యీ ప్రభుత్వంకూడ కొన్ని స్కీములు తయారుచేసి, ఇళ్ళు కట్టుకునే అవకాశాన్ని కల్పించడానికి ఎంతవరకు వీలుంటుందనే విషయాన్ని ప్రత్యేక పట్టుదలతో, దృష్టితో పరిశీలించడం జరుగుతున్నది. ఇదికూడ గౌరవ సభ్యులకు తెలిసిన విషయమే. కాబట్టి యీ హరిజనులు, గిరిజనులు, షెడ్యూల్డు వెనుకబడిన జాతులుగాని, వీరందరి సాంఘిక, ఆర్థిక, ... అభివృద్ధి విషయంలో ఏలాటి ఉపేక్ష జరుగుతుందనే ఆలోచన పెట్టుకోవలసిన అవసరంలేదని గౌరవసభ్యులకు మనవి చేస్తున్నాను. కనుక ఈ గ్రాంటును అందరు ఏకగ్రీవంగా ఆమోదించ వలసిందని కోరుతూ విరమిస్తున్నాను.

Mr. SPEAKER :—The motion before the House is :

"That Government be granted a sum not exceeding Rs. 99,99,600 under Demand XXII - Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes."

There are a number of cut motions, and they may be moved formally. Wherever they are not relevant I shall overrule them as they are being moved.

163. [16] Sri N. VENKAYYA :—Sir. I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc. by ... Rs. 100

(To discuss policy.)

174. [40] Sri S. RANGANATHA MUDALIAR :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, and other Backward Classes by Rs. 100

(To discuss the condition of the Scheduled Classes and Backward communities in Chittoor District and the urgent need to improve their lot).

22nd July 1955]

175. [66] MAHAMMAD TAHSEEL:—Sir, I beg to move:
To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 100

ఏజన్సీ ప్రాంతాలలో పుట్టి ఉద్యోగం చేస్తున్నటువంటి వారికి ఏజన్సీ అలవెన్సు యివ్వనిదాని విషయమై చర్చించుటకు.

176. (67) MAHAMMAD TAHSEEL:—Sir, I beg to move:
To reduce the allotment of Rs. 99,99.600/- for Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 100

నూగూరు తాలూకాలో కోయరైతు నుండి పుల్లరి వసూలు చేస్తున్నదాని విషయమై చర్చించుటకు.

177. (80) Sri S. VEMAYYA:—Sir, I beg to move:
To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 100

రివిన్యూనుండి హరిజన ఫండులోనికి మినహాయింపు మాను కొన్నందుకు.

178. (81) Sri S. VEMAYYA:—Sir, I beg to move:
To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes and other Backward Classes by Rs. 100

ఈ సంవత్సరము హరిజన వసతి గృహములకు వేతనములు తగ్గించినందుకు.

179. [82] Sri S. VEMAYYA:—Sir, I beg to move:
To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, and other Backward Classes by Rs. 100

దాస్లు, డొంకలు లేని హరిజనవాడలకు మార్గములు త్వరగా ఏర్పాటు చేయనందుకు.

181. [139] Sri V. VISWESWARA RAO:-Sir I beg to move
To reduce the allotment of Rs. 99,99,600/- for welfare of Scheduled Tribes,, Castes, and other backward classes by ... Rs. 100

వ్యవసాయకూలీలకు ఇళ్ళ స్థలములు ఇవ్వడములో కలుగు జాప్యమును గురించి చర్చించుటకు.

182. [148] MAHAMMAD TAHASEEL :— Sir, I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc., by ... Rs. 100

వర్జీనియా పుగాకు రైతులకు భద్రాచలం, నూగూరు తాలూకాలలో అప్పులుఇవ్వనందుకు, ఆవిషయమై చర్చించేందుకు.

183. [176] Sri B. SANKARAIAH:—Sir I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes Castes, etc., by ... Rs. 100

ఇందుకు కావలసిన ల్యాండు అక్విజిషన్ ద్వారా చట్టాలను సవరించి హారిజనులకు ఇండ్లవసతి కలుగజేయుటలో జరిగే అనవసర ఆలస్యాన్ని నివారించవనందుకు.

184. [185] Sri PRAGADA KOTAIAH:— Sir I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc., by ... Rs. 100

(To point out to Government for encouraging and promoting village crafts for the benefit of village artisans who belong to Backward Classes).

185. [206] Sri G. SURYANARAYANA:— Sir I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc., by ... Rs. 100

(To discuss the failure of the Government to successfully utilise the allotments granted and the grants obtained from the centre to provide house-sites for Harijans and to extend facilities for house construction).

187. [240] Sri G. NAGESWARA RAO:- Sir I beg to move

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc., by ... Rs. 100

పెత్తందార్ల, భూస్వాముల దౌర్జన్యాలకు గురైన హరిజనులకు లీగల్ సహాయము చేసేవిషయములను, ప్రభుత్వ విధానాన్ని చర్చించేందుకు.

188. [249] Sri PILLALAMARRI VENKATESWARLU:— Sir, I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of scheduled Tribes, Castes etc., by ... Rs. 100

(The failure to implement the recommendations of Malayappan Committee)

189. [281] Sri VAVILALA GOPALKRISHNAYYA :— Sir, I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, etc., by ... Rs. 100

మలయప్పన్ కమిటీ సూచనలు అనులు జరుపవలసినదిగా కోరుటకు.

190. [307] Sri A. BHAGAVANTHA RAO:—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes, and other Backward Classes by Rs. 100

[To impress upon the Government that a statutory board for the purpose of all round development of the backward classes be instituted.]

Sri B. APPALASWAMI :— అధ్యక్షా, ప్రకాశం పంతులుగారి మంత్రివర్గము హరిజనులకు నివాసస్థలాలకోసము పదిలక్షలు కేటాయించారు. ఇప్పుడు యీ ప్రభుత్వము అటువంటిది ఏదైనా ప్రకటించారా అని మంత్రిగారిని అడుగుతున్నాను.

Mr. SPEAKER :— మీ ఉపన్యాసములో అవన్నీ చెప్పండి. అప్పుడు మంత్రిగారు సమాధానము చెబుతారు.

Sri S. VEMAYYA :— అధ్యక్షా, ఇప్పుడు నేను cut motion లను బలపరుస్తూ ప్రభుత్వదృష్టికి కొన్ని విషయాలు తీసుకొని రావలచాను. ప్రభుత్వము వాటిని గురించి తగుచర్య తీసుకుంటుందని భావిస్తున్నాను. ఇప్పుడు యీ బడ్జటు, రాష్ట్రీము

(Sri S. Vemayya) [22nd July 1955

మొత్తముమీద వున్నటువంటి వెనుకబడిన జాతులవారికిగాని, హరిజనులకుగాని, కొండ జాతులవారికిగాని కలిపిన యీ బడ్జెటు పోయిన సంవత్సరంకంటె యీ సంవత్సరము అంత తృప్తికరంగా లేదని మనవి చేస్తున్నాను. మొత్తము 70 లక్షలు వెనుకబడిన జాతులవారికి గాని, రెండు లక్షలు గిరిజనులకు గాని, దగ్గరదగ్గర మన రాష్ట్రములో సగానికి అంటే 50% గా వున్న యీ తరగతులవారికి మించిన యీ మొత్తాన్ని తీసుకుంటే, తృప్తికరంగా లేదని మనవి చేస్తున్నాను. అంతేకాకుండా ముఖ్యంగా యీ జాతులకు యివ్వబడిన మొత్తాలు బావులక్రింద మినహాయింపుచేసినవికూడా తక్కువగానే వున్నది. మొట్టమొదట schedule castes, హరిజనులకు మించిన మొత్తము అంతా ఒక సంవత్సరము 60 లక్షల రూపాయలుపైన వుంటే యీ సంవత్సరము బడ్జెటు ఎస్టిమేటులో రు. 50,53,000 మాత్రం తగ్గించబడ్డది. అదేరకంగా హాస్టలు వ్యవహారాలు తీసుకుంటే గూడా అంతకాదు. Subsidised hostels లో ప్రతి సంవత్సరము 10 ఎక్కువగా యిస్తామని చెబుతూ వచ్చారు. ఈ సంవత్సరము యిచ్చేటప్పుడు బొత్తిగా ఒక్క గ్రాంటుకూడా అదనంగా యివ్వకపోవడం జరిగింది. తరువాత కొత్త హాస్టళ్ళకు యివ్వమంటే, మానివేయడం యీ విధంగా జరుగుచున్నది. ఈ సంవత్సరము మంత్రిగారు చెప్పినట్లు అక్కడక్కడ హాస్టళ్ళను ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. ఇప్పుడు సురల 20 హాస్టళ్ళు, యింకా యితర subsidised hostels, అన్నీ గూడా ప్రభుత్వము తీసుకున్నప్పుడు యీ బడ్జెటులో కేటాయించిన మొత్తము అన్ని హాస్టళ్ళు కలిపినప్పుడు తృప్తికరంగా లేదని చెప్పి నేను మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఇప్పుడు ముఖ్యంగా మంత్రిగారు చెప్పిన విషయములు తీసుకుంటే యిక్కడ budget లో ముఖ్యమంత్రిగారు education క్రింద హరిజనులకోసమని చూపుతూ లెక్కలు యిచ్చారు. దానికంటె, నూటికి చదువుకునేవారు ఎంతోమంది లేదని వారు సెలవిచ్చారు. అదేరకంగా యిప్పుడు ప్రభుత్వము హరిజనహాస్టళ్ళు తీసుకున్నప్పుడు యిదే రాజ్యాంగ చట్టములో ప్రతి ఒక్క బిడ్డకు గూడ 14 సంవత్సరాలకు లోపల Compulsory education యివ్వబడుతుందని చెప్పబడివుంది. ఇట్లాంటప్పుడు ఈ ప్రభుత్వము ఎంతవరకు యీ compulsory education కొనసాగించ గలుగుచున్నది అనే విషయం తీసుకున్నప్పుడు గ్రామాలలో లెక్కలు తీస్తే, వెనుకబడిన జాతులుగాని, పేదలుగాని, ముఖ్యంగా హరిజనులుగాని యీరోజున వారిబిడ్డలను బడికి పంపటానికి వారికి తాహతులేదు. ఈనాడు గ్రామాలలో ఎక్కడైనా మనం పోతూవుంటే అనేకమంది బిడ్డలు పశువులవెంట కొంతమంది పోతున్నారు. కొంతమంది పేడ వగైరాలు తీసుకొని రావటానికి, వంటచేసుకునేందుకు పుల్లలు ఏరుకొని తీసుకొనిరావటానికి మరి కొంతమంది అడుగుకొని తినుటకు వెళ్ళుతున్నారు.

ఈ విధంగా వివిధరకాలుగా బైటకు వెళ్ళుచున్నారు. కాని విద్యనేర్చుకోటానికి వెళ్ళేవారు కనబడరు. ఇదంతా మన కళ్ళారా చూస్తున్నాము. అందువల్ల compulsory education విధానాన్ని అమలు పరచలేకపోతున్నాము. యీ రాజ్యాంగ చట్టము ఒక పక్కన వున్నదేగాని, యీ compulsory విద్యా విధానము అమలులోకి తీసుకొని రావడంలేదు. ఈ రోజున మన కళ్ళకు కనబడేది దృష్టిలోకి తీసుకుంటే తృప్తికరంగా వున్నదేమో ప్రభుత్వమే గుర్తించాలి. నా అభిప్రాయములో అదేమి లేదనేఅంటాను. ముఖ్యంగా

వెనుకబడిన జాతులు, యింకను అధ్వాన్న స్థితిలోవున్న విషయము మనకు కనబడుతూనే యున్నది. దానికన్న యీ రోజున తలితండ్రులకు ఏదైనా తాహతువున్నదా అంటే, వారిబిడ్డల నందరిని బడికి పంపటానికి తాహతు కనబడలేదు. బిడ్డలకు కావలసిన వసతులు అంటే తిండిగాని, బట్టగాని, కలిగివుండవలసిన పరిస్థితి ప్రభుత్వము కలుగజేస్తే, అప్పుడు వారు చదువుకోటానికి వీలువుంటుందేకాని, యీ విధంగా నిర్బంధ విద్యా విధానాన్ని అమలు పరుస్తామని వూరకనే ప్రభుత్వము చెబుతూ వుండినంత మాత్రాన బిడ్డలకందరికి చదువువచ్చే విధానము ఏ మాత్రము కావని చెప్పకతప్పదు. ఇప్పుడు ప్రభుత్వము అవలంభించే విధానములో బొత్తుగా ప్రభుత్వము ఏమీ చేయడము లేదని చెప్పడములేదు. అంటే బిడ్డలకు mid - day meals విషయము ఆలోచిస్తే యిది సరిగా యివ్వడములేదని ప్రభుత్వానికి తెలియకపోలేదు. ఇది rectify చేయడానికి ప్రభుత్వము పూనుకోలేదు. లేబరు స్కూళ్ళలోమాత్రం mid-day meals జరుగుతున్నదికాని యింతకుముందు ప్రకాశం ప్రభుత్వములోఅంటే 1946-47 ఆ ప్రాంతములో అన్ని స్కూళ్ళలోకూడా ప్రభుత్వము నడిపే పాఠశాలల్లో కాకుండా లేబరు స్కూళ్ళు కాకుండా local board schools లో కూడా mid-day meals యివ్వడము ఏర్పాటు జరిగింది. అప్పుడుకూడా అనేకమంది పాఠశాలలకు పోవటానికి వారికి తాహతు కలిగింది. అందువల్ల ప్రభుత్వము వెంటనే పేద పిల్లల కందరికి, యీ రోజున ప్రభుత్వము socialistic pattern of society ని మనకు ఏర్పాటు చేయాలని వుద్దేశించుతున్నప్పుడు వారందరు విద్యా విధానానికి తగినట్లుగా బిడ్డలకు వసతులు ప్రభుత్వము కలిగిస్తే, వాళ్ళు చదువుకోటానికి వుత్సాహము కలిగి స్కూళ్ళకు పోగలుగుతారు. కాబట్టి ప్రభుత్వము వెంటనే యీ విధానాన్ని సాగించటానికి వసతులు ఏర్పాటుచేసి, అప్పుడు వాళ్ళను బడికి పొమ్మంటే బాగుంటుంది. ఇందుకుగాను ప్రభుత్వము పథకాలు సరిగా వేయలేదని తెలుస్తున్నది. ఇంత వరకు ప్రభుత్వమువేసినపథకాలు అంత తృప్తికరంగాలేవని మనవిచేస్తున్నాను.

ఇంకొక విషయము. ప్రకాశంగారు ఇక్కడనే వున్నారు. వారిని నేను అనేక విధాలుగా అభినందించవలసి వున్నది. అయితే, 1947-వ సంవత్సరంలో ఒక కోటి రూపాయలు Harijan Fund అనే పేరుతో వారు రెవిన్యూనుంచి కేటాయించారు. ఆ కోటి రూపాయలు యిప్పటికప్పుడే అయిపోయింది. 1952-వ సంవత్సరము బడ్జెటులో ఏ మాత్రము యీ ఫండుక్రింద కేటాయింపు లేకుండా రాజగోపాలాచారిగారు చేశారు. తరువాత ప్రకాశం పంతులుగారి ప్రభుత్వము వచ్చినప్పుడు పది లక్షల రూపాయలు రెవిన్యూనుంచి హరిజన ఫండు అని చెప్పి బడ్జెటులో కేటాయించారు. కాని యీ బడ్జెటు వచ్చినప్పుడు హరిజనులకు ఏదైనా ఫండు కేటాయించారా అని చూస్తే, అదేమీ కనబడలేదు. దీనికి కారణమయేమిటో తెలియడములేదు. దీన్నిబట్టిచూస్తే, ప్రభుత్వానికి యిదివరకు యిటువంటి ఫండుకు కేటాయించటానికి తాహతువుంది, యిప్పుడు లేదు, అని తేలుతుంది. ప్రభుత్వముకు యీ తాహతు ఎందుకు తగ్గిందో తెలియాలి. అంతే కాకుండా ఢిల్లీలో వున్న Schedule Castes Commissioner కూడా, రెవిన్యూనుంచి కొంత భాగము మినహాయించాలని చెప్పి, తన యొక్క రిపోర్టులో సూచించారని తెలుస్తుంది. వారు యిటువంటి Fund తయారు చేయాలని ఎంతో కృషిచేస్తున్నారు. కాని ప్రభుత్వము దీన్ని వెనుకకు నెట్టివేయడం,

యీ సంవత్సరము యెంత మాత్రముగూడ కేటాయించకపోవడం జరిగింది. ఇటువంటి విషయము చూస్తే, ఎంతో బాధకరంగా వున్నది.

**The Hon. Sri G. LATCHANNA** :—ఎనిమిది లక్షలు పర్మనెంటు ఫండు క్రింద ఏర్పాటు చేశారు. కాని అప్పుడు ఆ సంవత్సరముతోనే అది ముగిసి పోయింది. ఈ సంవత్సరము Harijans కు house sites వ్యవహారం పూర్తి చేయడానికి ఏర్పాటు చేయాలన్నది. దీనికి రెండు లక్షలు ఖర్చు అయింది. ఇంకా 8 లక్షలు ఖర్చు కాబోతున్నది.

***Sri S. VEMAYYA** :—ఒకసారి ఒక ఫండు అని ఏర్పాటు చేసిన తరువాత దాన్ని 'ప్రతి సంవత్సరము' maintain చేసుకొంటూ రావాలి, అని నా ఉద్దేశ్యము. కాని ఆ మొత్తమును replace చేయడము జరిగితే, అప్పుడు దాన్ని విసర్జించవలసిన అవసరము లేకుండా పోయేది. కాబట్టి యిప్పుడు శ్రీ బాగ్ యిచ్చిన రిపోర్టును బట్టి అయినా ప్రభుత్వము కొంత డబ్బు కేటాయించి, ఆ ఫండును తిరిగి యేర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

ఎలిమెంటరీ స్కూళ్లలో మధ్యాహ్నము పూట భోజనము ఏర్పాటు చేసేది contract పద్ధతి కాకుండా తల్లిదండ్రులకు ఇచ్చే పద్ధతిని ఏర్పాటు చేసినట్లయితే కొంతవరకు మేలు కలుగుతుంది. ఎక్కడయినా కొత్త పాఠశాలలు తెరిచే విషయములో 500 జనాభా వుంటేకాని తెరవము అంటున్నారు. అచ్చటి ప్రజలు స్వంతముగా ఏర్పాటు చేసుకుంటానన్నా 500 జనాభా లేదంటున్నారు. చిన్న చిన్న గ్రామములలో వున్న పిల్లల చదువుకు ఈ నిబంధన బాగా అడ్డము తగులుతోంది. ఈ నిబంధనను తొలగించి ప్రత్యేకంగా ఒక ఉపాధ్యాయుడు నడపడానికి వీలయ్యేటందుకు సరిపడ్డ బాలబాలికలు వుండే ప్రాంతంలో ఒక స్కూలును ఏర్పాటు చేయడానికి ప్రభుత్వము వెంటనే చర్యతీసుకోవాలి.

Night schools విషయంకూడా బడ్జెట్టులో చూపబడింది. Night schools ఎక్కడ జరుగుతున్నాయో ఏ విధముగా జరుగుతున్నాయో మాకు తెలియడములేదు. ఒకవేళ ఎక్కడైనా జరుగుతున్నాయంటే అవి నామమాత్రముగా జరుగుతున్నాయి. ఈ Night schools ఎక్కువగా హరిజనులకు వెనుకబడ్డ తరగతులవారికి వుపయోగ పడుతాయి. అందువల్ల ఇవి పటిష్టంగా జరిగేదానికి తగినటువంటి అజ్మాయిషి, శ్రద్ధ తీసుకునేట్లు ప్రభుత్వమువారు చూడాలని మనవిచేస్తున్నాను.

ఇదివరకు హయ్యరుగ్రేడు ట్రైనింగు వుండేది. ఇప్పుడు దానిని తీసివేసి వారి నందరిని సెకండరీగ్రేడుకు వెళ్ళమంటున్నారు. ఇందులో ఏమీ అర్థములేదు. ఇది చాలామందికి బాధకలిగిస్తున్నది. దీనికి వెళ్ళేవారంతా కూడా వెనుకబడ్డతరగతులవారు, బీదవారు. ముఖ్యంగా హరిజనులకుగాని, క్రైస్తవులకుగాని ఈ రోజు వున్న టీచర్ల లెక్కలు తీసుకొన్నట్లయితే 100 కి 50 మంది వెనుకబడ్డతరగతులవారి స్థాయిలోని వారే వుంటారు. ఈ రోజున వారిని స్కూల్ ఫైనలువరకు చదివి సెకండరీగ్రేడుకు పొమ్మని చెప్పడము ప్రభుత్వానికి ఎంతమాత్రము సమంజసముకాదు. ప్రభుత్వం ఈ దృక్పథాన్ని మార్చుకోవాలనిచెప్పి చాలామంది సభ్యులు బడ్జెట్ మీద జనరల్ డిస్కషన్లో చెప్పారు.

8th Standard చదువుకున్న వాళ్ళకు ఓ, న, మ, లు కూడా రావని కొందరు అంటున్నారు. ఈ రోజున Higher Grade చదువుకున్న వాళ్ళను Secondary Grade చదువుకొన్న వాళ్ళను కొంతమందిని పరీక్షిస్తే Higher Grade వాళ్ళకన్నా Secondary Grade చదువుకున్న వాళ్ళు కొంతమంది మరీ అధ్వాన్నముగా వున్నారు. ఈ Higher Grade trainning తీసివేసే పథకము వెనుకబడ్డజాతులవారికి గొడ్డలి పెట్టుగా వుంటుందని మనవిచేస్తున్నాను. ప్రభుత్వముయొక్క దృక్పథము మంచిస్థాయిలో పోతే మేము అభినందిస్తాము. ఇటువంటి మార్పులు చేయడము మంచిపనికాదు. నన్ను ఈ విషయంలో adjournment motion తీసుకురమ్మని 4, 5 వుత్తరాలు వచ్చినవి. హరిజన డిమాండు వున్నదిగదా దానిమీద మాట్లాడవచ్చునని నేను స్పీకరుగారిని అడగ లేదు. కడపలో వున్న Basic Training School తీసివేశారు. అక్కడ స్త్రీలకొఱకు నిర్మించబడ్డ హయ్యరుగ్రేడు స్కూలు మాత్రము వున్నది. అక్కడి పిల్లలు స్కూలులో చేరారు. మీరు స్కూలు తెరవకముందే వుత్తర్వు పంపిస్తే బాగుండేది. పిల్లలు స్కూలులో చేరగానే మేము స్కూలు మూసివేశాము. మీరు ఏ నెల్లూరుకో, ఏ బళ్ళారికో పోయి చదువుకోమంటున్నారు. అది ఎంత సమంజసంగా వున్నదో మీరు గమనించండి. ఈ హయ్యరు ఎలిమెంటరీగ్రేడు అనేది తప్పక వుండితీరాలి. మీరు దానిని తీసివేయదలచుకుంటే క్రమేణా తీయవలయునేగాని ఒక్కపర్యాయమే తీసివేయడానికి వీలులేదు. దీనిని ప్రభుత్వము ఇప్పుడు అయినా మార్చుకుంటే ఇది హరిజనులకు వెనుకబడ్డ జాతులవారికి మేలుకలుగుతుందని మనవిచేస్తున్నాను. దీనిని తప్పక పునరాలోచన చేయాలి.

సెకండరీ స్కూళ్ళలో ఈ రోజు, నేను అసెంబ్లీకి రాకముందుకూడా, నాకు admission దొరకలేదని చెప్పేవాళ్ళు అనేకమంది కనిపించినారు. ఏ హైస్కూలుకు పోయినాగాని సీట్లు లేవు అని చెప్పడము జరుగుతోంది.

ఏ కాలేజీలోకి వెళ్ళినా ఎక్కువ మార్కులతో ప్యాసు అయినాకూడా వాళ్ళకు కావలసినటువంటి సబ్జక్టులు కూడా యివ్వడము లేదు. ఒక వేళ సబ్జక్టులు ఇవ్వదలచుకున్నా కూడా దానికి ప్రత్యేకమైన స్పెషలు ఫీజులు కట్టాలని చెప్పడము జరుగుతోంది. వారు ఆ డబ్బు కట్టలేక చదువు మానుకోవడమో లేక హిస్టరీనో, ఇంకేదో తీసుకొని చదువుకోవడమో జరుగుతోంది. Free education అని చెబుతున్నారు. కాని free అంటే స్పెషలు ఫీజులు, Examination fees లు కట్టడమా ? ఇప్పుడు మంత్రిగారు లెక్కలు చదివారు. అందులో examinations కు ఇంత యిచ్చాము, ఫీజులకు ఇంత ఇచ్చామని వుంది. దానిని సరిగా ఇచ్చే పంథాన ఎందుకు ఇవ్వడములేదని ప్రశ్నిస్తున్నాను. ఆ స్పెషలు ఫీజులు ఎందుకు కట్టాలి. దానిని మొదట ఫ్రీ అన్నప్పుడు తరువాతగూడా దానిని ఫ్రీ అని ఎందుకు వుంచకూడదు. Examination fees కట్టలేకపోయిన వారు పోయిన సంవత్సరం అనేకమంది వున్నారని నాకు తెలుసును. తరువాత కొన్ని రోజులు పోయిన తరువాత గవర్నమెంటువారు exemption ఇస్తే తరువాత కట్టారు. ఈ Examination fees మీరు ఇస్తున్నారని చెబుతున్నారు. ముందు వారిని ఎందుకు కట్టమంటున్నారు ? అది కట్టకుండానే మీరు ముందుగానే వుత్తరువులు చేయకూడదా

అని అడుగుతున్నాను. మీరు సహాయముచేసేది హరిజనులకు సరిగా అందడములేదు. దోవలోనే కారిపోతున్నది. వెనుకబడ్డ జాతులనుగురించి మంత్రిగారు కొన్ని విషయాలు చెప్పినారు. Night schools పెట్టినట్లయితే వెనుకబడ్డ జాతులవారు కూడా ఒక ప్రక్క ఉద్యోగము చేసుకొంటూ రాత్రిపూట క్లాసులకు వెళ్ళి ఎక్కువగా చదువుకోనే దానికి వీలవుతుంది. కాబట్టి వెంటనే దీనియందు ప్రభుత్వమువారు శ్రద్ధ తీసుకొని Night Colleges గాని, Night High Schools గాని స్థాపించడానికి పూనుకోవాలి.

హరిజనుల వుద్యోగాల విషయంలో రోజూ ఇక్కడ ఎగతాళి చేయడము జరుగుతోంది. నాకు 4, 5 ఉత్తరాలు వచ్చాయి. ఒకాయన B. A. చదువుకొని యిక్కడ ఎక్కడా వుద్యోగము దొరక్క హైదరాబాదు పోయి దూర్చున్నాడని తెలిసింది. కనీసము ఆయనకు గుమాస్తా వుద్యోగము కూడా దొరకలేదన్నమాట. ఎక్కడచూచినా మీ హరిజనులకు వుద్యోగాలు ఇస్తున్నాము అంటారు. అవి కాగితము మీద కన్పడుతాయేగాని, హరిజనులకు ప్రాక్టికల్‌గా సరిగా ఇవ్వడములేదని చెప్పగలను. ఇప్పుడు గెజిటెడ్ వుద్యోగులను తీసుకొన్నప్పుడు ఎక్కడఅయినా సహారం ఎడారిలో మొక్కలు వున్నట్లు ఈ హరిజనులు వున్నారు. Gazetted వుద్యోగాల్లో ఎంతమంది వున్నారు? లేదంటే వాళ్ళనుబాగా చదవమని చెప్పండయ్యా. అప్పుడు వస్తుందిగాని ఇప్పుడు ప్రశ్నలువేస్తే ఏమిలాభము వుంటుంది అంటారు. సర్వీసు కమిషను 1929 సం॥లో పుట్టింది. అది పుట్టినప్పట్నుంచీ సంవత్సరములు లెక్కవేసుకున్నారు. సంవత్సరానికి ఒక్కరైనా వేసుకున్నట్లులేదు. చిన్న చిన్న వుద్యోగుల సంగతిచూస్తే 4 వ తరగతి, 5 వ తరగతి చదువుకొన్నాకూడా ఈ వేళ ఇన్‌ఫీరియర్ సర్వీసు అని చెప్పి బంట్రోతులు వుద్యోగములు అయినా హరిజనులకు ఇవ్వడము లేదు. ఎక్కడకు వెళ్ళినాకూడా వీడు హరిజనుడు అని బంట్రోతు వుద్యోగముకూడా ఇవ్వరు. వీరు వ్యూహముగాకూడా పనికిరారు. వీరు అన్నిరకాల పనులకు పనికిరారని అందరికీ తెలుసు. అన్ని విధాల పనికివచ్చేవాడికే వుద్యోగము ఇస్తారు. ఇన్‌ఫీరియరు సర్వీసు విషయము తీసుకున్నప్పుడు వాళ్ళను సర్వీసుకమీషన్ వారే అప్పాయింటు చేస్తారా? వాళ్ళు బీద వారు, చదువుకోలేరు, హరిజనులు వెనుకబడిపోయారు, హరిజనులకోసం మేము కంకణము కట్టుకున్నాము అని అందరూ చెబుతున్నారు. కాని చిన్న వుద్యోగాలు, బంట్రోతు వుద్యోగాలు అయినా తీసుకొనేది ఎంత percentage ఈ హరిజనులను తీసుకొన్నారో చూచినట్లయితే అసలు లేనేలేరని చెప్పవచ్చును. ఎందువల్లఅంటే వాడు అన్నివిధాల అన్నిపనులకు పనికిరాడని వాళ్ళ ఉద్దేశ్యము. ప్రభుత్వము అంటరానితనాన్ని తీసివేయాలంటున్నారు. కాబట్టి ఖచ్చితంగా ప్రతివుద్యోగస్తుడుకూడ ఈ హరిజనుని జవానుగా వుంచుకోవాలి. వాళ్ళ percentage చాలా తక్కువగా వున్నది. ఎందుకు తీసుకోరు అని అడుగుతున్నాను. వారికి ఉద్యోగాలు ఇచ్చినట్టయితే నిరుద్యోగము నివారణవడమే కాకుండా అస్పృశ్యతకూడా నివారణ చేసేదానికి, అన్నివిధాలవారు మాకు అన్ని సేవలు చేస్తారు. దానికి ప్రభుత్వము పూనుకోవాలని మనవిచేస్తున్నాను. లోకల్ బాడీస్ మునిసిపాలిటీస్‌లోవుద్యోగాలు చూచినప్పుడు వెతికి పట్టుకున్నాకూడా ఒక్కహరిజనుడు కూడా కన్పించడు. కనీసం ఈ జిల్లాబోర్డు వుద్యోగాలకు సరిపడ్డ చదువు చదువుకున్నవారు

హరిజనులలో తేరాఅంటే కావలసినంతమంది వున్నారు. చాలామంది చదువుకున్న వారు వున్నారు. వుద్యోగాలు దొరకవు. ఈ Welfare Department వున్నది. ఇదికనీసము వాళ్ళు చేసేటటువంటి పనుల్లో ముఖ్యమైన పని అని చెప్పి ఎందుకు భావించడములేదని నేను గవర్నమెంటువారిని అడుగుతున్నాను.

1949 సం॥లో ముత్యాలపాలెం నుండి ఇండ్లకు ధరఖాస్తులు పెట్టారు. అప్పటి నుంచి ఎంతోమంది Collector, Commissioner ఇతర ఆఫీసర్ల అందరి చుట్టూ తిరిగారు. వారికి 2000/- రూపాయల వరకు ఖర్చు అయినది. తరువాత ప్రభుత్వానికి T. A. లు క్రింద ఎంత ఖర్చు అయినది నేను చెప్పలేను. అక్కడ ఎకరము 20 వేల రూపాయల వరకు పెరిగింది గనుక వాళ్ళు మానుకున్నారు. తరువాత society లు పెట్టి డబ్బు తీసుకోవటము జరిగినది. ఈ ఉదాహరణ తీసుకున్నప్పుడు గ్రామాలలో స్థలములేక ఎంత బాధపడుచున్నది తెలుసును. కాన ఇండ్ల విషయములో హరిజనులకు చాలా అన్యాయము జరుగుచున్నది. వాళ్ళపేరుతో ఇంకొకరు కూడా తీసుకోవడము జరుగుచున్నది. కాన ఈ దుస్థితిని ప్రభుత్వము గుర్తించ వలసినదిగా కోరుచున్నాను.

తరువాత Land Acqisition Act త్వరగా amend చేసి దాని procedure తగ్గిస్తేగాని ఏమి న్యాయము జరుగదని నేను చెప్పుచున్నాను.

ఈ ఇండ్ల స్థలముల విషయములో ఒక జాబితా తీసుకున్నట్లయిన బీరంగుంట, గురిణి, నార్త్‌మోపూరు గ్రామాలలో చాలా బాధపడుచున్నారు. వీటిని గురించి నా cut-motion లో కూడా ఇచ్చి ఉంటిని. వీరిమీద పెట్టిన కేసులు ఇంకనూ pending లో ఉన్నవి. ఇక assignment of lands విషయము వచ్చినప్పుడు కనీసము హరిజనులకు ఏదైనా provision ఉన్నదేమో అనుకుంటే ఏమీలేదు. 1921 సం॥లో Labour Department అని ఒక Commission ను వేసినప్పుడు భూములకు ధరఖాస్తులు పెట్టుకొనమనటము జరిగింది. మనము composite Stateలో ఉన్నప్పుడు 6 లక్షల ఎకరములు depressed class lands అని చెప్పి reserve చేసినారు. కాని reserve చేసిన ఆ భూములు ఈనాడు పెద్ద పెద్ద భూస్వాముల చేతులలో ఉన్నవి. ప్రభుత్వము దీనిని గురించి ఏమీ శ్రద్ధ చూపడములేదు. నాకు తెలిసినంతవరకు యీ నిమ్నజాతులకు మినహాయించిన భూములన్నీ కూడా ఈ వేళ భూస్వాముల చేతులలోకి పోయినవి. కాని ఏవిధముగా యీ భూముల విషయములో చూచినప్పటికి 50 సం॥ల నుంచి కూడా పట్టాలు యివ్వలేదు. ఈ విధముగా Land Acquisition Act ను ఉపయోగించి ఇండు ఇవ్వాలంటున్నారు గాని గ్రామాలలో గవర్నమెంటు పోరంబోకులలో ఇండ్లు కట్టుకొని ఉన్నవాళ్ళు ground rent pay చేస్తామని చెప్పుచున్ననూ వారలకు పట్టాలు ఎందుకు ఇవ్వకూడదు? వాళ్ళమీద ఇంకా B forms వ్రాసి penalty చేయడముఎందుకు? ముఖ్యముగా నేను చెప్పబోవునది అసలు హరిజనులు ఇండ్ల స్థలములకు ధరఖాస్తు పెట్టుకొనుట దోషముగా ఉంటున్నది. బీరంగుంటలో దరఖాస్తులు పెట్టుకున్నందుకు వారిమీద కేసులు పెట్టారు. ముఖ్యముగా మన రాష్ట్రములో హరిజనులు agricultural labour లో 40 లక్షలమంది ఉన్నారు. వారికి కనీసవేతనముల చట్టమునైనా తీసుకొని రాకుండా చాలా విలంబన జరుగుచున్నది. 1921 లో Agricultural Act మొదలైన

వన్నీ dead letters గా కన్పిస్తున్నవి. ఇక అంటుద్వేషము విషయము చూస్తే మనకు అందరికి తెలుసు. మొన్న మొన్న వినోభాభావే దేవాలయమునకు పోతే కొట్టారని కూడా మనకు తెలుసు. ఈ రోజున ప్రభుత్వము హరిజనులకు ఎన్ని కేసులలో సహాయము చేశారు అంటే వారికి తెలియదు. కాని చాలా గ్రామాలలో హరిజనులకు బావులు త్రవ్వమని ఆర్డర్లు పెట్టుచున్నారు. ఈరోజు 1932 లో యిచ్చిన మాగాణి భూములు ఇప్పటి వరకూ dry land గా ఉన్నప్పటికి వాటికి irrigation facilities కల్పించలేదు. కారణ మేమనగా depressed class కాబట్టి.

*Sri K. SANTHAPPA :—నాకు మాట్లాడుటకు అవకాశము ఇచ్చినందులకు అధ్యక్షులవారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను. ఈహరిజన demandను బలపరుస్తూ ప్రభుత్వదృష్టికి కొన్ని విషయాలు తీసుకురావలసిఉన్న దికనుక మా హరిజనులకు వుండు అనేక కష్టనష్టములను గురించి నివేదించుచున్నాను. అస్పృశ్యతా నివారణను గురించి అంటరానితనమును నిర్మూలన చేయాలని ప్రభుత్వమువారు అంటున్నారు. కుగ్రామములలో ఇది ఇంకా పోలేదు. వేదాలుచూస్తే చాలా ఘోషిస్తాయి. వశిష్టుడు మా అల్లుడు అంటారు, అరుంధతి మా ఆడపడుచు అంటారు, హరిశ్చంద్రుడు మాకు సేవచేసినాడు అంటారు. కలియుగములో ఇప్పుడున్న పేర్లు లేవు మాకు. పూర్వము మమ్మలను చిన్నప్పుడు మాల మాదిగ అంటూ మధ్యకాలంలో పంచములు అని, మళ్ళీ ఆదిఆంధ్రులు, ఇప్పుడు హరిజనులు అంటున్నారు. ఈ మధ్య ఇంకొక పేరు వచ్చింది. Social welfare department, సంక్షేమ department అనేటటువంటిది. ఈ అంటరానితనమును నిర్మూలించడానికి ప్రభుత్వము చాలా కృషిచేయవలెను. ఇక కొంతమంది హిందువులలో కలసితిమని అనమంటారు. కాని వారికంటెను ఎరుకలు, యానాది, లంబాడి, సుగాలి, పిచ్చుకకుండ్లు, బుడుబుక్కల ఇటువంటివాళ్ళకు ఎంతో గౌరవము ఉన్నది. మాచేత బహిరంగముగా మాత్రము అన్ని పనులు చేయించుకుంటారు. కాని ఇంటిలోపలకాని, దగ్గరకు రానివ్వరు. దీని విషయములో ప్రభుత్వమువారు చాలా జాగ్రత్త తీసుకొని క్రైస్తవులు వలె ప్రచారకులను పెట్టినట్లు అంటరానితనమును నిర్మూలన చేయాలని మనవి చేస్తున్నాను.

మాకున్నవి పూరిగుడిసెలు. చుట్టుప్రాంతాలలో భూస్వాముల పొలాల మధ్య కొన్ని గ్రామాలలో ఇండ్లు కట్టుకున్నారు. ఇవి అక్వాయిర్ చేయించి త్వరలో పట్టాలను ఇవ్వవలయును. కనుక దీనివిషయములో ప్రభుత్వము కొన్ని సహకార సంఘములను పెట్టి ప్రతివానికి రు. 500/- ఇచ్చి 20 సంవత్సరములలో రెండుమూడు వాయిదాలలో చెల్లించే పద్ధతిని ఇచ్చిన కనీసము మిద్దె ఇండ్లు అయినా కట్టుకొనెదరని నేను ప్రభుత్వమువకు నివేదిస్తున్నాను.

అనంతపురం జిల్లా వెనుకబడిన జిల్లా. హరిజనులు చాలా విద్యావిహీనులు, hostels చాలా తక్కువ. ప్రభుత్వంవారు ఎక్కువ hostels కల్పించాలని కోరుతున్నాను. పల్లెటూళ్ళలో హరిజన పిల్లకాయలకు వయస్సు తెలియదు, లెఖ్ఖలు తెలియవు, పిల్లలు బడికి పోతారు, అయ్యవారు చూస్తారు, నామకార్థం తేదీ వేసుకుంటారు, హాస్టలులో చేరడానికి వచ్చేసరికి age bar అయిపోయింది అంటారు.

వారి స్థితి అన్నం, నీళ్ళు లేక త్రిశంకు స్వర్గం వలె ఉంది. వాళ్ళ బ్రతుకు కష్టముగా వుంటుంది. ఒకటవ ఫారంనుంచి S. S. L. C. వరకు చదివిన వాళ్ళ లోని నిరుద్యోగం చాలా దుర్భరంగా వుంది. అసెంబ్లీ హాస్టలుదగ్గర చూస్తే 9 మంది హరిజనులు ఉద్యోగాలకై కాచుకొని కూర్చున్నారు. మా చేతుల్లో అధికారం లేదు ఇవ్వడానికి, మేము మంత్రులదగ్గరకు వెళ్ళాలి. ఇప్పటివరకు రు. 30 లు ఖర్చు చేశాము. మేము ఏమైనా ధనికవర్గంవారమా కాదు. మంత్రుల దగ్గరకు వెళ్ళితే చూస్తాము, చూస్తాము అంటారు, కాని చేసాము అనరు. చూస్తాము అనేమాటకు అర్థం ఏమిటో తెలియకుండా వున్నది. మా జిల్లాలో Girls hostel ఒకటే వున్నది. Girls hostels ఇంకా ఎక్కువగా పెట్టాలని కోరుతున్నాను. అనేకమంది మెంబర్లు అనేక నియోజకవర్గాలనుంచి వచ్చినవారు Education, Irrigation, విషయాలలో general గా వారినియోజకవర్గాలనుగురించి చెప్పుతున్నారు. ఇక్కడ అధ్యక్షులవారు స్వర్గలోకంలో దేవేంద్రునిమాదిరిగా వున్నారు. మీరు ఆపదవిని అలంకరించినారు. అనేకవోట్ల మెజార్టీతో వచ్చినారు. మా నియోజకవర్గంగురించి చెప్పుకోవాలంటే ఇప్పుడు కాదు, ఇంకా వాళ్ళందరూ అయిన తర్వాత అని అంటారు. మా తాలూకాలో electricity స్కీము లేదని గౌరవనీయులైన మంత్రి లచ్చన్నగారితో చెప్పుతున్నాను. సంజీవరెడ్డిగారు సహాయంచేస్తే తప్పకుండా చేస్తాము అని చెప్పారు. మాకు ఇరిగేషను లేనేలేదు. కల్యాణ దుర్గం తాలూకాలో వేదావతి నది వున్నది. దానికి ఆనకట్టకడితే 10, 12 చెరువులు నిండుతాయి. హరిజనులు గవర్నమెంటు వారిచ్చిన బంజరులను సాగుచేసుకోడానికి అనుకూలంగా వుంటుంది అని ప్రభుత్వంవారిని ప్రార్థించుతున్నాను. ఇక 'ప్రొహిబిషను విషయం. దీని విషయం అనేకసార్లు చెప్పాను' శ్లోకాలు, పద్యాలుకూడా చెప్పాను. రంకుబొంకులకు రాజబాట ; కలహాలకు కన్నతల్లి ; ఖూనీలకు కులదేవత అని చెప్పాను. త్రాగుడుమనీపివేయడంవల్ల ప్రజలు సుఖంగావుండి భార్యాపిల్లలుకూడాసుఖంగాబ్రతుకుతున్నారు. దీనిని కట్టుదిట్టంగా అమలు చేయాలని కోరుతున్నాను. మద్రాసు రాష్ట్రములో వుండగా హరిజనుల ఇండ్ల స్థలాలకై తీసుకున్న డబ్బును వాపసు ఇచ్చినారు. అట్లాకాకుండా త్వరగా ఇండ్ల స్థలాలు acquire చేయించాలని ప్రార్థించుచున్నాను. ఎన్ని చెప్పుతున్నా ఏమి వున్నది ? చెప్పడమేతప్ప పని జరగడంలేదు.

*Sri K. SHANMUGHAM :— అధ్యక్షమహాశయా, ఎన్ని శాసనాలు చేసినా, ఎన్ని దేవాలయ ప్రవేశాలు కల్పించినా, ఎన్ని హరిజన దినోత్సవాలు చేసినా, అస్పృశ్యత పూర్తిగా అంతరించలేదు. మాల మాదిగలు ఆర్థికంగా, విద్యా విషయకంగా వెనుకబడి వుండడంచేత, వారు దుర్భరమైన జీవితాలు గడుపుకొంటూండడంచేత, వారు సంఘంలో చాలా వెనుకబడిన కారణంచేత, ఈ అస్పృశ్యతా పిశాచంవారిని వెన్నాడుతూనే వున్నది. సాంఘిక అనర్హతల బిల్లు, దేవాలయ ప్రవేశపుబిల్లు ప్యాసు అయినప్పటికాని అది సరిగ్గా అమలు జరుగకపోవడంచేత పల్లెటూళ్ళలో ఈ నాటికికూడా ఈ అస్పృశ్యతా పిశాచం తల విరియబోసికొని తాండవమాడు చున్నది. అనేక శతాబ్దాలనుంచి మేము వెలివాడలలోనే వుంటున్నాం కాని ఊళ్ళలో మాకు ప్రవేశం లేదు. క్రైస్తవులకైనా towns లో కొన్నిచోట్ల బాడుగలకు ఇండ్లుఇస్తున్నారుకాని మాలమాదిగలంటే అసలు ఆ ప్రాంతానికే రానివ్వరు. ఈ నాటికికూడా, గాంధీగారి ప్రబోధంవల్ల వారు చేసిన నిరశన దీక్షవల్ల పూనా ఒడంబడికవల్ల మాకు ఈ రాజ

యాలలో కొన్ని అర్హతలు కలిగినవి. కాని మా దురదృష్టవశాత్తు ఆ మహానుభావుడు గతించిన తరువాత నానాటికి తీసికట్టు నాగంబొట్లు అన్నట్లుగా మాకు ఈ రాజకీయ హక్కులుకూడా చాలావరకు తీసిపోతున్నవి. మా దీనావస్థను గమనించిన శ్రీ ప్రకాశంపంతులుగారు వారి కాలంలో అయాచితంగా కోటి రూపాయలు మాకు ధైర్యంగా కేటాయించారు. ఇది మా హరిజనులందరికి ఈ నాటి వరకు ఎంతో ఉపయోగపడింది. ఇటువంటి provision ఈ బడ్జెటులో ఏమీ లేకుండా చేయడం చాలా విచారకరమైనసంగతి. హరిజనులకేనా సహాయం కావలసింది; ఇక వారికంటె దరిద్రులులేరా అని ఈరకమైన నినాదం బయలుదేరి Harijan welfare అనేదానిని పూర్తిగా తీసివేసి social welfare అని మార్చినారు. ఇక హరిజనులకు ఇవ్వవలసిన provision అంతా కూడా scheduled tribes, scheduled castes కు వినియోగించి మమ్ములను మూడవవారుగా పెట్టివేసారు. ఇది చాలా విచారకరమైన విషయం. గాంధీగారు నిరశనవ్రతం చేసి ఈ జాతికోలకు ప్రత్యేకంగా ఎంతో కృషిచేసి గవర్నమెంటులో హరిజనుల ఉన్నతికై ప్రత్యేకనిధిని ఏర్పాటుచేసి ఆ మహాత్ముడు గతించినాడు. అన్ని రాష్ట్రాలలో హరిజనులకు ప్రాముఖ్యత ఇప్పించినాడు. నేడు మాకు ఎందుకు ప్రత్యేకత ఇవ్వాలనేది మంత్రిగారు యోచించినట్లయితే ఏ జాతికి లేనటువంటి ఏ తెగకు లేనటువంటి అస్పృశ్యతా పిశాచం మమ్ములను ప్రత్యేకంగా పీడిస్తోంది. ఒక ఎరుకలవాడుకాని, ఏనాదివాడుకాని కిళ్ళీకొట్టు పెట్టుకుని బ్రతుకుతాడు. అటువంటి అవకాశాలు మాకు ఏమాత్రమూ లేవు. అందుచేతనే అన్ని జాతులవారుకూడా ఈ అస్పృశ్యత అంతరించేవరకైనా వీరికి ఒక ప్రత్యేకత ఇచ్చి విద్యావిషయకంగా ఆర్థికంగా నైతికంగా వారిని బాగుచేయాలని ప్రతివారు, క్రిందటి మహాసంస్కర్తలుకూడా ప్రబోధించారు. ఈనాటికికూడా ప్రభుత్వానికి నేను మనవిచేసేది ఏమిటంటే, అస్పృశ్యులు- అంటే మాలమాదిగల విషయంలో ఈ అస్పృశ్యత అంతరించేవరకైనా వారు అన్ని విషయాలలో అభివృద్ధిలోనికి వచ్చేవరకైనా ప్రత్యేక దృష్టిని కనబరుస్తారని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

*Sri A. BHAGAVANTHA RAO :—అధ్యక్షా, సాంఘిక సంక్షేమ శాఖకు ప్రత్యేకంగా వెనుకబడిన జాతుల తరగతికి చెందిన లచ్చన్నగారికి అప్పచెప్పడం చేత నేను ప్రభుత్వాన్ని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. పోతే మంత్రిగారు చెప్పిన లెక్కలనుబట్టి జనాభాలో 50 percent గా వున్న వెనుకబడిన జాతులవారు, హరిజనులు, గిరిజనులు మొదలైన వారందరు కలసి రాజకీయ రంగములో ఎక్కువగా ముందుకువచ్చి రా జ కీ యా ల ను, ఆర్థికమైనటువంటి విషయాలను తీర్చి దిద్దుకొనుటకు తగినటువంటి పథకములను నిర్ణయం చేసుకొనుటకు ప్రభుత్వం వెనుకబడిన జాతులవారిని ఇకమీదట ప్రోత్సహించవలసి వున్నది. ఎందుచేతనంటే అంతర్జాతీయ విషయాలలో కూడా వెనుకబడిన దేశాలన్నింటికీ అభివృద్ధి పొందటానికి వేరుగా ఒక block గా ఏర్పడి ఆ block అభివృద్ధిపొందే అవకాశాలు కల్పించడానికి ఆదేశాలు మాత్రమే నిర్ణయించుకోవలసి వుంటుంది అని అంతర్జాతీయ న్యాయసూత్రాలు చెబుతున్నాయి. అలాగనే జాతీయ విషయాలలోకూడా వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిలోకి తీసుకురావాలంటే ఆంధ్రదేశంలోని విశాఖ, శ్రీకాకుళం జిల్లా, రాయలసీమవారిని వెనుకబడిన జిల్లాలను ముందుకు తీసుకురాదలచిన పంథాలో కాంగ్రెసు ప్రభుత్వం

వ్యవహరిస్తున్నది. అదే విధంగా వెనుకబడిన జాతులు జనాభాలో 50% వున్నవారు కనుక వారికి యీ శాసనసభలో నూటికి 50 స్థానాలుండాలనడంలో జేసబబు కనుపించడం లేదు. అందుచేత యీ రాజకీయ సిద్ధాంతాన్ని పరిగణించి వెనుకబడిన జాతులు అభివృద్ధిపొందడానికి మంత్రివర్గంలోకూడా వెనుకబడినజాతులవారిసంఖ్య కనీసం సగానికి సగం పెంచాల్సిన అవసరం వున్నదని అనుకుంటున్నాను. అదే విధంగా జనాభాలో సగం స్త్రీలున్నారు గనుక రాజకీయ స్థానాలలో సగానికి సగం అవకాశం కల్పించాలని అమ్మన్నరాజా గారు నినాదం లేవదీస్తాం అంటే మేము కూడా బలపరుస్తాం. ఈ వెనుకబడిన జాతులకోసం administrative posts allot చేయాలనడంలో అనుమానంలేదు. అందుచేతనే యీమొత్తం వున్నటువంటి సిద్ధాంతాన్ని అమలుపరచడానికి Statutory Board ను ఏర్పాటు చేసినట్టయితే యీ ప్రభుత్వ విధానాలను సక్రమంగా effective గా enforce చేయడానికి అవకాశం కలుగుతుందని నా సలహా.

ఇంక యీ sufferers విషయంలో మూడురకాలయిన sufferers వున్నారు. Those who are sufferer, those who are called sufferers, those who are born sufferers అని మూడురకాలుగా వున్నారు. వీంట్లో born sufferers హరిజనులు, వెనుకబడినజాతులు, made sufferers అంటె ex-tappers called sufferers అంటె political sufferers, Land assignment చేసే దాంట్లో మిగతా suffereres ను వదలివేసి political sufferers కు మాత్రమే preference యివ్వాలని చెప్పడం అంత సబబుగా కనబడడం లేదు. ఈ రోజు మనం socialistic pattern of society స్థాపించాలనే సిద్ధాంతం మనస్సులో వుంచుకొని, Welfarea State అనే సిద్ధాంతాన్ని మనస్సులో వుంచుకొని యీ రెండు సిద్ధాంతాలను సమన్వయ పరచినట్లయితే అనేకరకాలుగా యీ జాతుల అభివృద్ధికి అవకాశం వుంటుంది. ఈ రెండు సిద్ధాంతాలు మనస్సులో వుంచుకొని అందుకు తగినటువంటివిధంగా policy సరిదిద్ది వెనుకబడిన జాతుల పునరుద్ధరించే కార్యక్రమాలు enforce చేయడానికి చూడవలసినదిగా కోరుతూ శెలవు పుచ్చుకుంటున్నాను.

Sri K. PUNNAYYA :— అధ్యక్షా, అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమాలలో ప్రభుత్వము చూపించినటువంటి బాధ్యత సంతృప్తికరంగా లేదని చెప్పడానికి విచారిస్తున్నాను. మన శాంతప్పగారు చెప్పినట్లు గ్రామాలలో హరిజన సమస్యలు యధాతధంగానే వున్నవి. గ్రామాలలో అస్పృశ్యత యధాతధంగానే వున్నది. గ్రామాలలో మాత్రం పరిస్థితి పాడుగానే వున్నదని చెప్పిన దాంట్లో అతిశయోక్తి యే మాత్రం లేదని ప్రభుత్వం గుర్తించుకోవాలి. కొంతమంది చదువుకొని నాగరికతగా వుండవచ్చు. అంత మాత్రంచేత అస్పృశ్యత పోయిందని అనుకోకూడదు. శ్రీకాకుళంజిల్లాలో బాగాచదువుకున్న టువంటి వాళ్ళగుడ్డలుకూడా చాకలివాళ్ళు ఉతకడంలేదు. అంటే అస్పృశ్యత ఏవిధంగా వున్నదో ఆలోచించుకోవాలి. Hostels పెట్టాము, scholarships యిస్తున్నాం అని ప్రభుత్వము చెబుతున్నది. Statistical exhibition కావచ్చు. అందుచేత కొంతమంది విద్యావంతు లున్నప్పటికి అనేకమంది గ్రామాలలో బాధపడుతున్న సంగతి ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోవాలి.

కాబట్టే యీరోజున చాల boarding houses పెట్టాం అని చెప్పారు. మేము కూడా యీ రోజున graduates తయారవుతున్నందుకు సంతోషపడుతున్నాను. అది చాలదని ప్రభుత్వం అంగీకరించాలి. మిగత కులాల వారు యింతకన్న హీనస్థితిలో వున్నారని ప్రభుత్వానికి సమాధానం చెబుతున్నారు. మిగత కులాలవారు దుస్థితిలో వుండవచ్చు. కాని వారు అస్పృశ్యత వలన బాధపడుతున్నారా అని అడుగుతున్నాను. Untouchability అనేది condition precedent గా హరిజనులకు constitutional right యేర్పండింది. constitutional privilege ఏర్పడింది. స్వరాజ్యము వచ్చినదగ్గరనుంచి హరిజనులకు welfare department పెట్టిన దగ్గర నుంచి ఎన్ని case లు యిప్పటికి ప్రభుత్వము పెట్టినట్లు. ఒక case పెట్టినట్లు మున్న చెప్పారు. కాని యీ రోజున కూడ యీ అస్పృశ్యత విపరీతముగా వున్నది.

ఎక్కడబడితేఅక్కడ ప్రతిగ్రామంలోకూడ విపరీతమైనబాధ ఉన్నది. హరిజనుల విషయములో ఏదో కొద్ది చేస్తున్నమాత్రాన, backward community అనే పేరుతో లేక forward community అనే పేరుతో, హాస్యపరిస్థితులకు దిగజారి పోతున్నది. ఇప్పుడే ఒకమిత్రుడు చెప్పుతూ ఉన్నాడు— ఈభగవంతుని బిడ్డలు ఎంతమంది ఉన్నారు ఈ శాసనసభలో అని అడుగుతున్నాడు. ఈ విధంగాఉంది ధోరణి. భగవంతుని బిడ్డలట. హరిజనులు అయినంతమాత్రంచేత భగవంతునిబిడ్డలే కావచ్చును. నిజమే, మంచిది. మన శాంతప్పగారు చెప్పారు: మన పేర్లు మాత్రం మారాయి గాని, సమస్యఅనేది మారినదా? అని. ఇది మాత్రం ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోవాలి. ఇక మీదట బోర్డింగు గ్రాంటుఇచ్చాము లేక ఇతరమైనఅనేకంచేశాం అనేదానితో మాకు తృప్తికాకపోవచ్చును. కాని ఎన్నికేసులు బుక్కు చేస్తున్నది, దౌర్జన్యం ఏవిధంగా అరికట్టుతున్నది ఇది అంతా కూడ తెలియచెయ్యాలి. గ్రామం పోతే బావిని తాకనివ్వరుకదా బావి కోసం application పెట్టుకుంటే కాతరు ఉండదు. House sites అనేకము ఇస్తున్నాం అని చెప్పుతున్నారు. కాని శ్రీకాకుళం జిల్లాలో ఎన్ని ఇచ్చారు? రాష్ట్రము మొత్తముమీద statistics ఏమి? ఎందుకు exhibit చేయకూడదు? అది మాత్రం చేయరు. శ్రీకాకుళంలో ఎన్ని awards pass చేశారు. Department పెట్టి 10 సంవత్సరాలు అయింది. ఈ రోజుకు అభివృద్ధి ఏమాత్రం కూడ కనబడలేదు. గవర్నమెంటు ఉన్నదా అని నేను ప్రశ్న వేస్తున్నాను. ఇక శ్రీకాకుళములో ఏదో కొత్తగా సంఘాలు, సంస్థలు పెట్టుకొని కొద్దిగా ఆందోళన చేస్తున్నాం. విశాఖపట్టణం జిల్లాలో అసలు ప్రభుత్వమే లేదని అనిపిస్తూ ఉన్నది. ఒకచోట ఒక hostel పెట్టించారు. శ్రీకాకుళములో ఆ hostel పెట్టారు. ప్రతి తాలూకాకు ఒక hostel పెట్టవలెననే ప్రభుత్వముయొక్క స్కీము ఎంతవరకు అమలు చేశారు? ఈ సంవత్సరము అనేక విధముల అభివృద్ధి చెందుతుంది అనుకొన్నాను. గాని ప్రభుత్వం deficit Budget పేరుతో కావలసినన్ని hostels పెట్టలేదు సరికదా ఉండే hostels boarders ను తగ్గిస్తున్నది. ఇది చాల శోచనీయం. ఏమాత్రం తగ్గించకూడదు అని నా హృదయపూర్వక ప్రార్థన. Mismanaged hostels ను ప్రభుత్వం తప్పకుండా తీసుకోవాలి. అది హరిజన M. L. A. లు అందరు చెప్పిఉన్నారు. రాష్ట్రము మొత్తంమీద కూడ ఈ ప్రభుత్వ అజ్మాయిషీ క్రింద కొన్ని hostels నడపండి.

22nd July 1955] (Sri K. Punnayya)

ఒక definite policy అమలులో పెట్టండి. Subsidised hostels may be allowed అని పెట్టండి. Subsidised hostels లో mismanaged hostels తీసుకోండి అని చెప్పతుంటే mis-managed అని రుజావు చేయకుండా తీసుకోవడం ఏదో మీ level లో సరిపోవచ్చును గాని సామాన్య ప్రజలు, సామాన్య హరిజలు ఏవిధంగా ఆలోచిస్తారో కొద్దిగ తెలుసుకోవాలి. Waste land assignment సందర్భములో కొన్ని విషయాలు మేము రిప్రెజెంటేషను సందర్భంలో చెప్పతాము అనుకొంటే దానిని గురించి చెప్పలేకపోయినాను, ప్రతి గ్రామము నుంచి కూడ ఈ waste land assignment విషయమై ప్రభుత్వానికి అనేక దరఖాస్తులు వెళ్ళుతూ ఉన్నాయి. దరఖాస్తులు వెళ్ళితే Revenue Inspector కు bumper crop అవుతుంది. ఎందుచేత అంటే మునసబు objection untenable అన్న తర్వాత B. memo లు బుక్కు చేయిస్తున్నాడు. వెంటనే caste hindus rights లేనిదేకూడా భూమిపైనుంచి వెళ్ళగొట్టి B. memo book చేస్తున్నాడు. తరువాత land assignment ఎలా జరుగుతుంది హరిజనునికి? ఇక తర్వాత Tahsildar ను లేక Deputy Tahsildar ను influence చేసుకొనవలసిన స్థితిలో ఉన్నారు.

preference must be given to Harijans అంటున్నారు. ఆక్రమించుకుంటే తొలగించకూడ దంటున్నారు. శ్రీకాకుళం జిల్లాలో ఇది చాల కష్టమైన పరిస్థితి. ఎందుచేత, ఏ గ్రామానికి 10 మంది కుటుంబాలుఉండడం మహాకష్టం. ఎక్కడో విడిచిపెట్టబడినటువంటి భూమికై దరఖాస్తు పెట్టుకుంటే వస్తుందికదా అనే ఆలోచనచేత దరఖాస్తు పెట్టుకుంటే ఆ వెంటనే స్థానికంగా ఉన్న మునసబు అయినటువంటివాడు object చేసి అనేక విధములుగా అల్లరి చేస్తున్నాడు. మలకాం గ్రామంలో మొట్టమొదట Tahsildar ఇచ్చివేశారు. దానిని సాగు చేసుకొన్నారు. కాని తరువాత భూమిపైకి రాకూడదని 144 section క్రింద proceedings ఇచ్చారు. తరువాత estate manager దగ్గరకు పోయి వారిని వశం చేసుకొని, హరిజనులను వెళ్ళగొట్టారు. ఆలాగే జగన్నాథవలస గ్రామంలో ఉంది. లిస్టులు కావాలంటే వేలకొలది ఇస్తాను. ఈ విధంగా ఉంది హరిజన సమస్య Waste land assignment తో మాకు సంబంధము లేదు, అది Revenue department కు సంబంధించింది అని అనకోకూడదు. Harijan welfare department దానిని గురించి బాధ్యత వహించవలెను. ఈ department ను Revenue department కు ఒప్పచెప్పండి. ఒప్పచెప్పితే waste land assignment సందర్భంలో కొంతవరకు అభివృద్ధి కనపడుతుంది. Waste land assignment విషయంలో సక్రమమైన అభ్యుదయకరమైన వైఖరిని అనుసరించవలెనని కోరుతున్నాను. అస్పృశ్యతా నిర్మూలన సందర్భంలో గ్రామాలలో తగాదాలు విపరీతంగా ఉన్నవి. Security proceedings వెంటనే ring leaders పైన గ్రామమునసబులపైన మీరు ప్రారంభించండి. లేకపోతే ఈ సమస్య పరిష్కారం కాదు. హరిజన దినోత్సవములు పెట్టుతూ ఉన్నారు. దానివల్ల లాభం ఏమిటి? మొన్న కడపజిల్లాలో 12 హరిజన దినోత్సవములు జరిపారు. మూడువేల రూపాయలు ఖర్చుపెట్టారు. మీటింగులు పెట్టుటకొ మీరు డబ్బు ఖర్చుపెట్టింది. ఎందుకు ప్రత్యేక కార్యక్రమం ఇవ్వకూడదు?

ఇదిగో దేవాలయ ప్రవేశం చేస్తున్నామనో, బావి నీళ్ళు తోడుకోనిస్తున్నామనో, ఏదో ఒక constructive programme పెట్టించండి. అంతేగాని మీటింగులుపెట్టకండి.

(After Lunch 3-00 p.m.)

Sri S. JAGANNADHAM :— అధ్యక్షా! ఇంతకుముందు మాట్లాడిన వారిలో చాలమంది హరిజనులే మాట్లాడారు. ఒక భగవంతరావుగారు మాత్రము హరిజనులు కారు. వారుకూడా Harijan uplift గురించి చర్చచేస్తూ వచ్చారు. గౌరవనీయ మంత్రిగారు ఈ డిమాండు క్రింద 99 లక్షలకు పైగా చూపించారు. దాన్ని నేను పూర్తిగా ఆమోదిస్తున్నాను. కాని ఈ హరిజనుల uplift కును, ఇతర backward classes యొక్క uplift కునూ 99 లక్షలు చాలదనిపిస్తున్నది. అందుకనే ఒక విషయము మనవిచేస్తున్నాను. హరిజనుల uplift గురించి చాలా Acts, పాస్ చేసినారు. కాని అవి సక్రమంగా అమలు జరుపలేదని మనవి చేస్తున్నాను. హరిజనులను దేవాలయాలలో ప్రవేశింపజేయుటకు ఏవేవో పెద్ద పెద్ద Acts pass చేసినారు. కాని ఇంతవరకు ఆ Act సరిగా అమలు జరుగుతుందా లేదా అని ప్రభుత్వము ఆలోచించినట్లు లేదు. పట్టణాలలో మాత్రము వీరితో కొంతమటుకు కలిసి మెలుగుతారు గాని, గ్రామాలలో చూస్తే ఈ అంటరానితనము ఏమాత్రము నశించినట్లు కన్పించదు. గ్రామాలలో కూడ చదువుకొన్నవారు, పెద్దమనుష్యులు ఉన్నారంటె, వారు పట్టణాలలో మాత్రమే హరిజనులతో కలిసి ఉంటామని చెప్తారు కాని గ్రామాలకు పోయిన తరువాత వారిని పక్కకు నెట్టివేస్తూ వారిని చాలా బాధలు పెడుతున్నారు. అయితే ఈ అంటరానితనము నశించుటకు ఒక మార్గము కనిపిస్తున్నది. ఇప్పుడు హరిజనులు చాలామంది ఉద్యోగాలలో ప్రవేశిస్తున్నారు. ఉద్యోగస్థులుగా చేరి అక్కడ ఉన్నవారితో కలసిమెలసి తిరుగుతూ ఉండడం జరుగుతుంది. కనుక అన్ని డిపార్టుమెంటులలో కూడ ఈ హరిజనులకు అవకాశ మిచ్చినట్లయితే చాలావరకు అంటరాని తనము నశిస్తుందేమో నని మనవిచేస్తున్నాను. అంతే కాదు ముఖ్యంగా హరిజనులకు దేవాలయములలో ప్రవేశపెట్టడానికి ఒక Act పాస్ చేసినారుగాని ఆ విధంగా కాకుండా దేవాలయముల హరిజనులను పూజార్లుగా నియమించినట్లయితే, గ్రామాలలోను, పట్టణాలలోను ఈ అంటరాని తనము చాలామటుకు నశిస్తుందని భావిస్తున్నాను. ఇప్పుడు ముఖ్యంగా ఈ హరిజనుల గురించి మాట్లాడడానికి రాలేదు. Backward classes కు సంబంధించినటువంటి ఒక ముఖ్యమైన విషయమును మనవి చేయుటకు ఈ అవకాశము తీసుకొన్నాను. Constitution of India లో 340 వ Article క్రింద India Government వారు Backward Classes Commission ను నియమించారు. ఈ Backward Classes Commission ప్రతి రాష్ట్రంలో కూడా పర్యటించి అక్కడ కావలసినటువంటి విషయాలను తీసుకొని ఏయే జాతులను ఏయే Backward Classes lists లో చేర్చాలో ఆలోచించి ఆ విధంగా చేర్చడం జరుగుతుంది. ఈ సందర్భంలో మా జాతి, పల్నాటి వెలమ గురించి మనవిచేస్తున్నాను. ఈ పల్నాటి వెలమ అనేది ముఖ్యంగా రాష్ట్రమంతటా కాకుండా ఒక శ్రీకాకుళం జిల్లాలో మాత్రమే ఉన్నది. ఆ జిల్లాలోను ముఖ్యంగా 5 తాలూకాలలో మాత్రమే ఉన్నది. అనగా నరసన్నపేట, శ్రీకాకుళం, టెక్కలి, పాతపట్నం, పాలకొండ తాలూకాలలో మాత్రమే పల్నాటి వెలమ జాతి ఉన్నది. ఈ తాలూకాలల్లో

యీ నాడు మనకు మూడు లక్షల జనాభా ఉన్నది. ఈ మూడు లక్షల జనాభాలో ఇది వరకు నలుగురు graduates మాత్రమే ఉన్నారు.

ఇదివరకు వారికి ఆర్థికంగా గాని, సాంఘికంగా గాని, విద్యా విషయకంగా గాని ఎటువంటి అవకాశము కల్పించలేదని మనవిచేస్తున్నాను. 1937 వరకు కూడ ఈ పల్నాటి వెలమ అనే జాతి backward classes facilities అనుభవిస్తూ ఉండేది. వారు scholar-ships, half-fee concessions పొందుతుండేవారు. 1937 లో బొబ్బిలి మహారాజావారు మంత్రిగా వచ్చినారు. వారుకూడ ఈ వెలమ జాతికి చెందినవారే కాని నేను చెప్పిన పల్నాటి వెలమజాతి కాదు. బొబ్బిలి వెలమ అంటే పాతవెలమ అనిపించుకొంటున్నారు. అప్పటి పరిస్థితులలో వారు సామంతులుగా ఉండడంచేతనో, లేక మరో కారణంచేతనో ఈ వెలమజాతి back-ward classes list లో ఉంటే బాగుండదేమోనని దానిలోనుంచి eliminate చేశారు. తరువాత ఈ sub-sects అన్నీ అంటే కొప్పువెలమ, బొబ్బిలివెలమ మొదలగు వెలమ sub-sects అన్నీ వాళ్ళు ఏదో ప్రయత్నంచేసి తీసివేయగలిగారు. తీసివేసిన తరువాత ఈ విషయం గురించి చాలా representations చేయడం జరిగింది. 1954 ఆగష్టులో ఒక మెమోరాండమును submit చేయడం జరిగింది. తరువాత Social Welfare Director, Prabhakar Rao గారు విశాఖపట్నం వచ్చినప్పుడు వారికి ఒక మెమోరాండమును submit చేయడం జరిగింది. వారికి శ్రీకాకుళంజిల్లా పరిస్థితులు పూర్తిగా తెలుసును. ఈ వెలమజాతినిగురించి, వారుకూడ పూర్తిగా హామి ఇచ్చినారు కాని 1954 list లో ఈ జాతి back-ward classes లో కన్పించలేదు. తరువాత గౌరవనీయులైన లచ్చన్నగారు కూడ ఈ జిల్లాకు చెందినటువంటివారే. వారికి కూడ ఈ పల్నాటి జాతి పరిస్థితులు తెలుసు. అందుచేత ఇప్పుడు కేంద్రప్రభుత్వంవారు యే నిర్ణయానికి రాకముందే, ఈ పల్నాటి వెలమ జాతిని back-ward list లో చేర్పించడానికి మన ప్రభుత్వం కృషిచేసి రాబోయే list లో నైనా దీనిని చేర్పించేటట్లు చేస్తారని కోరుతూ నాకీ అవకాశ మిచ్చినందుకు అధ్యక్షులవారికి నా ధన్యవాదము లర్పిస్తున్నాను.

Sri A. KALESWARA RAO :— అధ్యక్ష మహాశయా, తమరు నాకు యిచ్చిన యీ అవకాశము చాలా స్వల్పముగా వున్నందున యిప్పుడు యీ కొద్ది టైములో నేను ఏవో కొన్ని విషయాలు విడిచిపెట్టవలసినను, కొన్ని ముఖ్యమైన విషయాలు మాత్రం చెప్పదలచుకున్నాను.

బెజవాడలో హరిజన హాస్టళ్ళు నాలుగు కారణము యేమీ లేకుండానే మంత్రిగారు మూసివేయటానికి వుత్తరువు చేశారనిన్నీ, తరువాత వాటిని ప్రభుత్వమే నిర్వహించబోతున్నదని తెలిసింది. ఆదేవిధముగా యింకను అక్కడక్కడ వున్నవి. 24 హరిజన హాస్టళ్ళు ప్రత్యేకంగా కారణము యేమీ లేకుండానే మంత్రిగారు మూసివేయటానికి అనుమతి యిచ్చారనికూడా తెలుస్తున్నది. ఈ విషయములో నేనొక్క విషయము మనవిచేయదలచాను. ఈ ఆర్డరులు చాలా ఆలస్యముగా వచ్చినవి. ఇంతకు ముందు కొద్దిరోజుల క్రిందనే స్కూళ్ళు అన్నీ తెరిచారు. పిల్లలు అప్పుడే బజార్లలో పుస్తకాలకొరకు తిరుగుచున్నారు. స్కూళ్ళ మేనేజర్లు, హెడ్మాష్టరులు స్కూలు ఫలానా తేదీన తెరుస్తున్నాము, మీరందరు రండి అని ఆహ్వానాలు పంపించారు. వారు

యిప్పుడు వచ్చారు. వారికి హాస్టలు వసతులు లేకుండా పోతే చాలా యిబ్బంది పడుతారు. కాబట్టి యీ ఆర్డర్లు చాలా ఆలస్యముగా వచ్చినవి గనుక పిల్లలకు యీ సంవత్సరము మాత్రము యిబ్బంది లేకుండా, యీ సంవత్సరానికి హాస్టళ్ళు వుంచవలసిందిగా ఆర్డరు పంపమని కోరుతున్నాను. ముందుగానైనా తెలిసివుంటే, వాళ్ళ ఏర్పాట్లు వారు చేసుకొనేవారు. కనీసము ప్రతి జిల్లాలోను ఒక boys' hostel, ఒక girls' hostel చొప్పున అయినా యీ సంవత్సరమునకు వుంచితే బాగుంటుంది. ప్రభుత్వము ఆ ప్రకారము చేస్తారని ఆశిస్తున్నాను.

ఇంకొక విషయము. ఇది బెజవాడలో పారిశ్రామికులకు యిళ్ళస్థలము విషయము. ఎంతోమంది పేదవాళ్లు, హరిజనులు, వగైరాలు కంట్రాక్టరు క్రింద పనిచేసేవాళ్ళు, ఫ్యాక్టరీలలో పనిచేసేవాళ్లు, కూలిపని చేసేవాళ్ళు, యిటువంటివాళ్లు నేలకొలది వచ్చి పోరంబోకు స్థలాలలో గుడిశెలు వేసుకొని వుంటున్నారు. వాళ్లు అక్కడ ఎన్నో సంవత్సరాలుగా వుంటున్నారు. వాళ్లు అక్కడ యిళ్ళు కట్టుకోవటం మూలాన మునిసిపాలిటీ వాళ్ళు పన్నులు వేసి వసూలు చేస్తున్నారు. ఆ స్థలాలను వాళ్ళకు పట్టాలు యివ్వకపోవడమువల్ల, వారికి అక్కడ దీపాలుగాని, నీటిపంపులుగాని, రోడ్డు సౌకర్యాలు గాని ఏమీ గూడా లేకుండా చీకటిరోజులలో దారి డొంక తెలియకుండా చాలాబాధ పడుచున్నారు. కాబట్టి మంత్రిగారు యీ పేదవాళ్ళ కష్టాలు మనస్సులో పెట్టుకొని, వారికి ఆ భూములను పట్టాలు యివ్వవలసిందిగా కోరుచున్నాను. మంత్రిగారు బెజవాడ వచ్చినప్పుడు గూడ వారికి యీ విషయము మనవిచేశాను. వారికి ఒక మనవుగూడా యివ్వడమయింది. కాబట్టి ఆ స్థలాలు వాళ్ళకు ఖాయం చేయాలని అంటున్నాను. ఇదేమి ఎంతో పెద్ద పని కాదు. మంత్రిగారి చేతులలోదే. కాబట్టి వారికి ఆ స్థలాలు ఖాయంగా యివ్వమని అంటున్నాను.

ఇక ఉద్యోగస్థులు చూద్దామా అంటె యిళ్ళపన్ను వారి యిష్టమువచ్చినంత వ్రాస్తారు. స్థలాలకు మార్కెటుధరలు కట్టుకుంటున్నారట. గజానికి 2½ రూపాయల చొప్పున యివ్వమని అంటున్నారట. గజము ఒకటింటికి 2½ రూపాయలు యివ్వమని అంటే ఎకరం ఖరీదు 12 వేల రూపాయలు అవుతున్నది. ఇంత పెద్ద రేటు వాళ్ళ నెత్తిన వేస్తే యికవాళ్ళు వాళ్ళ కుటుంబాలతో సహా అందరూ నాశనము అవుతారు. కాబట్టి నేను ముఖ్యంగా మంత్రిగారిని కోరే దేమిటంటే వాళ్ళకు ఆ స్థలాలు వుచితంగా యివ్వాలని అంటున్నాను. పోనీ గజానికి ఒక రూపాయి చొప్పున అయినా చూచుకున్నప్పటికినీ, నూరు గజాలు వున్నవాడు నూరు రూపాయలు కట్టుకోవలసి వస్తుంది. ఈ సొమ్ము నాలుగు సంవత్సరాలలో తీర్చేటట్టు చేస్తే పరవాలేదు. వాళ్లు చాలా బీద వాళ్లు. ఏ రోజు కూలి ఆ రోజు తెచ్చుకొని జీవించేవాళ్లు. మరునాడు మరల తిండి కోసము వెతుక్కోవలసినవాళ్ళుగా వుంటూ వున్నారు. వాళ్లు యిదివరకు ఎన్నో ఏండ్లుగా అక్కడ వుంటూవున్నారు. కాబట్టి, వాళ్ళకు యీ స్థలాలు వుచితంగా యిస్తేనే బాగుంటుందని నా సలహా. అందులో నానా అలగా జాతులవాళ్లు వున్నారు. Harijans వున్నారు. ఇంకాయితర జాతులవారువున్నారు. Housing Co-operative Society పెట్టారు. కాని అది చాలాజాగుతో చీమలాగు నడుస్తున్నది. ఈ సొసైటీ వారు భాగ్యవంతులకు, మధ్యతరగతివారికి అప్పులు యిస్తారే గాని, బీదవాళ్లకు లోన్సు యింత

వాళ్ళలో వాళ్ళే creat చేసుకుంటూ యీ సొసైటీని అంతా బూటకంగా నడుపు తున్నారుగాని, పేదవాళ్ళు ఎవరైనా పోయి అడిగితే, ఎవరూ ఏమీ మాట్లాడరు. అందులో చేర్చుకోరు. హరిజనులకు నిజంగా యిళ్ళ స్థలాలు యింతవరకు ఒక్కరికిగూడా ప్రభుత్వం యిచ్చినట్లు కనబడదు. ఇదుగో, పొలము యిస్తాం, స్థలము యిస్తాం అని ప్రభుత్వం అనడమే గాని ఒక్కరికి గూడ యింతవరకు ఏదీ యిచ్చినట్లు లేదు. గవర్నమెంటు స్థలాలు లక్షలకొలది వున్నవి. ఒక స్థలములో ఎక్కడనైనా వీరందరిని colonise చేసి, యీ పేదవాళ్ళందరిని తీసుకొనిపోయి, అక్కడ వాళ్ళకు దున్నుకోటానికి భూములు యిచ్చి, ఎద్దులు వగైరాలు వ్యవసాయం కోసం కావలసిన పరికరాలు అన్నీ కొనుక్కోటానికి డబ్బు అప్పుగా యిచ్చి ఆ భూమిని improve చేయటానికి అవకాశాలు కలిగిస్తే వీళ్ళకు సహాయము చేసినట్లు అగును. వాళ్ళకు భూమి పూర్కె యిస్తే లాభములేదు. వాళ్ళకు తగిన డబ్బుసహాయము చేయకపోతే ఆ పొలాలు కొన్నాళ్ళకు అమ్ముకొని లేచిపోతారు. కాబట్టి ఆ పొలాలు వాళ్ళకు పూర్కెయిస్తేగూడా లాభములేదు. అటువంటి స్కీము యేమీ work చేయదు.

కాబట్టి వాళ్ళకు యిళ్ళస్థలాలవిషయములో అసలు స్కీము యేమీ గూడా ఉన్నట్లు లేదు. మా బెజవాడలో 14 ఎకరాల స్థలము 219 కుటుంబాల వారికి యిస్తామని చెప్పి acquisition అనిచెప్పి, యిదుగో తీసుకుంటున్నాం అని చెబుతూరావడం, ఎన్నో సంవత్సరాలనుంచి జరుగుచున్నది. నేను క్రిందట దఫా వుమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు మెంబరుగా వున్నప్పుడు అక్కడ పరమేశ్వరన్ మంత్రిగా వుండేవాడు. అప్పుడు నేను ఈ విషయాలన్నీ వారితో చెప్పాను. తరువాత సంజీవయ్యగారు అక్కడ మంత్రిగా వున్నప్పుడు వారితో గూడా మనవి చేశాను. ఇంతేకాదు మంత్రులు అక్కడికి వచ్చినప్పుడు ఆ పేద వాళ్ళందరూ యీవిషయాలు అన్నీ మంత్రులకు చెప్పి లబలబ కొట్టుకోవడము మాత్రము ఒకటికనబడుచున్నదే కాని క్రియమాత్రం శూన్యంగావున్నది. ఇళ్ళ స్థలాలు కావలసినవాళ్ళు స్థలాలు యివ్వమని పొలాలు కావలసినవాళ్ళు పొలము యివ్వమని అడగడమే గాని ఒక్కరికీ గూడ ఒక్క స్థలముగాని, పొలముగాని యిచ్చినట్లులేదు. కాబట్టి ప్రభుత్వం యిదంతా ఆలోచించి త్వరలో ఒక పద్ధతి నిర్ణయించి దాని ప్రకారం చేస్తేబాగా వుంటుందని అనుకుంటాను.

Harijan welfare, Harijan welfare అనడంలోనే కాలము జరిగిపోతున్నది. కాని ప్రభుత్వానికి యీ విషయంలో ఒక ప్లానుగూడా లేదని అనుకుంటున్నాను. ప్రభుత్వము నేను చెప్పిన సంగతులు అన్నీ గమనించి త్వరలో చర్య తీసుకుంటారని ఆశిస్తూ యింతటితో శెలవు తీసుకుంటున్నాను.

Sri V. KURMAYYA :— అధ్యక్షా ! ఈ హరిజన్ బడ్జటు చాలా పెద్దది. కాని నాకు యీనాడు యిచ్చిన అవకాశము చాలా కొద్దిగావుంది. కాబట్టి, ముఖ్యమైన విషయాలు మాత్రం తమ దృష్టికి తీసుకొని వస్తున్నాను. Social Welfare తరఫున ఈ రోజున ఇక్కడ శాసనసభలో ప్రవేశపెట్టబడిన బడ్జటు ప్రకారంగా హరిజనులకు 50 లక్షల రూపాయలు ప్రభుత్వం ఖర్చు పెట్టుతున్నట్లు తెలుస్తున్నది. ఈ 50 లక్షల రూపాయలు లేబరు పాఠశాలలకు, ఉద్యోగస్తులకు దాదాపు 50% పోతున్నది. పోతే మిగిలింది 24,00,800 రూపాయలు మాత్రమే actual గా హరిజనులకు గాని,

backward classes విద్యార్థులకు గాని, లేకపోతే Criminal Tribes విద్యార్థుల క్రింద గాని ఖర్చుపెట్టేటట్లుగా తెలుస్తున్నది. ఎందుకంటే యిప్పుడు యాభైలక్షల రూపాయల ఖర్చు అవుతుందని బడ్జెటులో చూపిస్తున్నారు. అప్పుడు 50 లక్షల గ్రాంటు లేబరు పాఠశాలల క్రింద ఖర్చుచేయబోతున్నారు. ఆ పాఠశాలలలో కేవలం హరిజనులు మాత్రమే లేరు. హరిజనులు, backward classes యింకా యితర హిందువులు కూడా వున్నారు. మా కృష్ణాజిల్లాలో రెండు హరిజన హైస్కూళ్లు వున్నవి. ఒకటి బందరులోనూ, రెండవది Dokiparru లోను వున్నది. బందరులో వున్న హైస్కూలులో స్థానములు హరిజనులకు యివ్వకుండా యితర కులాల వారి కిస్తున్నారు. మంత్రిగారు ఈ విషయము నోటుచేసుకోవాలని కోరుతున్నాను. మొన్న బందరు హాస్టలుకు విద్యార్థులను సెలక్టు చేసేటప్పుడు నేను అక్కడికి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి సెలెక్షను అయిపోయిందనిన్నీ, యింక సీట్లు ఖాళీలేవనిన్నీ, చెప్పారు. కాని ఈ హైస్కూలు హరిజనులకోసం నడపడము గా వుంటే, ఇందులో హరిజన విద్యార్థులకు సీట్లు లేకుండా చేయడం నాకు చాలా విచారంగా వున్నది. అందువల్ల వారిని ఇతర హైస్కూలులో చేర్చవలసిన పరిస్థితి యేర్పడ్డది. ఇటువంటి పరిస్థితి ఈ హైస్కూలులో జరిగింది గాన నేను దీన్ని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. అందుచేత కేవలం హరిజనులకు మాత్రమే ఈ డబ్బు వినియోగపడుతున్నదని అనుకోవడం ఒక భ్రమ అని అంటున్నాను.

ఇప్పుడు ఈ బడ్జెటు ప్రకారము చూస్తే 8 లక్షల రూపాయలు పైగా 330 Subsidised Hostels కు ఇస్తున్నట్లు వున్నది. అంటే ప్రభుత్వంవారు 8 హాస్టళ్లు మన స్టేటులోనడుపుతున్నారు. వీటిలో 750 మంది విద్యార్థులకు వసతిఏర్పాటుచేసి చదువుచెప్పిస్తున్నారు. దానికి రు. 2,28,400 ఖర్చుచేస్తున్నారు. 330 subsidised hostels లోను 8569 మంది బోర్డర్సు వుంటున్నారని చెప్పారు. దీనికి 8 లక్షల రూపాయలు ఖర్చుపెట్టుతున్నామని గూడా ప్రభుత్వమువారు చెబుతున్నారు. దీనికి నిజంగా గవర్నమెంటు హాస్టలు లెక్కలనుబట్టి చూస్తే రు 25,26,533 లు ఖర్చు అవుతున్నది. నేను ఎందుకు చెబుతున్నానంటే హరిజన subsidised హాస్టళ్ళకు యిచ్చే డబ్బు అంతా గూడా దుర్వినియోగము అవుతున్నదని ఆ ప్రాంతాలవారే కాకుండా యింకా M. L. A. లు కూడా చెప్పారు. అసలు ఈ హాస్టళ్ళకుగాను యిచ్చే సొమ్ము ఎంత ? ఈ 330 హాస్టళ్ళలోనూ 85559 మంది విద్యార్థులకు గాను ఖర్చుపెట్టబడేది 8 లక్షల రూపాయలు. ఎనిమిది హాస్టళ్లలోను 756 విద్యార్థులకుగాను ప్రభుత్వమువారు ఖర్చు చేసేది 2,28,400లు. అందుచేత ఇక్కడ డబ్బు దుర్వినియోగము అవుతున్నదని చెప్పడము కేవలము అబద్ధమని అంటున్నాను. అయితే ఈ వ్యవహారము అంతయు కేవలము రాజకీయాలలోకి దిగిపోయింది. కమ్యూనిస్టు పార్టీవారు విమర్శించడముగాని కాంగ్రెసులో యిష్టములేని M. L. A. లు గాని ముఖ్యంగా Welfare Department వారు ఏ హాస్టళ్లకు అయితే subsidy యిస్తున్నారో వాటి అన్నిటి విషయాలలోనూ రాజకీయాలతో ముడిపెట్టి యీ విధంగా దుష్ప్రచారము చేయడం జరుగుచున్నది.

ఇంకొక విషయము. Educational grants అనిచెప్పి, boarding grants క్రింద యిన్ని లక్షలు అని యిస్తున్నారు. దీని విషయములో యిక్కడ మాట్లాడే

M.L.A. లు గాని మంత్రిగారు గాని యింకా యితర నాయకులుగాని ఎవరూ చెప్పలేదు. కర్నూలులో జరుపబడుతున్న హాస్టలు ఎక్కువమంది హరిజన బాలురతో నడపడముచేత యింకా యితరచోట్లలోనూ హరిజనులు అన్ని రంగాలలోనూ చాలా తేలికగా చూడబడడంచేత ఈవిధంగా mis-management అవుతున్నదని చెబుతున్నారు. నిజానికి మంత్రిలచ్చన్నగారు హరిజన M. L. A. ల నందరిని ఆహ్వానించి నప్పుడు ప్రతి proved mis-management ఉండే hostel ను గూడా తీసుకొని ప్రభుత్వము నిర్వహించాలని చెప్పిన మాటనిజమే. అయితే మంత్రిగారు మేము చెప్పిన ప్రకారము చేయకుండా, దానికి వ్యతిరేకంగా కొన్ని హాస్టళ్లను తీసుకున్నారు. అయితే మంత్రిగారు నిడుబ్రోలు హాస్టలు గూడ అక్కడ పిల్లలు లేకపోయినప్పటికినీ ఎందుకు తీసుకోలేదో అర్థము కాకుండా వున్నది. దీనికి కారణము మంత్రిగారు చెబుతారని ఆశిస్తున్నాను. ఆ హాస్టలును పూర్తిగా mis-managed గా వున్నదని ఆయన తృప్తిపడి చెప్పిన మాటనిల బెట్టుకోలేక పోయారు. కనుక అన్ని డిపార్టుమెంట్లు మాదిరిగా యీ డిపార్టుమెంటులో కూడా కొంతమంది స్వార్థము కోసం తప్పుపనులు చేస్తున్నమాట వాస్తవమే. అయితే మంత్రిగారికి హరిజనుల తరపున హాస్టల్సులో నాకు వున్న అనుభవాన్ని బట్టి చెబుతున్నాను. ఈ హాస్టల్సు ఏవిధంగా వుండాలి, అనేది చూస్తే దీనికి ఒక స్థలము ఒక సిద్ధాంతం అనేది యేదీ వున్నట్లు కనబడదు. ఇది సిద్ధాంత రీత్యా జరగడము లేదంటే ఏదైనా తప్పువుంటే అందరి M. L. A. లను పిలచిగాని కాకపోతే Department ద్వారా ఒక report ను call for చేయించిగాని ఆ తరువాత ఏ హాస్టలు విషయములోనైనా యాక్షను తీసుకుంటే బాగావుంటుంది కాని ఏ కారణము లేకుండా పంతులుగారు చెప్పినట్లు యిష్టం వచ్చినట్లుగా ఏవో ఒక హాస్టలును విడిచిపెట్టేది ఒక హాస్టలును స్వాధీనపరచుకొనేది జరుగుచున్నది. ఈవిధంగా చేయడం న్యాయంకాదని అంటాను. ఈప్రకారం మంత్రిగారు యిష్టమువచ్చినట్లు వుత్తరువులు యివ్వడం జరిగింది. ప్రభుత్వముయొక్క డబ్బుతీసుకొని వచ్చిగవర్నమెంటువారే హాస్టళ్లు స్థాపిస్తేనేను అట్టివి welcome చేస్తాను. శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాల్లో గవర్నమెంటు హాస్టళ్లుగాని subsidised హాస్టళ్లు గానిలేవు. అక్కడ హాస్టళ్లకు చాలా అవసరమున్నది. గనక ఒకటి రెండు హాస్టళ్లు ప్రభుత్వం తరపున అక్కడ start చేయండి అని నేను మంత్రిగారికి సలహా యిస్తున్నాను. ఇప్పటి బడ్జటు ప్రకారము 333 హాస్టళ్లు వున్నవి. ఒక్కొక్క హాస్టలుకు ఒకటి, రెండు గ్రాంట్లు తీసుకొని Bezwada లోనూ, ప్రస్తుతము ముఖ్యపట్టణముగా వున్న కర్నూలు లోనూ పెట్టదలిస్తే, ప్రభుత్వము యిచ్చే గ్రాంట్సులో ఒకటి రెండు withhold చేసి యీ హాస్టల్సుకు యిచ్చి start చేస్తే, యివి రెండున్నూ first class hostels గా వుండడానికి వీలు వుంటుంది. అప్పుడు మంత్రిగారి ఆర్డర్లు వెనుకకు పోనక్కరలేదు. ఈ రెండింటిలోనూ గూడా ఒక్కొక్క దానిలో at least 700 to 800 students తో start చేస్తే, చాలా బాగా నడపవచ్చునని నా అభిప్రాయము.

Hostels start చేసిన తరువాత, ఇవి పనిచేసేటప్పుడు యిందులో ఒక కష్టము గూడా వున్నది. అది మంత్రిగారికి తెలియకపోవచ్చు. గవర్నమెంటు హాస్టళ్ళు పెట్టిన చోట subsidised hostels వుండవచ్చు. Subsidy యిచ్చినా ఇవ్వకపోయినా హాస్టలుకు recognition మాత్రం వుంటే చాలు. ప్రభుత్వ రూల్సుప్రకారము కేంద్ర ప్రభుత్వముగాని, రాష్ట్ర ప్రభుత్వముగాని విద్యార్థులకు scholarships యిచ్చేటప్పుడు

వారు హాస్టలులోనే residentsగా వుండాలి. Residential qualfications యొక్క అవసరం వున్నది. ఈ గవర్నమెంటు హాస్టలులో కాలేజీలో చదువుకునేవారిని high schools లో scholarship retrench చేసినవారిని మరల చేర్చుకోరు. అటువంటి వారు చాలామంది బెజవాడలో వున్నారు. దాదాపు 20, 30 మంది కాలేజీలలో చదువుకొనేవారు వున్నారు. వారు చదువుకోవడము మాత్రము వదిలిపెట్టలేరు. ఎందుకంటే, private hostels కు recognition వుంటే ఆ hostels లో చేరి చదువుతారు. గవర్నమెంటు డబ్బు యివ్వకపోతే, యివ్వకపోవచ్చు. కాని hostel కు recognition యిచ్చినట్లయితే యిటువంటి సౌకర్యాలు విద్యార్థులకు చేసినవా రవుతారు. బెజవాడలో college hostel పెట్టమని రెండు సంవత్సరాలనుంచి ఒక ప్రపోజలువున్నది. ఆ proposal ప్రకారము వెంటనే college hostel పెట్టినట్లయితే, యీ subsidised hostels వున్నా లేకపోయినా ఫరవాలేదు. అప్పుడు residintial qualfication వున్నది అనే certificate hostel mangers యివ్వకపోయినను ఇట్టే యిచ్చింది యేమీ వుండదు. అందువల్ల యీ గవర్నమెంటు తరఫున college hostel ఒకటి స్థాపించుమని అంటున్నాను.

హరిజనులు నూటికి 15 మంది వున్నారు, మంత్రిగారు కూడా 27 లక్షలమంది వున్నారని చెప్పారు. అందరూ కూడా సాంఘికంగా చాలా బాధపడుతున్నారు, అవమానింప బడుతున్నారని చెబుతున్నాను. శాస్త్రాలు వున్నాయి, చట్టాలు వున్నాయి, జీ, ఓలు వున్నాయి. ఇవన్నీ కూడా ప్రభుత్వము చాలా వుదారంగా ప్యాసు చేసింది. వాటిని మాత్రము అమలు జరపడంలేదు. అవన్నీ అమలు జరిపినట్లయితే అస్పృశ్యత ఎప్పుడో పోయి వుండేది. ఇవన్నీ కూడా మనము ఇక్కడ మాట్లాడుకోడానికి ఇది సమయము కాదు. ఈ హాస్టల్సు విషయములో మీరేదైనా పాలసీ మార్చుకో దలచుకుంటే మాకేమీ అభ్యంతరము లేదు. మార్చే పూర్వము మమ్ములను కొంచెం consult చేసి మార్చండి. ఇది ఇప్పుడే కాదు, బ్రిటిషు గవర్నమెంటు, జస్టిస్ పార్టీ వారు వచ్చినప్పటినుంచీ వస్తున్నది. ఎంత ఖర్చు చేసినప్పటికి మనము 50 లక్షల కంటె ఎక్కువ ఖర్చు పెట్టలేము. It is a drop in the ocean. హరిజనుల సమస్య అనేది చాలా క్లిష్టమైనది. జరుగుతున్నదంతా కూడా బోగసు. ఇది ప్రచారము చేసుకోడానికి మాత్రమే వుపయోగిస్తుంది. మనము దాదాపు 36 కోట్లు ఖర్చు పెట్టుతున్నాము. 36 కోట్లులో 50 లక్షలు అంటే ఎంత? దేశాన్ని పోషించి, దేశాన్ని వ్యవసాయవంతము చేసి ప్రజలకు ఆహారము ఇచ్చేటటువంటిది హరిజన జాతి. ఇటువంటి జాతిని మేము 50 లక్షలు ఇచ్చి చూస్తున్నాం అంటే, చూసే మార్గం అది కాదు. నిజంగా భూసంస్కరణలు వచ్చిన రోజున భూమి ఎసైన్‌మెంట్సులో హరిజనులకు ప్రిఫరెన్సు వుండేది. ఇప్పుడు దానిని తీసివేశారు. ఈ ప్రిఫరెన్సుతో భూములన్నీ కూడా హరిజనులకు తదితర బీదవాళ్ళకు ఇచ్చిన రోజున నిజమైనటువంటి వాళ్ళకు క్షేమము, బాగు ఏర్పడుతుంది. ఈ 50 లక్షల రూపాయలు ఇచ్చి విద్యార్థులకు చదువు నేర్పిస్తే ఏ కొద్ది మందో నాయకుల పిల్లలు చదువుకుంటారు. అసలైన కూలివాళ్ళకు, అసలైన పేదవాళ్ళకు గ్రామములో విద్య లేదని చెప్పాలి. వారిని విద్యావంతులుగా చేయాలి. ఇక్కడ ప్రతివారికి ఇళ్ల స్థలాలు కలుగచేయాలి. గత 6 సంవత్సరములుగా వారికి ఇళ్ళ సౌకర్యాలు కలుగ

చేయ లేదు. మంత్రిగారు హరిజనోద్ధరణ కొరకు వారి పురోభివృద్ధికి, నిమ్న జాతుల ఉద్ధరణకు తగిన కృషి చేయాలని చెప్పి విరమిస్తున్నాను.

*Srimathi B. RUKMINI DEVI :—అధ్యక్షా, అంటరాని తనమును నిర్మూలించి అస్పృశ్యతను తొలగించాలనే ప్రధానోద్దేశ్యముతో ప్రభుత్వమువారు హరిజన దినోత్సవములు జరుపుతున్నారు. కాని వారి ప్రధానోద్దేశ్యము ఎంతవరకు నెరవేరుతుందో అర్థముకావడములేదు. ఉద్యోగస్థులు ఉద్యోగధర్మము ప్రకారము హరిజన దినోత్సవ కార్యక్రమాలను ఏ గ్రామములో నిర్ణయించుకుంటారో ఆ గ్రామములో వారి కార్యక్రమము ప్రకారము హరిజనులచేత నూతులలో నీళ్లు తోడించడము, లేక దేవాలయములో ప్రవేశాలు చేయడం ఏర్పాటుచేస్తారు. కాని అదే దినమే ఆ గ్రామంలో సవర్ణులు, హరిజనులు నూతులవద్దకు వస్తున్నారని వారికి తెలిసివెంటనే "మీరు నీళ్లుతోడారా మీ ఎముకలు సున్నములోకి లేకుండా చేస్తాము" అని బెదిరిస్తారు. ఆ విధముగా బెదిరించడమువల్ల ఉద్యోగస్తులు వచ్చి పిలిచినప్పటికికూడా హరిజనులు నూతులలో నీరు తోడుటకు పోవడములేదు. వారి ఉద్దేశ్యముకూడా నెరవేరడములేదు. ఈ విధముగా హరిజన దినోత్సవాలు, కార్యక్రమములు కొనసాగింపబడుతున్నవి. వారి ఉద్దేశ్యము ఎంతవరకు నెరవేరుతుందో మంత్రిగారే ఆలోచించుకోవచ్చును. ఇంకా హరిజనులకు ఇండ్లస్థలములను ఏర్పాటుచేస్తున్నారు. వాటిని ఇవ్వడమునకు చాలా ఆలశ్యము జరుగుతున్నది. ప్రస్తుతమువర్షాకాలము సమీపించింది. హరిజనులు ఎన్నో ఇబ్బందులకు గురిఅవుతున్నారు కాబట్టి ఈ ఇళ్ళ స్థలాలు కేటాయించడములో ఎంత మాత్రము ఆలస్యము కాకుండా మంత్రిగారు చేయగలరని ఆశిస్తున్నాను. గ్రామాలలో హరిజన వాడలలో మంచినీటి వసతులు లేక వారు ఎంతో ఇబ్బంది పడుతున్నారు. ఆ యా గ్రామములలో బావుల ప్రక్కన స్త్రీలు స్నానముచేయుటకు స్నానపు గదులను, మరుగుదొడ్లను కట్టించి వారికి తగిన సౌకర్యములు ఏర్పరచవలయునని మంత్రిగారికి విన్నవించుకుంటున్నాను.

అనంతపురం జిల్లాలో బాలికల హాస్టలు పెట్టాలని ముందు మాట్లాడిన మా జిల్లా శాసనసభ్యుడు చెప్పారు. ఇప్పటికి జిల్లా ముఖ్యపట్టణములో హరిజనబాలికలకు ఒక హాస్టలు వున్నది. దానిని 1947 వ సంవత్సరములో ప్రభుత్వము స్థాపించినదిగాని ఇంతవరకు దాని అభివృద్ధి విషయమై ఎటువంటిశ్రద్ధ తీసుకోలేదు. ఆహాస్టలుకు నేనుకూడా 6సం॥రలు మేట్రనుగా (Matron) పనిచేసినాను. అందువల్ల ఆ హాస్టలు ఇబ్బందులు నాకు బాగా తెలుసును. దానిని స్థాపించి 8 సంవత్సరములు అయినప్పటికి కూడా దానికి ఇంతవరకు స్వంత భవనము అనేదే లేదు. ఈనాటికి కూడా ఆ హాస్టలులో విద్య నభ్యసించే ఆడపిల్లలు 45 మందే. ఈ సంవత్సరము ఎక్కువ చేసిన 15 మందిని కూడా కలుపుకొని 45 మంది వున్నారు. హరిజన బాలికలు పల్లెలనుంచి చదువునిమిత్తమై చాలా మంది వస్తున్నారు. ఆ హాస్టలులో స్థానములేక వచ్చి వెనుకకు తిరిగిపోతున్నారు. అందులోను క్రైస్తవులువచ్చి హరిజనులము అని పేరుపెట్టుకొని ఆ హాస్టలులో స్థానము పొందుతున్నారు. ఇదికూడా ప్రభుత్వోద్యోగులు కొంతవరకు నివారించాలని కోరుతున్నాను. ఆ హాస్టలుకు స్వంతభవనము అనేది లేనందువల్ల బాడుగ ఇండ్లలో వుండడము చాలా కష్టముగా వుంటున్నది. నేను కొంతకాలము హాస్టలునకు మేట్రనుగా వున్నాను కాబట్టి ఆ బాడుగ ఇంటిలో ఎటువంటి అవస్థలు పడుతున్నది నాకు బాగా అనుభవము

ఉన్నది. ప్రస్తుతము ఆ హాస్టలును వేరే స్థలమునకు మార్చినారు. ఇది బాలికలు పోయే స్కూలుకు 1½ మైళ్ళ దూరములో వున్నది. ఆ బాలికలు భోజనము ఎప్పుడు చేసుకోవాలి. స్కూలుకు ఎప్పుడు బయలుదేరాలి. పదిగంటల పదిహేను నిముషములకు వారు స్కూలునందు వుండాలి. ఇటువంటి ఇబ్బందులన్నీ హరిజన వెల్ఫేరు ఆఫీసర్లు గుర్తించకుండా వారికి తెలిసినవారి ఇండ్లలోనో, బంధువుల ఇండ్లలోనో, లేక స్నేహితుల ఇండ్లలోనో హాస్టలు బాలికల నుంచుచున్నారు. బాలికలు తెలిసిపోని ఇబ్బందులకు గురియవుతున్నారు. కాబట్టి మంత్రిగారు ఈ విషయంలో సక్రమంగా పరిశీలన జరిపి బాలికల హాస్టలకు స్వంత భవనమును స్కూలు దగ్గరలో వెంటనే ఏర్పాటుచేయిస్తారని ఆశిస్తున్నాను. అధ్యక్షులవారు నాకు ఈ అవకాశము కల్పించినందులకు వారికి నా అభినందనలు అర్పిస్తున్నాను.

*Sri RAJARAM:—అధ్యక్షా, మంత్రిగారు ప్రతిపాదించినటువంటి డిమాండును నేను బలపరుస్తూ ప్రభుత్వమువారికి కొన్ని సూచనలు చేయ దలచుకున్నాను. ముఖ్యంగా మహాత్మా గాంధిగారు పూనా ప్యాక్టు చేసుకున్నప్పటినుంచి హరిజనులకు ప్రత్యేక సౌకర్యాలను కలిగించే దానికి రాజ్యాంగ చట్టములో నిబంధన వున్నందువల్ల హరిజనుల సమస్య అనే దానిని గవర్నమెంటువారు తీసుకొని ఇంతవరకు ప్రత్యేకడిపార్టుమెంటును వేసి దానిద్వారా హరిజనులకు సౌకర్యాలను కలుగజేయుచున్నారు. ఈ మధ్యలోనే గౌరవనీయులైన లచ్చన్నగారు హరిజన వెల్ఫేర్ డిపార్టుమెంటును సోషియలు వెల్ఫేర్ డిపార్టుమెంటుగా ఏ వుద్దేశ్యముతో మార్చినారో నాకు అర్థము కావడములేదు. ఈ పదమును హరిజనులమీద ఎందుకు వుపయోగించారో నాకు అర్థము కావడములేదు. ఇంతకుముందు మాట్లాడిన సభ్యులు ఈ విషయమై చెప్పారు. సాధారణముగా ఈ అస్పృశ్యత అనేటటువంటిది ఈ హరిజనుల్లోనే వున్నది. గిరిజనులలోగాని వెనుకబడిన జాతులలోగాని ఈ అస్పృశ్యత అనేది లేదు. కాబట్టి ప్రత్యేకంగా వీరికి సౌకర్యాలు కలుగ జేయాలనే ఉద్దేశ్యముతోనే ఈ శాఖ ఏర్పడింది. మహాత్మా గాంధీగారు కూడా ప్రత్యేక సౌకర్యాలను కలుగజేయాలనే వుద్దేశ్యమును తెలియజేసినారు. కాబట్టి వారి ఆశీర్వాదముతో ఇంతవరకు మాకు హరిజనులనే పేరు సార్థకము అయినదని అనుకొంటున్నాము. అంతేకాకుండా హరిజన వెల్ఫేర్ డైరెక్టరు అనే పేరు కూడా మార్చి సోషియల్ వెల్ఫేరు డైరక్టరు అని పెట్టినారు. ఇకముందు హరిజన వెల్ఫేర్ డిపార్టుమెంటే పోతుందేమో అన్న అనుమానము మాకు కలుగుతున్నది. ఇటువంటిది లేకుండా హరిజనులకు వుండేటటువంటి ప్రత్యేక సౌకర్యాలను, వారికి వుండేటటువంటి హక్కులను కాపాడుకొనేందుకైనా హరిజన వెల్ఫేర్ డిపార్టుమెంటును అయినా వుంచితే బాగుంటుంది అని నేను సలహా రూపంగా ప్రభుత్వము వారికి మనవి చేసుకుంటున్నాను.

విద్యా విషయములోనేమి ఇతర విషయములలోనేమి అంటరాని తనమును నిర్మూలించుటకు ప్రభుత్వమువారు తగు శ్రద్ధ తీసుకొనుటలేదని గట్టిగా చెప్పదలచు కుంటున్నాను. ముఖ్యముగా నీటి వసతుల విషయములో హరిజనులకు సౌకర్యము కలుగజేయనందులకు విచారిస్తున్నాను. R. W. schemes ను తీసివేసినందువల్ల హరిజనులకు నీటి సౌకర్యము లేకుండా పోవుచున్నది. దీనిని గురించి చాలా జిల్లాలనుండి గవర్నమెంటుకు అర్జీలు వచ్చుచున్నప్పటికి ఏమీ ప్రయోజనము కనుబడలేదు. గవర్నమెంటువారికి ఎన్ని

D. O లు వ్రాసినప్పటికి reply యివ్వకుండా ఉన్నారు. కాబట్టి మంత్రిగారు ఈ విషయములో M. L. A. లు ఏదైనా సలహాలు వ్రాసినప్పుడు తప్పకుండా వారికి వెంటనే జవాబులు వచ్చేమాదిరిగా చేస్తారని ప్రార్థించుచున్నాను.

Sri M. MUNUSWAMY :— అధ్యక్షా! మంత్రిగారు ప్రవేశపెట్టిన demand ను నేను బలపరుస్తున్నాను. అయితే మంత్రిగారు తమ ప్రసంగమును ముగిస్తూ ఎవరైనా సభ్యులు సూచనలు చేయదలచుకొన్న పక్షములో ప్రభుత్వముయొక్క ఆర్థిక స్తోమతును కొంచెము గుర్తించి సూచనలు చేయమన్నారు. ప్రభుత్వ ఆర్థిక స్తోమతు అందరికీ తెలిసినదే. కాని నేను చెప్పదలచుకొన్న సూచనలను చెప్పక తప్పదు. కనుక చెప్పుచున్నాను. హాస్టల్సును గురించి చాలమంది చెప్పారు. కాలేజీ విషయములు ఎవరు సూచించలేదు. కాబట్టి నేను దాని విషయం చెప్పదలచుకొన్నాను. హరిజనులకు కొన్ని కొన్ని colleges లో స్థానము లేదంటున్నారు. కొన్నికొన్నిటిలో కొద్దిగా చేర్చుకుంటున్నారు. అందులో ముఖ్యంగా private management లో నున్న A. C. College. Guntur లో హరిజనులకు స్థానములేదు. అదీకొక డబ్బు ముందర కట్టినచో గాని హాస్టల్సులో ప్రవేశములేదు. ఇక ఇండ్ల స్థలాల విషయము అందరూ చెప్పారు. వీరి కడగండ్లు అందరికి తెలిసినవే. అధికారులు ప్రత్యేకమైన సిపార్సులను చేసి సక్రమంగా వీరికి వసతులు చూపించాలని కోరుతున్నాను. వీరు పేద ప్రజలు కనక మంత్రులను కలుసుకొని వారి కష్ట నష్టములను తెలుపుకొనలేక పోవుచున్నారు. కనక వాళ్లు ఎక్కువగా మా ప్రాణాలు తీస్తూ ఉంటారు. మేము వారిని అధికారుల దగ్గరకు తీసుకుపోయి వారి కష్టాలు చెప్పవలసి వస్తున్నది.

ఇక ఉద్యోగాల విషయములో ఎక్కడ చూచినా హరిజనులకు, ఇస్తున్నారు అంటున్నారు. కాని సంపూర్ణముగా వీరికి ప్రాతినిధ్యము కల్గడము లేదని మనవి చేస్తున్నాను. పెద్ద పెద్ద ఉద్యోగములలో కూడా హరిజనులు చాల కొద్దిగా ఉన్నారు. 100 కి-15, 20 సీట్లు హరిజనులకు రిజర్వేషను ఉన్నది అంటారుగాని ఆమాదిరిగా జరగడం లేదు. గోపాలరెడ్డిగారు క్రిందటి ఎన్నికలు అయినరోజున బెజవాడలో ఏమి చెప్పారంటే, "మనము మూల ప్రాంతములన్నీ తిరిగాము. అన్నివిధాల అన్నిచోట్ల తిరిగి ప్రజల పరిస్థితులను అవగాహన చేసుకున్నాము. అందువల్ల కొంత భారము మనమీద పడిఉన్నది. ఈభారమును మోసుకొని మనము సక్రమంగా ప్రవర్తించాలి" అని చెప్పారు. వీటిని అన్ని పేపర్లలో వేసి అందరికి ఆశ కల్గించారు. క్రొత్తప్రభుత్వము వస్తోంది. ఏమి చేస్తుందో, అందరమూ భూలోకస్వర్గము అనుభవిస్తావేమో అని అనుకున్నారు. కలలు కన్నారు. ఆ ఆశలను తీరుస్తారని ఆశిస్తున్నాను. హరిజనులను గురించి శ్రీ ప్రగడ కోటయ్యగారు మాట్లాడుతూ సందర్భానుసారముగా House అంతా కూడా ఒక్కసారిగా నవ్వేట్లు చేశారు. హరిజనుల మీద, ఆయనకున్న ప్రేమ చేత అవిధముగా చెప్పిరనుకొంటిని. కాని ఆ విధముగా House అంతానవ్వుట బాగుగా లేదు. హరిజనుల పరిస్థితి చూస్తే అంత హేళనగా నున్నదని నేను అనుకొంటున్నాను. ఇక భూమి పంపకము విషయములో కూడా అంతా చెప్పారు. కాని నేను చెప్పదలచుకొన్నది ఏమిటంటే, మా పరిస్థితులను ప్రత్యేకముగా చెప్పేధానికంటె "రోజులు మారాయి" సినిమా ఇక్కడే ఉన్నది, మంత్రిగారు ఒక పర్యాయము దానిని చూచిన

వారికే అర్థమగునని చెప్పుచున్నాను. దానికి రోజులు మారాయి అని పేరు పెట్టారు కాని రోజులు మట్టుకు మారలేదు.

Sri B. APPALASWAMY :— అధ్యక్షా! ఈ హరిజన పద్దుపై మాట్లాడడానికి ఈ పొద్దు సరిపోదు. కాని ఇది దయాధర్మ భిక్షముగా నున్నది. కనుక ఇచ్చిన time లోనే మాట్లాడవలసియున్నది. భారతదేశములో ఏనాడో గౌతమబుద్ధుడు పుట్టినాడంటారు. గాంధీజీ మహాత్ముడంటారు. ప్రపంచ పర్యటనచేసిన పండిత నెహ్రూ యీనాడు శాంతి సందేశాన్ని వెదజల్లినాడని చెప్పుచున్నారు. గాంధీ మహాత్ముని అనుచరులు, ఈ గాంధీ తత్వముగల వారు అంతా కూడా ఒక మాటు ఆత్మపరీక్ష చేసుకొని చూచుకొన్నట్లయిన ఈ హరిజన సమస్య ఎలాంటిదో అర్థమౌతుంది. ఊరకనే కబుర్లు చెప్పి మేము గాంధేయులము, కాంగ్రెసు పార్టీకి చెందినవారము, గాంధీ శిష్యులము అని చెప్పుకొనే కంటే గాంధీ సూత్రాలను ఆచరించి గాంధీ అడుగుజాడలలో నడచుకుంటే ఈ ప్రశాంత వాతావరణము యీ ప్రజాస్వామిక శాసనసభ కొద్దికాలము ప్రశాంతముగా నడుస్తుంది. ఉత్తకబుర్లు చెపితే లాభము లేదని చెప్పుతున్నాను. మీరు లక్షలు ఇవ్వండి, కోట్లు ఇవ్వండి 10 hostels పెట్టండి, 10 మందికి ఉద్యోగాలు ఇవ్వండి, 10 scholarships ఇవ్వండి, యింకో 10 కొంపలు కట్టండి కాని దానితో హరిజనులు తృప్తిపడరు. బ్రిటిషు ప్రభుత్వము పరిపాలించే రోజులలో మా జిల్లాలో గోపాలరావు నాయుడు అన్న ఆయన మాల కలెక్టరు అని పేరు పొందాడు. ఆ మాల కలెక్టరు కట్టిన కొంపలను యీనాడు గోపాలరావు పేట అని చెప్పి అంటున్నారు. కాని ఈ రోజులలో గాంధీ పేటలుగాని, నెహ్రూ పేటలు గాని, ప్రకాశం పేటలుగాని కనపడడములేదు. ఆనాడు త్రవ్విన నూతులు తప్పితే యీనాడు నూతులు లేవు. ప్రభుత్వం మారుతోంది. పరిపాలకులు మారుతున్నారుగాని ఈహరిజన సమస్యలో మాత్రము హృదయాలు మారడం లేదు. ఆనాడు ప్రకాశంపంతులుగారు నివేశన స్థలాలకొరకు హరిజనులకు కేటాయించిన 10లక్షలు ఏమైనవని అడుగుచున్నాను. ప్రొహిబిషన్ డిపార్టుమెంటు ఎంత సక్రమంగా జరుగుచున్నదో యీ హరిజన సమస్యకూడా అంతే సక్రమంగా జరుగుతుంది. ప్రకాశంపంతులు గారిని ప్రజానాయకుడు అని పిలిచేదానికి బదులు హరిజన నాయకుడు, ఆంధ్రకేసరి అనుకుంటే మంచిదని అనుకుంటున్నాను. ఆనాడు కోటి రూపాయలు sanction చేసిన ప్రకాశం, యీనాడు 10 లక్షలు sanction చేసిన ప్రకాశం తప్పితే ఏ ప్రజానాయకుడు ఈ హరిజన సమస్యను గురించి విచారించి సహాయము చేస్తున్నారో అవగాహన చేసుకొనమని కోరుచున్నాను. Assembly Hallలో కూడా ప్రశ్న వేస్తే ఆక్షేపణ చేస్తున్నారు. గవర్నమెంటు ఎన్ని రోడ్లు తీసుకున్నారు? అని నేను అడిగితే, అందులో మాలవాళ్ళ రోడ్లు ఎన్ని? అని అడుగుచున్నారు. ఎంతో అవహేళన, ఆక్షేపణ చేస్తున్నారు. కాన మేము లజ్జపడుచున్నాము. తరతరాలనుంచి వస్తున్న సమస్య ఇది. ప్రకాశం పంతులుగారు "వీడు పేదవాడు, బీదవాడు కష్టపడి సేద్యము చేసుకుంటున్నాడు, వాని పొలము తీసుకొనవద్దు" అని చెప్పినను, హరిజనుల పొలములను లాగుకొని రాజకీయ బాధితులకు యిస్తున్నారు. రాజకీయ బాధితులకు యివ్వవద్దు అని నేను చెప్పడములేదు. వాళ్ళు కష్టపడ్డారు, జైళ్ళకు వెళ్ళారు. 5 ఎకరములు కాకపోతే 10 ఎకరములు ఇవ్వండి. కాని ఈ పేద హరిజనుని భూమిని యిచ్చుట న్యాయము కాదు. ఇకనైనా హరిజనులకు భూములను ఇచ్చుట సమంజసము అని చెప్పుచున్నాను.

మాలవాడికి ఎంతయిచ్చిననూ తృప్తిలేదు అంటున్నారు. అదికాక ప్రతి మాలవాడు కమ్యూనిస్టుకు ఓటువేశాడు, అంతా కమ్యూనిస్టులే అంటున్నారు కాని ప్రభుత్వము అట్లనుట మంచిదికాదని మనవిచేస్తున్నాను. ఈనాడు వున్న 26 మంది శాసనసభ్యులు హరిజనులు వుంటే ఒక శాసనసభ్యుడు గంజి నాగేశ్వరరావుగారు మాత్రమే కమ్యూనిస్టు. మిగతా 25 మంది శాసనసభ్యులు కాంగ్రెసువారు. ఎవరు కమ్యూనిస్టు? సవర్ణహిందువు లందరూ కమ్యూనిస్టులు. గోపాలరెడ్డిగారు కాంగ్రెసువైపున వుండగా ఆయన సోదరుడు కమ్యూనిస్టు జెండా ఎత్తి ఊరేగుతున్నాడు. గోపాలరెడ్డిగారు ఒక మాలపల్లెను ఇటువైపు త్రిప్పితే ఆయన సోదరుడు మరికొన్ని మాలపల్లెలను తనవైపు త్రిప్పు కుంటాడు. గోపాలరెడ్డి ప్రక్కన పోకపోతే సాయంత్రానికి ఈ మాలపల్లె దగ్ధం; ఆయన సోదరునివైపు రాకపోతే సాయంత్రానికి ఆ మాలపల్లె దగ్ధం. ఏమిచేస్తాడు మాలపల్లెలో వుండే మాలవాడు? ఈ రాజకీయ పక్షాలను ఆశ్రయించుకుని నాశనం అవుతున్నాడు. ఎంతచేసినా నేరారోపణ చేయడమే తప్ప మరేమి కన్పించదు. హరిజను లకు విశ్వాసంలేదు, సిగ్గు, లజ్జ లేదని పవిత్రమైన శాంతమూర్తి అనుకున్న మూర్తిరాజు కూడా అంటున్నాడు. శాసనాలు, ఏమి చేయలేవు. హృదయాలు మార్చుకొని మాల వాడు కూడా ఒక మనిషి అని గ్రహిస్తే ఆనాడు దేశం బాగుపడుతుంది. శరీరంలో పుండు పుట్టింది; ఆ పుండుతో నిమిత్తంలేదు; అది ఏమిచేస్తుంది అనుకున్న మానవుడు మూర్ఖుడు. ఆ పుండే శరీరాన్ని విషమయంచేసి శరీరాన్ని దగ్ధం చేస్తుంది. అలాగే సంఘంలో ఒక మాలవాణ్ణి - ఒక జాతిని - వేరుచేసి హింసించి, తరతమాలకై వేరుచేస్తే దానివల్ల పాడైపోయేది మాలవాళ్ళుకారు. యావత్ హిందూజాతి పాడైపోతుంది. మీరు హృదయం మార్చుకుని, మానవజాతి పురోభివృద్ధికోసము, దేశ పురోభివృద్ధికోసం మీరు కృషిచేస్తేనే దేశం బాగుపడుతుంది. మాలవానికి ఇంతకంటె అన్యాయంలేదు. ఇంతకన్న పడే బాధలు లేవు. గోచిపాతకు మిక్కిలి దరిద్రం; ఈతకు మిక్కిలి లోతు లేదు. మాలవాడికి ప్రత్యేకస్థానం ఇచ్చి పూర్తి సదుపాయాలు చేయాలి; లేదా హరిజన డిమాండు అక్కరలేదు, ఈ శాఖ అక్కరలేదు.

Sri Raja SAGI SURYANARAYANA RAJU :— వీరు మాలవారిని గురించే మాట్లాడుచున్నారు. మాదిగ చచ్చర వగైరా జాతులను గురించి మాట్లాడడం లేదు. వారిని గురించికూడా చెప్పమనండి.

Sri B. APPALASWAMY :— హరిజనులనే పేరు గాంధీగారు మాకు పెట్టారు. ఈనాడు ఈ పేరు పెట్టుకుంటే. అవమానంగా వున్నది; హరిజనుడని పేరు పెట్టుకుంటే కాలేజీలలో హైస్కూళ్ళలో పూర్తి జీతం కట్టించుకుంటున్నారు. ఈవిష యమై స్పీకరుగారికి adjournment motion ఇచ్చాను. సంవత్సరం arrears పూర్తిగా కట్టాలి అంటున్నారు. మాలవాడనే అంటాను; అది పూర్వకాలంనుంచి మాకు వస్తున్న title. మాలవాడికే ఎందుకు ప్రత్యేకస్థానం కావాలో చెబుతాను. ఒక చాకలి వాడు, మంగలివాడు, కోమటివాడు, మాలవాడు S. S. L. C. fail అయినారు అను కుందాము; S. S. L. C. fail అయితే ఎవరికీ ఉద్యోగాలు లేవు. చాకలివాడు ఒక లాండ్రి పెట్టుకుంటాడు. మంగలివాడు ఒక డ్రాయరు కుర్చీవేసి సెలూను పెట్టుకుంటాడు. కోమటివాడు పెసరట్లు కొట్టు పెట్టుకుని షావుకారు అవుతాడు. మాలవాడు ఏపని చేస్తే

కుదురుతుంది ? ఎవరు మాలవాడిదగ్గరకు వస్తారు ? మాలవాడికి ప్రత్యేకమైన సదుపాయాలు కావాలి. సంఘంలో ఎవరూ భరించలేని అవమానం, అక్రమం-అస్పృశ్యతా విధానం - క్రింద బాధపడుతున్నాడు. మీరందరూ గాంధేయులు. ఇప్పటికైనా కాంగ్రెసు సంస్థ ప్రశాంతంగా ఉండాలంటే హృదయం మార్చుకొని ఈ పనులన్నీ తప్పకుండా చేయాలని కోరుతూ విరమిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, మన మిత్రులు కొందరు చాలా ఉద్రేకంతో లేదా ఆవేశంతో మాట్లాడుతున్నారు ; లేదా ఆవేదనతో మాట్లాడుతున్నారు. కాని హరిజనులు గాని వెనుకబడిన తరగతులవారు గాని ఒక విషయాన్ని గుర్తించాలి. మన మంత్రిగారు చెబుతూ ఆంధ్రరాష్ట్రంలో వున్న జనాభాలో హరిజనులు, ex-criminal tribes, backward classes 50% మంది వున్నారని చెప్పారు. కాని శాసన సభలో వారు 50% మంది వున్నారా అని అడుగుతున్నాను. అల్లా వుండడానికి అవకాశం లేని పరిస్థితులు వున్నాయి, ఈ పరిస్థితులు వున్నంతకాలం ఆవేదనపడి ప్రయోజనం లేదని మనవిచేస్తున్నాను. అటువంటి పరిస్థితులనుగురించి తప్పించుకోగలిగిన శక్తి సామర్థ్యాలు ఈ జాతులవారికి కలిగిననాడు, మనం అడిగి అడగకుండానే ఈ జాతుల ఉద్ధరణకోసము కృషి చేసుకోడానికి అవకాశం వుంటుంది. అంతవరకు వారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడక తప్పదని మనవి చేస్తున్నాను. మనం మన ధర్మాన్ని ఎంతవరకు నిర్వర్తిస్తున్నాం అని ఆలోచించినపుడు హరిజన సోదరులు, ప్రధానంగా కాంగ్రెసులో వున్నవారు కొంత బాధపడవలసి వుంటుంది అంటాను. ఈ వేళ హరిజన శాసనసభ్యులలో కమ్యూనిస్టులు తక్కువగా వున్నారు ; కాంగ్రెసువారు ఎక్కువ వున్నారు అంటున్నారు. ఇది ప్రత్యేకంగా reserve స్థానాలు కాబట్టి ఈ మాత్రంగా రాగలిగారు తప్ప మనం రిజర్వు స్థానాల్లో కాకుండా జనరల్ స్థానాల్లో నిలబడవలసిన పరిస్థితులు ఏర్పడితే, ఇప్పుడు వున్నవారిలో బహుశా ఒకరిద్దరుకంటె ఎక్కువ వస్తారనే నమ్మకం నాకులేదు. మనం మన ప్రాబల్యంతో వచ్చాం ఇక్కడికి అని అనుకోడం చాలాపొరపాటు. హరిజను లందరిని కాంగ్రెసు వైపు సమీకరించడానికి అట్టడుగున కార్యక్రమం వున్నదా అనుకుంటే లేదు ; చాలా భాగం లేకుండా పోతోంది. అందువల్లనే మనం ప్రధానంగా లచ్చన్నగారియొక్క దయాదాక్షిణ్యాలమీద - ఈ వేళ లచ్చన్న గారు కావచ్చును, రేపు మరొకరు కావచ్చును - ఆధారపడవలసిందే తప్ప మరొక మార్గంలేదని మనవిచేస్తున్నాను. చదువులు చెప్పిస్తే, హాస్టల్సు పెడితే, అక్కడ scholarships ఇస్తే 50% గా వున్న వీరిందరిని ఉద్ధరించడం చాలా కష్టం. అది సాధ్యంకాదు. మీరు పెద్ద స్కాలరుషిపు ఇచ్చి ఒక హరిజన సోదరుణ్ణి విదేశానికి పంపితే చివరికి ఇక్కడికివచ్చి, ఉద్యోగంలోనికి వచ్చినతర్వాత మాలవారితో పలుకడు, మాదిగవారితో పలుకడు, మిగతా పేద జనంతో పలుకడు. ఆయన కూడా పెద్దజాతివారి క్రిందే లెక్క. మీరు సాధారణమైన ఏ పేదకులంవాడికైనా డబ్బు ఇప్పించి చదువు చెప్పించినంత మాత్రంచేత జాతులు అభివృద్ధికావు. వారి వృత్తులు ఏమిటి, వాటిని అభివృద్ధి చేయడానికి అవకాశం వున్నదా, లేదా ? దానికి ప్రభుత్వం సిద్ధంగా వున్నదా లేదా, అనేది ఆలోచించాలి. పేదకులాలకు సంబంధించిన వారిలో 50% వ్యవసాయ కూలీలు వారిలో హరిజనులు ఉండవచ్చును, కాపు వుండవచ్చును, ఇతర కులాలువారు వుండవచ్చును. వారికి కనీస వేతనాలు నిర్ణయించడానికి ఆలోచిస్తు

22nd July 1955] (Sri Pragada Kotaiah)

న్నారా? వారికి సంవత్సరంలో ఆరు మాసాలు మాత్రమే వృత్తి వుంటుంది. మిగతా 6 మాసాలు వారికి వృత్తి కల్పించడానికి ప్రయత్నం చేస్తారా? వారిలో కొలు భూములు చేసేవారున్నారు. ఆంధ్రదేశంలో డెల్టా ప్రాంతాలలో జరుగుతున్న అన్యాయాలు అధికారంలో వున్న పెద్దలకు తెలియదా? కౌలుదారుల చట్టంవచ్చే అవకాశం వున్నదా? రాదు ఇంతలో. భూ సంస్కరణలు రావాలి. అవిరావడానికి ఎంత కాలం పడుతుందో? తెలియదు. జూలై ఆఖరుకు రిపోర్టు వస్తుంది అంటున్నారు. సర్వసాధారణమైన పరిస్థితుల్లో ఒక రిపోర్టు పరిశీలించడానికి సంవత్సరానికి తక్కువ పట్టదు. Backward Classes Commission వారి రిపోర్టు కేంద్ర ప్రభుత్వంవారికి ఇచ్చినారు. ఆ రిపోర్టు పరిశీలించారా అంటే వారు రాష్ట్ర ప్రభుత్వాల అభిప్రాయాలు తెలుసుకుంటున్నాం అంటున్నారు. తరువాత రిపోర్టు బయటపెడతాం అంటున్నారు. ఆ కమిషనువారి సూచనలు ఈ ప్రభుత్వంవారికి వచ్చాయా? వస్తే, వాటిని పరిశీలన చేసారా? వాటినిగురించి కేంద్ర ప్రభుత్వానికి తమ అభిప్రాయాలు చెప్పారా? ఆ సూచనలమీద శాసనసభ్యుల అభిప్రాయాన్ని తీసుకోడానికి ప్రభుత్వంవారు సిద్ధంగా వున్నారా? అలానే backward classes lesgislators గాని Harijansలో గాని Scheduled castes లో గాని అభిప్రాయాలు తీసుకోనేదానికి ప్రభుత్వం సంసిద్ధంగా వున్నదా? మామూలుగా వారుకూడా చెప్పింది — మంత్రిగారు చెప్పింది — ఇండియా ప్రభుత్వం ఆలోచన చేస్తున్నారని పరిశీలనచేసి నిర్ణయాలు చేసిన తరువాత అసలు జరిపే విషయం ఆలోచిస్తాం అన్నారు. దానికి విశ్వనాథంగారు 1, 2 సంవత్సరాలు శాసన సభలోనూ చెప్పారు, బయటా చెప్పారు, Hill Tribes Financial Corporation పెడుతున్నాం అని. ఇవ్వాళ ఈ Budget ప్రసంగంలో ఈ Financial Corporation వ్యవహారం యేమీకనపడదు. 1953-54 సంవత్సరానికి 50 వేల రూపాయలిచ్చారు ఇండియా ప్రభుత్వంవారు. దానిలో ఎంత ఖర్చుపెట్టకలిగింది యీ ప్రభుత్వం అని అడుగుతున్నాను. 54-55 లో 75 వేల రూపాయలిచ్చారు. ఈ డబ్బును ప్రభుత్వం ఖర్చుపెట్టగలిగిందా అని అడుగుతున్నాను. ఈ సంవత్సరం డబ్బు ఖర్చు పెట్టడానికి ఎన్ని పథకాలున్నవి ప్రభుత్వం ముందు? అదికూడా ఇప్పటివరకు తెలియదు. సంవత్సరంలో 6 మాసాలు గడచినప్పటికి కూడా వెనుకబడిన జాతులవారికి scholarships ఇస్తున్నాం hostels పెడుతున్నాం అనవచ్చు. దీనివల్ల ప్రయోజనం లేదు. చదువుకున్న మాల జాతి ఉద్యోగస్థులు వచ్చినంత మాత్రంచేత మాలవాళ్ళకు ప్రయోజనంలేదు. మాలజాతి, మాదిగజాతి ముందుకురాదు. నేత నేసే జాతి ముందుకురాదు. గౌడజాతి ముందుకురాదు. కమ్మర్లు, వమ్మర్లు ముందుకురారు. అందుచేత ప్రత్యేకంగా వారి వృత్తులను అభివృద్ధి చేసేదానికోసం ఆలోచిస్తారా? ఇవ్వాళ carpenters — ఎంత బ్రహ్మాండమైన furniture తయారు చేస్తున్నారు! ఏ గుమస్తా దగ్గర చూచినా ఒక కుర్చీ కనపడుతుంది, ఒక drawer కనిపిస్తుంది. బ్రహ్మాండమైన furniture కొంటున్నారు. వడ్రంగులకు సహకార సంఘాలు పెట్టించి రాష్ట్రం మొత్తంమీద కార్ఖానాలు పెట్టించి ప్రభుత్వ ఆఫీసులలోని furniture చేయించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా? మామూలుగా ఒక వెంకయ్యకు, పుల్లయ్యకు contract ఇచ్చి కుర్చీలుచేయిస్తే ప్రభుత్వ విధానం మార్చి యీ హరిజన కార్మికులకు కావలసిన పెట్టుబడి యిచ్చి వారి వృత్తికి

ప్రోత్సాహమిచ్చి వారివద్దనుండి అవసరమైన సామానులు తీసుకొనుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా? తరువాత పోలీసులకు నేతబట్ట ఎందుకు కొనకూడదని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. వెనుకటిరోజులలో Manchester mill, యొక్క drill, twill లను ఇక్కడ పోలీసులకు కట్టపెట్టేదానికోసం ప్రవేశపెట్టిన యీవిధానం కాంగ్రెసు ప్రభుత్వం యింకా ఎందు కవలంభిస్తున్నదని నేను అడుగుతున్నాను. చేనేత పనివారికి drill, twill నేత చేతకాదంటారా? న్యాయానికి చూస్తే drill కంటే సాదాబట్ట చాలా నాణ్యమైనది. హాస్పటల్సులో యీ బట్ట ఉపయోగించడానికి Director of Medicine పనికిరాదని చెబితే ప్రభుత్వం గ్రుడ్డిగా అనుసరించ దగినదేనా అని అడుగుతున్నాను. ఈ Medical officer ఈ విషయంలో ప్రవీణుడా? ఆయనకు బట్టల నాణ్యము ఏమితెలుసును? అందుచేత ఆసుపత్రులలో వుపయోగించడానికి చేనేత వస్త్రాలను ఉపయోగించి యీ ఉత్పత్తికి ప్రోత్సాహ మివ్వాలని ప్రభుత్వాన్ని కోరుచున్నాను. అదే మాదిరిగా ఎరుకలచేత బుట్టలల్లించటానికి, ఆ విధంగా వారికి వృత్తులు కల్పించడానికి ప్రభుత్వ మేదైనా ఒక స్పష్టమయినటువంటి విధానం అవలంభిస్తున్నదా? అసంతృప్తి చెందిన జాతులు వీరిలో నున్నంత కాలం వచ్చే రాజకీయ ముప్పును ప్రభుత్వంలో నున్నటువంటి పెద్దలు గుర్తించాలి అని మనవి చేస్తున్నాను. హరిజన సోదరులకు ప్రత్యేకంగా మనవిచేస్తున్నాను. మనం నిర్మాణయుతంగా పని చేయడం సాధ్యం కానంతవరకు ఆవేదనపడి ప్రయోజనం లేదని మనవి చేస్తూ శలవు తీసుకుంటున్నారు.

*Sri A. LAKSHMUNAIDU:— స్పీకరు మహాశయా, గుణుపురం తాలూకాలో శ్రీకాకుళం జిల్లా agency మొత్తంలో, పాతపట్నం ప్రాంతములలో గిరిజనులు ప్రతి సంవత్సరం సుమారు 20, 30 సంవత్సరాల లగాయతు పోడు సాగులు చేస్తూ బ్రతుకుచున్నారు. అక్కడి ప్రజలు ఫారెస్టు డిపార్టుమెంటువారివలన చాల యిబ్బంది పడుచున్నారు. అక్కడ ప్రజలకు 100 రూపాయలు, 60 రూపాయలు జరిమానాలు విధిస్తూ డబ్బు యివ్వలేకపోయినవారిని శిక్షలపాలు చేస్తున్నారు. కాబట్టి అట్టివి జరుగకుండా ప్రభుత్వం చూడాలని ప్రభుత్వానికి మనవిచేయుచున్నాను.

Sri B. RAJAYYA :— అధ్యక్షా, ఈ demand సందర్భంలో ఒక విషయం ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఈ 5 లక్షల జనాభా గల గిరిజనులలో 5 గురిని శాసన సభ్యులుగా నియమించినప్పుడు ఆంధ్ర ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. ఐతే యీ 5 గురిలో ఎవరుకూడ యీ 15 రోజుల meeting లో వీరినిగురించి ఒక కష్ట సుఖమయినా అసెంబ్లీలో గాని తక్కిన ప్రశ్నావళిలో గాని అడగకుండా వుండడము అనేది చాలా శోచనీయమైన విషయం. ఎందుకంటే యీ జాతి అసలు యీ 5 గురిని ఎన్నుకునేటప్పుడు యీ 5 గురు ఒకేపార్టీకి చెందలేదు. ఈ 5 గురు 5 పార్టీలకు చెందివున్నారు. అసలు కారణం యేమిటంటే అడవిజాతులవారికి రాజకీయ విషయాలు అట్టే తెలియదు. వారికి ఎటు వోటు చేయాలో తెలియక అనేక రకాలుగా ఆయా పార్టీలవారికి vote చేశారు. అందుచేతనే యీ ప్రజలు ఎంతో వెనుకబడివున్నారన్న విషయం మీకు మనవి చేస్తున్నాను. తరువాత యీ fund గురించి యీ budget లో 38 లక్షల 29 వేల రూపాయలు కేటాయించబడింది. అనేక కార్యకలాపాలలో ఈ సొమ్ము వినియోగించబడింది.

22nd July 1955] (Sri B. Rajayya)

ముఖ్యంగా వారి విద్యాభివృద్ధి గురించి ప్రత్యేకంగా 2 High Schools, 4 Higher Elementary Schools, 423 ప్రాథమిక పాఠశాలలు వున్నాయి. ఐతే శ్రీ మంత్రిగారు ఉదయం యిచ్చిన జవాబులో గిరిజన High School లో వీరు యింతమంది వున్నారు. తక్కిన వారింతమంది వున్నారు అని మనవిచేయ లేదు. విద్యా statistics లో కూడా వివరాలు చెప్పలేదు. ఎందుచేత నంటే ఈ ప్రత్యేక పాఠశాలలో గిరిజనులు, ఆటవిక ప్రజలు చదవుటలేదు. వారిలో మొత్తం నూటికి యిద్దరు మాత్రమే చదువుకొన్నవారు. ఇంకా అనేక స్థలాలలో ఎక్కువ పాఠశాలలు కావలసి వున్నది. ఈ సంవత్సరం Budget లో ఏకోపాధ్యాయ పాఠశాలలు 1000 నెలకొల్పబడి వున్నవి. వీటిలో జనాభాతో నిమిత్తం లేకుండా గిరిజన ప్రాంతాలలో ఎక్కువగా పెట్టాలని కోరుతున్నాను. తరువాత primary schools కు దగ్గరగానే ఒక గిరిజన hostel ప్రతి తాలూకాలో స్థాపిస్తే వీలయినంతమటుకు కొన్ని ప్రాంతాలలో 100 మందిని ఒక batch గా ఆ hostel తరిఫీదు చేయాలని నేను మనవి చేస్తున్నాను.

తర్వాత ప్రతి తాలూకా headquarters లో హరిజనులకు ఉన్నత విద్యను చేకూర్చుటకు గాను అక్కడ హరిజన స్కూలు నిర్మించుటకు వీలు అయి నట్లయితే ఈ హరిజన్ గిరిజన్ hostel కలిపి అచట ఉన్నత పాఠశాలలో చదివే అవకాశాలు కల్పించవలెనని కోరుతున్నాను. తరువాత వారి ఆర్థిక పరిస్థితులు చాలా హీనముగ ఉన్నవి. వారిలో చాలమంది పేదవాండ్లు. వాండ్ల అడవి పోడులు తర్వాత అడవి అంచులలో ఉండే పర్వత మెరక భూములు చాల పేదవి. భూమి పేద అన్నపుడు రైతుకూడ పేద అన్న సిద్ధాంతానికి వీరు చాలా వెనుకబడి ఉన్నారు. వారికిపండేపంట సామాన్య పంట. మెట్టపంటలే. పల్లములేదు. వారిలో చాలామందికి వరి అన్నము తినే అవకాశం లేదు. తరువాత చాలమంది పోడు పంటను అచ్చట కొర్ర, జొన్న వగైరా పండించి జీవనోపాధి చేస్తున్నారు. ఈ పంట 4, 5 నెలల కంటే ఎక్కువగ చాలకుండా ఉన్నది. తక్కిన కాలములో వారు ఎండుకట్టెలు అమ్ముకొని జీవనోపాధి చేయవలసి యున్నది. వీరికి ఫారెస్టు డిపార్టుమెంటువారు అనేక ఇబ్బందులు పెట్టి వెట్టిచాకిరి చేయించుకొని పైగా కేసులు పెట్టుతున్నారు. కేసులు file చేసి నానా ఇబ్బందులను కల్గించుతున్నారు. ఈ సంవత్సరం మా సాలూరు తాలూకాలో 2 వందల అడవి కేసులు file అయినట్లు మీకు ఈ సందర్భములో చెప్పవలసి యున్నది. ముఖ్యముగా ఫారెస్టుకున్ను అడవి జాతుల వారికిని సంబంధం ఉండుటచేత ఇది కొంత ప్రభుత్వము గుర్తించి కొంచెము ఈ Department ను హెచ్చరిస్తారని చెప్పుతూ విరమిస్తున్నాను.

Sri S. RANGANATHA MUDALIAR :—Mr. Speaker, Sir, my object in moving my cutmotion is twofold, one, to make the Government focus its attention on the condition of Harijans in my district in general and in my constituency in particular, and secondly, that we hope that the Government will prick its ears and listen to me; because I am a non-Harijan, and I have come foward to point out certain defects in the administration

of the Harijan Welfare Department. The Harijans in my district have been too much dependent from time immemorial upon the good grace of the Hindu community, and the result is what they are. The Harijans have been so backward in every respect in my district that it behoves Government to devote particular attention to their improvement. There is no use for the Government to depend upon the reports of departmental officers. The Hon. Minister concerned must make personal visits to these areas ; he should not make programmed visits; the visits must be of the nature of surprise visits, and he should not be accompanied by any departmental or district officers ; and the choice of the villages must be at random. It is only then that he will be able to know what the real condition of the Harijans is in my district. I am given to understand by responsible persons, who are in the know of inside of things that the only Harijan Hostel at Madanapalle is not what it ought to be, and the work of the Harijan Department so far as my district is concerned is a big hoax. This ought to be true when we study the question of the Harijans with reference to the administration of the Harijan Welfare Department for the year 1952-53. The condition of the Harijans is a shame upon us, the Hindu community, and it is a shame upon the Government, to have left them in the condition in which they are. They have no houses ; and if they have houses, they are hovels only ; and if they have hovels, they have no roofs ; and if they have houses they have no doors. That is their condition. They are under-fed, they are under-clothed, they are houseless in very shabby conditions. Their huts are built in swampy slushy ground enclosed as it were by barbed wire fencing by the land of what the Communists are so often pleased to call Bhooswamis. What has the Government done for these people living in such conditions ? That is my question. In Chittoor District, according to the report of the working of the Harijan Welfare Department, the Department consists of a Tahsildar, one Upper Division Clerk, one Lower Division Clerk; two Special Inspectors and one Special Overseer and three Peons. So far as the department is concerned, it is perfect from its organisational

point of view. But the test of the pudding is in the eating of it. So, what has that department done so far for the amelioration of the Harijans. The ameliorative work is enumerated as provision of house sites, maintenance of schools, grant of scholarships, stipends etc. to Harijan boys, provision of wells for supply of drinking water, provision of sanitary amenities, pathways, street lighting, burial grounds, grant or assignment of land for cultivation or lease.

In regaurd to every one of these subjects the achievement of the department, so far as my district is concerned, is zero. I request the Hon. Minister to peruse statement 3 of the enclosure to the administration report for the year 1952-53. I do not know what has happened afterwards. It is found nil. The Government should institute an enquiry at once whether any applications for house-sites have been made from 1953. What has become of those applications ? What action has been taken thereon ? What disposals have been given to them ? They might have been disposed of; perhaps nil disposals might have been given. What is the achievement that the department has made in respect of these cheris ? The cheris are swamped, isolated and surrounded by inaccessible shrubs and there is no scope for expansion. In these circumstances the Government must come forward with a bold policy of land acquisition. The policy of appointing officers of the Revenue Department as Tahsildars or Deputy Tahsildars in the Harijan Welfare Departmene is pernicious. Most of these men would have come from the ranks of Bhuswamis and when they are appointed to these posts of Tahsildars or Deputy Tahsildars, they are welcomed in the vlllages and all honour is given to them. In these circumstances, these Tahsildars or Deputy Tahsildars find it very difficult to enforce the land acquisition proceedings against the interests of the Bhuswamis or landholders. Assignment of house-sites to Harijans particularly in Thémballi has become a scandal and I request the Government to go into that question. Actually, in the matter of assignment of house-sites nothing has been done. The Deputy Tahsildar goes to a Naidu for some land and he protests. Then

some other land is taken and again that Naidu comes and protests and thereafter another plot is taken up. At this rate, this becomes infinite. Therefore, I ask: why should not the Government take up a bold policy in regard to land acquisition ?

With regard to drinking water supply, the excuse of the department of late has been that it has been handed over to the Public Health Department. Why should it be handed over to the Public Health Department. The Public Health Department has nothing to do with this subject. Even for assignment of house-sites, an officer of the Public Health Department must come for inspection for selecting a site and the same old story is repeated.

With regard to education also, much has not been done so far as my district is concerned. I would suggest to the Government that a separate school for Harijans may be set up. Sufficient attention is not paid to these Harijan boys in the general schools and that is the reason why they go to Mission schools where not only personal attention is given to them, but they are also treated equally along with the other boys of other communities. These Harijan boys are thus able to shed their inferiority. In fact the Harijan students coming from the mission schools are walking in the streets like gentlemen with their chin up. But, such is not the case with the Harijan boys who are reading in the general schools. Therefore a separate school for Harijans is absolutely necessary if the Government are really sincere in helping the Harijans. Also, I would commend to the consideration of the Government that the education of these Harijan children may be entrusted to Christian Mission schools or Ramakrishna Math Organizations wherever they are available. One objection is that if the Harijan boys go to Christian Mission Shools, they will become Christians. Let them become Christians ? What is it that they are gaining by remaining in the Hindu fold, except the sorry, sordid story that we have been listening in the speech of Sri Bojja Appalaswami ? By becoming Christians, they won't cease to be Indian citizens. The same objection was raised when people like myself were admitted in the Christian College. Our parents used to be

told that we were likely to become Christians. None of us who have studied in the Christian College have become Christians. Therefore the fear that the Harijan boys will become Christians is baseless.

Then, Sir, provision of wells for Harijans is another scandal. I request the Minister to go to villages without intimating previously of his arrival. Let him go to any village and see if the Harijans have got drinking water supply. They have to depend upon the neighbour who may refuse at any time. Often they have to walk long distances. An excuse that has recently been started by Government officers is that provision of wells will be taken up in the Five-Year Plan or that the Harijans must contribute money or labour if they want drinking water wells.

Then there is the question of burial grounds. It is another sorry affair in my district and it has reached the level of a scandal in my area, particularly in Veeramangalam firka. The poor Harijan is not allowed to burn the dead body at a convenient place because Hindu owners make all hubbub and also they have the ears of the Government. The poor Harijans send petition after petition to the Collector who says that he is helpless. Sir, it is a matter which requires the immediate attention of the Harijan Minister.

Again, in most of the villages the cheris are inaccessible. About these pathways the less said the better. The Harijan cheris are surrounded by hills or swampy land or cultivation fields of some landholders. The pathways are covered with shrubs and the owners may at any time say 'no' to these Harijans. What are they to do? Is it not the duty of the Government to lay convenient roads for these people? Same is the case in regard to lighting. Of course, even we in towns suffer sometimes for lighting. Harijans require lighting also if they are to get enlightenment. At present lighting is less than zero; when every thing is zero, this is minus-zero. My humble suggestion to the Government is that, instead of Revenue Department officers being taken to the Harijan Welfare Department, they may appoint graduates fresh from the colleges,

preferably Harijan graduates as officers after giving some training in welfare work. This will, to some extent help the Government solve the unemployment problem.

Also, the Director of Social Welfare must in no circumstances be a Hindu. He must be a Harijan or a Christian. And that Director of Social Welfare must be made to work under a Harijan Welfare Committee, a statutory committee appointed at State level; the President may be the concerned Minister and the members may be recruited from among the Harijan members of Parliament or of this Assembly, or members representing Christian Mission Schools or Ramakrishna Math Organizations and one or two non-officials who are non-Harijans and who are doing voluntary, silent and unostentatious social work for the uplift of the Harijans. Thank you, Sir.

Sri G. RAMUNNAIDU:—అధ్యక్షా, శృంగవరపుకోట అనంతగిరి ఏజెన్సీ, అరకు ఏజెన్సీ ప్రజలగురించి మనవిచేస్తున్నాను. అనంతగిరిలో ఏలాటి వైద్యసహాయము లేక డాక్టరులేక ప్రజలు చాలా కష్టపడుతున్నారు. వారు ఆస్పత్రికి పోవాలంటే 25 మైళ్ళు దూరమున్న శృంగవరపుకోటకు పోవలసియుంటుంది. ఇది చాలా కష్టంగా ఉంటుంది. ఎప్పుడూ అక్కడ ప్రజలు మలేరియాతో బాధపడుతూ ఉంటారు. కనుక అనంతగిరిలో ఒక గవర్నమెంటు ఆస్పత్రి పెట్టవలెనని మనవిచేయుచున్నాను. ఇది వరలో గవర్నరుగారు అక్కడికి దయచేసినప్పుడు వారితోకూడ మనవి చేసుకొన్నాను. కలెక్టరుగారికి కూడ అర్జీ దాఖలు చేసుకొన్నాను.

అంతే కాకుండా మా కొండప్రజలు చదువు లేకుండా చెడిపోతున్నారు. మా ప్రాంతములో చదువుకోడానికి స్కూల్సు లేవు. కనుక ప్రభుత్వమువారు దయచేసి మా కొండ ప్రజలకు స్కూల్సు పెట్టి చదువు నేర్పవలెనని కోరుచున్నాను. తరువాత మాకు నీటి వసతికూడ లేదు. మూడు నాలుగు నెలలు ప్రజలు త్రాగడానికికూడ నీరు లేకుండా చాలా బాధపడుతూ ఉంటారు. అంతేకాక మాకు నడవడానికి రోడ్లుకూడ లేక ప్రజలు అక్కడ కొండలలోనే పడి చాలా బాధలు పడుతున్నారు. ప్రభుత్వము ఇతర ప్రాంతాలకు రోడ్లు వేస్తున్నారుగాని మాకు అటువంటి సౌకర్యము చేయలేదు. మా కొండప్రజలకు కూడ ఆ ప్రాంతములో రోడ్లువేసి సహాయం చేయకూడదా? మాకు ఏలాటి సౌకర్యాలు లేకుండా అన్ని విధములుగా వెనుకపడి బాధపడుతున్నాము. ఈ కొండ ప్రజలకు ప్రభుత్వము సహాయము చేయకూడదా? మేము ప్రజలము కామా? మమ్ము ఈ విధముగా వదలిపెట్టడం ప్రభుత్వమునకు న్యాయంకాదని మనవి చేస్తున్నాను.

Sri T. PAPA RAO:— అధ్యక్ష మహాశయా! ఈ Social Welfare Demand సంపూర్ణంగాను, సంతృప్తికరంగాను ఉన్నది. ఈ రాష్ట్రములో వెనుకబడిన

22nd July 1955] (Sri T. Papa Rao)

తరగతులవారు–హరిజనులుగాని, గిరిజనులుగాని, ఇంకొ ఇతర వెనుకబడిన జాతులుగాని–50% వరకు ఉన్నారు. వీరికి విద్యా విషయంలో సరియైన ప్రాతినిధ్యం ఇవ్వడంలేదు. ఇంజనీరింగు సీట్లలో గాని, మెడికల్ సీట్లలో గాని ఇతర కొలేజీలలో గాని వీరికి సమాన ప్రాతినిధ్యం ఇవ్వడంలేదు. కనీసం వీరు ఎంత percentage ఉన్నారో అంత percentage సీట్లు వీరికి ఇవ్వడం న్యాయంగా ఉంటుంది.

Sri P. VENKATASUBBAYYA :— When the discussion is going on in the House, Hon. Minister is not present in the House.

Mr. SPEAKER :— He is hearing from the lobby.

Sri T. PAPA RAO :—వెనుకబడిన జాతులను ముందుకు తీసుకుపోవుటకు తగిన ప్రణాళికలు ఏర్పాటుచేసి వారిని ముందుకు నడిపించినగాజే సమానత్వము జరుగుతుంది. అప్పుడే మీ రనుకొన్న Socialistic pattern of Society ఏర్పడుతుంది. అంతేగాని, ఇదివరకే బాగా develop అయినటువంటి ప్రజలకే ఎక్కువగా అవకాశాలు ఇచ్చి, వెనుకబడిన ప్రజలను ఏమాత్రం చూడకుండా ఉండడం అనేది ధర్మంకాదు, అది న్యాయంకాదు. గౌరవసభ్యులందరు ఈ విషయాన్ని ఆలోచించవలసి యున్నది. గత సంవత్సరం ఇంజనీరింగు సీట్లను, మెడికల్ సీట్లను పెంచి, ఈ రాష్ట్రంలో మూడు జోన్లు ఏర్పాటుచేశారు. మొత్తంమీద backward communities వారికి 25% మాత్రమే reserve చేశారు. ఆంధ్రరాష్ట్రంలో backward communities వారు 45% ఉన్నప్పుడు వారికి ప్రత్యేకించి 45% ఇవ్వడం ధర్మంగాని, 25% ఇవ్వడం న్యాయంకాదు. ఈ విధంగా అయితే వారిని ఎట్లా ముందుకు తీసుకొనివస్తారో, వారిని ఏవిధంగా ఇతర ప్రజలతో సమానంగా తీసుకొని వస్తారో నాకేమి అర్థం కావడంలేదు.

సర్వీస్ కమిషన్‌లో కూడా ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పటికీ. వెనుకబడిన జాతులు ఆంధ్రరాష్ట్ర జనాభాలో సగముమంది వున్నప్పటికినీ కూడా వెనుకబడ్డ జాతివారికి representation లేకుండా చేయడం కేవలం విచారకరమైన విషయం, శోచనీయమైన విషయము. అయితే ఏదో కొంత వరకైనా తృప్తిపడి సరిపెట్టుకోటానికి అవకాశము కలిగింది. జయవిజయులకు శాపమిచ్చేటప్పటికి, దేవునితిట్టి మూడు జన్మలలోను లేక స్తుతించి ఆరు జన్మములలోను విష్ణుసాయుజ్యం పొందుతారా అని అడిగితే వారు మూడుజన్మలు శత్రువులుగా పోరాడుటకు అంగీకరించినట్లుగా, ఏదో ఒక విధంగా ప్రజలనుండి fight చేసి ఎదిరించుకొని వచ్చి యీ నాటికైనా వెనుకబడిన కులాలకు ప్రాతినిధ్యం వహించిన శ్రీమాన్ లచ్చన్నగారు గౌరవమంత్రిగా, అందులో ప్రత్యేకించి Social Welfare శాఖకు మంత్రి కావడం ఎంతో మదావహమైన విషయము. మా కందరకు చాలా సంతోషమేకాని యీనాడు యీబడ్జటు డిమాండు చూస్తే యెంతో అసంపూర్తిగా; ఆకారహీతంగా వుండడము చాలా విచారకరముగా వున్నది. కాని ఇదివరకు జరిగిందేమో జరిగిపోయింది. ఇకముందు అయినా గౌరవమంత్రిగారు అదిచక్కబెట్టి అందరికి సమాన ప్రాతినిధ్యము, వెనుకబడిన జాతులకు కూడా Service Commission లో, ఇంజనీరింగు మెడికల్, సీట్లలోనూ agricultural

కళాశాలలో వారికి వుండవలసిన పరిసెంటేజీ ప్రకారము సీట్లు యిచ్చేటట్లుగా చేయమని కోరుతున్నారు.

*Sri N. K. LINGAM :—అధ్యక్షా, ఈ హరిజన సమస్య పెద్ద విషయము. కాని మే మందరము హరిజన శాసనసభ్యులము. ఈ విషయము వచ్చినప్పటికి ఎక్కువగా మాట్లాడవలసిన విషయాలు ఉన్నప్పటికి, అవకాశము చాలినంత లేనందున ముఖ్యమైన విషయాలు మాత్రం చెబుతున్నాను.

ఈ హరిజన డిమాండుక్రింద 9.12 లక్షల రూపాయలు కేటాయించామని మన ముఖ్యమంత్రిగారు తమ ఉపన్యాసములో చెప్పారు. కాని నా వుద్దేశ్యములో మొత్తము అంతా వ్యర్థము అని అంటాను. ఈ నాడు Harijan Welfare Department అనే దాన్ని తొలగించారు. దానివెంట హరిజనులకున్న ప్రత్యేక హక్కులు గూడా పూర్తిగా తొలగిస్తే ఆనందించేవాడిని! సాంఘిక సంక్షేమ శాఖ పెట్టనుద్దేశించుచున్నప్పుడు, సంఘములో సమానత్వముగూడా కలిగించే ప్రణాళిక యిందులో లేనందుకు నేను చింతపడుచున్నాను. వారికి చదువులు వద్దు, హాస్టళ్లు వద్దు, ఇళ్ళ స్థలాలు వద్దు. మాకు యేమీ వద్దు, కాని మాకు సంఘములో మాత్రము సమానత్వం కావాలి. అది మాత్రము ప్రభుత్వము ప్రసాదించేటట్లు చేయాలని కోరుతున్నాను. ఈ రోజున సాంఘిక సమానత్వాన్ని యీ కాంగ్రెసు ప్రభుత్వముకాని, యీ మంత్రివర్గము కాని, యీ ఇండియన్ యూనియను గాని చేయదలచుకుంటే, పల్లె ప్రాంతాలలో మాల, మాదిగల పేర్లతో వున్న బావులను పూడ్పించి, అందరు ఒకే బావిలోనుంచి నీరు తెచ్చుకోటానికి వీలు కలుగచేయండి. ఇప్పుడు వున్న చట్టము దాని కనుగుణంగా మార్చటానికి వీలుంటే మార్చండి. దాదాపు కోటి రూపాయలు ఖర్చు పెట్టారు. ఏమి ప్రయోజనములేదు. మాకు కావలసింది తిండి, బట్ట కనుక యివి కలుగజేస్తూ, సంఘంలో మాత్రం సమానత్వం లేకుండా చిక్కుకుని అవస్థలు పడుచున్న మమ్ములను యీ చిక్కులలోనుంచి వదిలించండి.

ప్రభుత్వమును హరిజనులకోసము లక్ష రూపాయలు, మూడు లక్షల రూపాయలు భిక్షము అడుగుచున్నాము. ఇక్కడ 30 మంది శాసనసభ్యులు అరణ్యరోదన చేస్తూంటే మా మొర ఆలకించేవారు కనబడలేరు. ప్రభుత్వము యిచ్చే కోటి రూపాయలు మంచి మంచి మార్గాలకు వినియోగించండి. ప్రాజెక్టులు కట్టించండి. మంచి పంటలు పండే టందుకు అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించండి. పేదలకు తినటానికి అన్నము, కట్టటానికి బట్ట కలుగజేయండి. ఈ ప్రభుత్వముగాని, కాంగ్రెసు సంస్థకాని, ఇండియను యూనియనుగాని మాకు సమానత్వము కలుగజేస్తామని మాకు పూచీ యివ్వండి. మనకు స్వరాజ్యము రావాలని ప్రయత్నించే సమయములో గాంధీగారు విదేశాలకు వెళ్ళినప్పుడు, అక్కడ ఆయనను "ముందు మీ దేశములో అంటరానితనము లేకుండా చేయండి" అని అన్నారట. దాని కనుగుణంగా మన రాజ్యాంగ చట్టములో మాకు రక్షణ ఒకటి పెట్టారు. ఆ రక్షణ ప్రకారం హరిజన వెల్ఫేరు అనేపేరు యీ నాడు తీసివేశారు. దానితోబాటు యీ అంటరానితనము గూడా తీసివేస్తే బాగుండేది. లచ్చన్నగారు Harijan Welfare

Department అనే పేరు తీసివేసి ఇంకొక పేరు పెట్టినందులకు వారికి మా అభివందనాలు.

ఇంతేకాకుండా గ్రామాలలో బావులలోనుంచి మంచినీరు తెచ్చుకోటానికి వీలు కలుగజేస్తూ అందరికి యిందులో సమాన హక్కు కలుగ జేయాలి అనిఅంటున్నాను. మరొక విషయము. అది ఇళ్ళ స్థలాలవిషయం. Acquisition చేస్తున్నామని ప్రభుత్వం యిప్పటికి యెంతో కాలంగా చెబుతున్నారు. ఆ నాడు కర్నూలులో రాష్ట్ర స్థాపన చేయటానికి వచ్చినప్పుడు నిమిషాలమీద భూమిని acquire చేశారు. స్వాధీనము చేసుకున్నారు. కాని యిప్పటికి 10 సంవత్సరాలుగా హరిజనులకు యిళ్ళ స్థలాలకు భూమి acquire చేస్తామని చెప్తూవస్తున్నారు గాని యింతవరకు యేమిజరగలేదు. కోటిరూపాయలు ఢిల్లీకి పోవటానికీ, రావటానికి వుద్యోగస్థుల భత్యాలు వగైరాలకు ఖర్చుచేశారు కాని మా హరిజనులకు నిజంగా చేసింది యేమిటో చెప్పండి. ఇదిగో యిస్తున్నామని చెప్పుతూ యిక్కడ ఉపన్యాసాలు చేస్తారేగాని, యిచ్చినది యేదీ కనబడ లేదు. సామెత చెప్పినట్లు మనస్సు వుంటే మార్గమువుంటుంది. కనుక ప్రభుత్వానికి మనస్సు వుంటే యిది యెంతోసేపు పట్టదు. నిజంగా సాంఘిక సంక్షేమ శాఖలో పనిచేసే సేవకులు ఎవరు? ఎవరైనా ఉద్యోగస్థుడు మాకొరకు గ్రామాలకువస్తే కరణంగారి యింటిముందు ఉన్న అరుగుమీద కూర్చోవడము, మమ్ములను దూరముగా క్రింద కూర్చో పెట్టి, మమ్ములను అడిగి Statement వ్రాసుకోవడము జరుగుచున్నది. నిజానికి ఆఫీసర్ల డైరీలు పరీక్షచేయండి. వారు ఎక్కడెక్కడ ఏ ఏ తేదీలలో ఏ ఏ పనిచేశారో, పట్టాలు ఎక్కడైనా యిచ్చినట్లు వుంటుందేమో check చేయండి. వారు పల్లెలకుపోయి యేమి వ్రాసుకొని వచ్చారో ఎవరైన check చేశారా? వారు వ్రాసిందే జరుగుచున్నది. పెట్టిందిభిక్షము అన్నట్లు, వారు ఎంతవ్రాస్తే అది చెల్లుబాటు చేస్తున్నారు. కాబట్టి మమ్ములను ఆదరించేవారు ఎవ్వరు? మాలలు, మాదిగలు అని, అంటరానివాళ్ళని మమ్ములను చాలా చులకనగా చూస్తున్నారు. కాబట్టి ప్రభుత్వము ఎంత డబ్బు సెలవు చేసినను యీ అంటరాని తనము పోగొట్టి సంఘములో సమానత్వము మాకు ప్రసాదించ టానికి ప్రభుత్వము కృషి చేయాలి.

విద్యకోసం ఖర్చుపెట్టే డబ్బు మూడు రకాలుగా ఖర్చుచేస్తున్నట్లు కనబడు తున్నది. దీనిక్రింద ఖర్చుపెట్టే సొమ్ములో మూడవవంతే వినియోగపడుచున్నది. ఇది ప్రయోజనములేదు. ఈ వెల్ఫేరు డిపార్టుమెంటును Education Department కు hand over చెయ్యండి. Health Departmentను Revenue Departmentకు యివ్వండి. హరిజనులకు ఏది చేయాలన్నను, అక్కడ తహశీలుదారు వుంటాడు. ఉదయాన్నే లేచి ఆయనకు నాలుగు వందనములు పెట్టితే, మాకు కావలసిన పనులు చేయించు కోవచ్చును. ఆయన అయినా మాకు యిళ్లు కట్టించి యిస్తాడు. కాని ఈ Welfare Department కు వున్న ఆఫీసరు ఎక్కడనో నూరుమైళ్ళ దూరములో వుంటాడు. ఇక ఆయనకొరకు ఎంతదూరమని ఎవరు పోగలరు. తీరా, ఆయనవద్దకు వెళ్ళితే, ఇప్పుడు కాదు అంటాడు. లేదా నేను వస్తాను నీవు వెళ్ళమంటాడు, అదికాకపోతే అసలు దర్శ నమే యివ్వడు. కాని తహశీల్దారు ఎదురుగానే వుంటాడు. ఆయనను చూడాలంటే అవకాశాలు కలుగుతాయి. అప్పుడు యీ వెల్ఫేర్ డిపార్టుమెంటు పనులు సక్రమంగా జరుగుతాయి.

తరువాత స్మశానాల విషయము వున్నది. దీనికివున్న చట్టములలో మార్పు తీసుకొని రావలసివున్నది. మాలో ఎవరైనా చచ్చినట్లైతే, ఆ కళేబరమును వేరే యెందుకు పెట్టాలి. ఇప్పుడు స్మశానాలు వున్నచోటనే, ఎందుకు పెట్టకూడదు. ఇందుకుగాను ఒక చట్టము ఎందుకు తీసుకొనిరాగూడదు ? కాబట్టి ప్రభుత్వము దీనికి కొంత ఖర్చు తగ్గిస్తూ, గాంధీ గారి సిద్ధాంతములు మనకు కావాలి కాబట్టి, యిప్పుడు వారు ఏర్పాటుచేసిపోయిన కాంగ్రెసుసంస్థ, కాంగ్రెసు ప్రభుత్వము వున్నవి గనుక అన్నిటికంటె ముఖ్యంగా యీ land మరెవరైనా ఉపయోగించుకోటానికి వీలుంటుంది, అందరు ఒకే స్మశానము వాడుకొనుటకు ప్రభుత్వము చట్టము చేస్తుందని నమ్ముతున్నాను.

Sri M. MATCHI RAJU :— అధ్యక్షా ! ఈ సోషలు వెల్‌ఫేర్ డిమాండును బలపరుస్తున్నాను. మా చింతపల్లి ఏరియాలో ప్రత్యేకముగా ఒక హైస్కూలు పెట్టించాలని, హాస్టలు బిల్డింగు కట్టించవలయునని ప్రభుత్వము వారిని కోరుతున్నాను. 60, 70 మైళ్ళనుంచి ఈ ఏరియాలో వాళ్ళు రోడ్లమీద పోవాలంటే అనేక బాధలు పడుతున్నారు. చింతపల్లి నుంచి లోతుగడ్డ మీదుగా గంగరాజుమాడుగ, పాలేరు మీదుగా రోడ్డు వేయించి ఆ గ్రామ ప్రజల కష్టములను నివారణ చేస్తారని నేను ఆశిస్తున్నాను. పాలేరు ఆ చుట్టుప్రక్కల చాలా గ్రామాలకు సెంటరులో వున్నది. కాబట్టి ఆ గ్రామములో ఒక హైస్కూలును, ట్రైబలు హాస్టలును పెట్టించి అక్కడ వున్న ట్రైబులు అందరికి విద్య నేర్పించవలయునని ప్రభుత్వమువారిని కోరుతున్నాను. అక్కడ రోడ్డు సౌకర్యములు లేనందువల్ల వారు పండించే దినుసులు సంతలకుగాని, ఇతర గ్రామములకు గాని తీసుకుపోవడానికి చాలా కష్టపడుతున్నారు. వారికి రోడ్లు వేయించి తగిన సౌకర్యములు కల్గిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri T. JIYYAR DAS :— అధ్యక్షా ! నాకు ఇంకా రెండు నిముషములు అదనంగా ఇవ్వాలని ముందుగానే తమకు మనవి చేసుకుంటున్నాను.

ఈ సంక్షేమ శాఖ కోసము ప్రవేశపెట్టిన డిమాండు ఎంతో సమర్థనీయమైనటువంటిది. నేను నా సోదర సభ్యుడు కూర్మయ్యగారు 1916 సంవత్సరములో, మీదు మిక్కిలి 1921 సంవత్సరమునుంచి మేము పెద్ద పెద్ద మీటింగులు పెట్టి, సభలు జరిపి అనేక తీర్మానములు చేశాము. మా యొక్క తీర్మానములు నేటికి ఒక రూపానికి వచ్చినందుకు చాలా సంతోషముగా వున్నది. అంతేకాకుండా మేము మద్రాసు ఉమ్మడి రాష్ట్రములో వుండగా శాశ్వతంగా 18 పేర్లు పెట్టించుకొని, ఈ రోజున ప్రత్యేక ఆంధ్రరాష్ట్రములో 34 హరిజనులు అని నలుబది పేర్లు పెట్టించుకున్నందువల్ల ఈ పేర్లు అన్నీ మార్పించి మాకు ఏదో సాంఘిక సంక్షేమ శాఖ అని ప్రత్యేకంగా ఏర్పాటు చేసినటువంటి మంత్రిగారిది సాహసము. దానికి నేను వారిని అభినందిస్తున్నాను.

హరిజనుల హాస్టల్సు నిర్వహించేటప్పుడు ప్రభుత్వము వారు ఈ సంవత్సరము 10 హాస్టల్సును, ఇదివరకు కొన్ని హాస్టల్సును నిర్వహిస్తున్నామని అన్నారు. కనీసం యీ హాస్టల్సులోనైనా విక్రయాన్నము పెట్టకూడదని నేను మనవిచేస్తున్నాను. మా గుంటూరు జిల్లాలో గవర్నమెంటు హాస్టలు నడుపుతూ అక్కడ వున్నటువంటి కలెక్టరుగారు

అన్నము పెట్టే సంప్రదాయముకూడా కంట్రాక్టుకు ఇచ్చారు. అది మాత్రం చేయకూడదు అని, దీనికి ఒక నియమమైనటువంటి, క్రమబద్ధమైనటువంటి, ఆచారాన్ని హాస్టల్సులో ఏర్పాటు చేయాలని మనవిచేస్తున్నాను. బేసిక్ ట్రైనింగు స్కూల్సులో హాస్టల్సునునిర్వహిస్తున్నారు. ఆ పద్ధతినితీసుకువచ్చి మనహాస్టళ్ళలో పెట్టితే, ఇక్కడఖర్చు పెట్టేటటువంటి ప్రతి రూపాయి విలువ కలిగినటువంటిదై దానివల్ల వచ్చేటటువంటి ఉపకారము డైరెక్టుగా మనబిడ్డలకీ వస్తుందని మనవిచేస్తున్నాను. అంటే రోజులోని 24 గంటలకు ఆ హాస్టల్సును నిర్వహించేటటువంటి ప్రభుత్వమువారుగాని, ప్రయివేటు వారుగాని మాకు సమాధానము చెప్పాలి. లేకపోయిన పక్షంలో మా హరిజనహాస్టళ్ళ పేరుతో వెచ్చించే ప్రతి దమ్మిడీ వృధాయని మనవి చేయుచున్నాను.

ఈ అస్పృశ్యతా నివారణ సమస్యనుగురించి హరిజనులు చాలాఆవేదన పడుతున్నారు. కాని నివేదనకూడాచేశారు. దానిలో ఈఅస్పృశ్యతా నివారణకు ముఖ్యముగా కావలసినది నిర్మలమైన ప్రేమ. ఆ ప్రేమను మీరు 99 కోట్లు, 99 లక్షలు, 999 రూపాయలు పెట్టి కొన్నా అది రాదు. దానిని మీరు ప్రత్యేకమైన దృక్పథముతో చూడాలని మనవి చేస్తున్నాను. దానికి కావలసినది ఏమిటంటే environment. పరిసర ప్రభావము గొప్పది. పరిసర ప్రభావములను డబ్బుపెట్టి కొనలేరు. నిర్మలమైన ప్రేమతో ప్రత్యేకమైన పరిసరాలను కల్పించకపోయినట్లయితే చిత్తప్రవృత్తి మారదని మనవిచేస్తున్నాను. చిత్తప్రవృత్తిమారిన రోజునే ఈ హరిజన సంస్కరణకు ఫలిత ముండునని మీకు మనవిచేస్తున్నాను. మనం అందరముకూడా భగవద్గీత చదువుకున్నాము. దానిలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుని యుద్ధమునకై ప్రోత్సహించినాడు. ఆ ప్రబోధముచే అర్జునుడు సిద్ధపడినాడు. రణరంగమునకు వచ్చి శ్రీకృష్ణ పరమాత్మను ఒక్క తృటికాలము వదలి "సేనయోరుభ యోర్మధ్యే రథం స్థాపయ మేఽర్జునా" అన్నాడు. అటూ ఇటూ ఉభయ సేనలమధ్య తిరిగి, స్వజన, స్వబంధువులను జూచి, యుద్ధము చేయనని ధనుర్భంగము చేసినాడు. అచట శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునకు పరిసరము - ఇచట స్వబంధువుతో కూడిన ఉభయ సేనలు పరసరము. ఇది environment ప్రభావము. మీరు ప్రభావవంతమైన పరిసరాన్ని కల్పించనంతవరకు మా పరిసర ప్రభావములలోనే మేము వుంటాము. మమ్ములను మీ షోడశాచారములనుండి ఏనాడు అయితే విడనాడుతారో ఆ రోజున మా ఆచారాలు మాకే, మా వ్యవహారాలు మాకే మిగిలి ఉండునని మనవి చేస్తున్నాను. మీరు ఇంత కాలమునుంచి ఇండ్ల స్థలాలు హరిజనులకై కేటాయించుచున్నారు. దానికి 6 లక్షల రూపాయలు ఖర్చు పెట్టుతున్నామంటున్నారు. ప్రకాశం పంతులుగారు కోటి రూపాయలు యిచ్చారంటున్నారు. అంతకుముందు రెండవ దఫాలో 10 లక్షల రూపాయలు యిచ్చామంటున్నారు. ఇట్లా మీరు 130 లక్షలు ఖర్చుతో మాకిచ్చే నివేశన స్థలములను గ్రామాలయొక్క హృదయాల్లో కేటాయించనంతవరకు అస్పృశ్యతా నివారణము జరుగదని చెబుతున్నాను. గ్రామ కంఠాల వెలుపల మీరు మైలు దూరానో లేక మైలున్నర దూరానో మమ్ములను ఉండమంటే మాకు వుండే పరిసరములు ఆచారములు మేము ఏర్పాటు చేసుకుంటాము. అట్లా జరిగితే మాకు 'మా' మిగులుతుంది, మీకు 'మీ' మిగులుతుంది. దీనినే (segregation) సెగ్రిగేషను అంటారు. నా సోదరుడు మొదలియారుగారు మాట్లాడుతూ ప్రత్యేకంగా హరిజన పాఠశాలలు వుండాలని చెప్పారు. నేను కూడా ఉపాధ్యాయ వృత్తిలో

వున్నాను. ఈ ప్రత్యేకమైనటువంటి స్కూళ్ళు ఏర్పాటుచేసినట్లయితే వాటిని మా పల్లెలలోనే పెడతారు. మాకు విద్య ప్రసాదించేందుకు వారు చెప్పినట్లు క్రైస్తవ మాస్టర్లో లేక ఎవరినో పంపుతారు. నేను కౌన్సిలులో సభ్యుడుగా వుంటూ ఒక స్కూలును పరీక్ష చేయడానికి వెళ్ళాను. ఆ స్కూలులోని పంతులుగారిని విశ్వనాథ సత్యనారాయణ గారు వ్రాసిన నవ్యాంధ్ర వాచకములోని ఒక సమాసాన్ని కలిపి చదవమంటే పాపము ఆయన చదవలేకపోయారు. వారే మాకు చదువు చెప్పాలి. కనీసపక్షము విద్యావిధానము నయినా సరే సంస్కారప్రియుల చేతులలో పెట్టి మిగతా డిపార్టుమెంటులలోని ఉద్యోగాలన్నీ వారు చెప్పినట్లు మా హరిజనులకు ఇచ్చుకుంటారో లేకపోతే ఇంకెవరకు ఇచ్చుకుంటారో చేయండి. విద్యాశాఖ మాత్రము చదువుకొన్నటువంటి సంస్కారప్రియుల చేతుల్లో పెట్టి హరిజనశాఖను పరిపాలించవలసిందని ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను.

ఈ హాస్టల్సును గురించి కూర్మయ్యగారు మీకు మనవిచేశారు. బాగా పరిపాలింపబడనటువంటి హాస్టల్సుగురించి ఏవైనా రిపోర్టు వస్తే వాటినిమాత్రము తీసివేయవలసిందని మేము శాసనసభ్యులందరము సమావేశమైనప్పుడు ఒక అభిప్రాయమునకు వచ్చాము. మీరు ఈ సంవత్సరము కాకపోయినా వచ్చే సంవత్సరము అయినా సరే ఈ హాస్టల్సును వశపరచుకొని వాటినిమాత్రము "గురుకుల" పద్ధతిలో నడిపించి మా పిల్లలకు కనీసపక్షము కొంచము సంస్కారము అయినా వచ్చేట్లుగా చేస్తేగాని ముందుయుగంలో వాళ్ళు అస్పృశ్యతా నివారణను సాధించలేరని మరొక పర్యాయము మనవిచేయుచున్నాను. గురుకులాన్ని గురించి మన శాసనసభ్యులతోకలసి పెట్టిన సభలో 4 పేజీల టైపుమాటరును మంత్రిగారికి అందజేశాను. గురువు శిష్యుడుకలసి చదువుకోవడం అంటే దానిని ఇంగ్లీషులో రెసిడెన్షియల్ ఇన్స్టిట్యూట్ అంటారు. ఇంతటితో విరమిస్తున్నాను.

Sri MAHAMMAD TAHSEEL :— అధ్యక్షా, ముఖ్యముగా గిరిజనుల గురించి కొన్ని విషయాలు మీకు సూచించ దలుచుకున్నాను. బ్రిటిషు గవర్నమెంటు వారు వున్నప్పుడు కొండజాతులయొక్క భూములు ఇతరులు ఎవరూ కూడా కొనకూడదని అవి కొన్నట్లయితే చెల్లనేరవని 1917 వ సంవత్సరములో ఒక యాక్టు ప్యాసు చేశారు. దానివల్ల కోయప్రజలు కొంతవరకైనా తమ భూములను దక్కించుకుంటారని ఆశించాము. అయితే ఆ ఆశ నిరాశ అయింది. ఎందుచేత అంటే ఆ కోయప్రజలకు చదువు రాక పోవడమువల్ల ఆ ప్రాంతాలలో వున్నటువంటి కోయలు కానివారందరూ కూడా వాళ్ళవద్ద నుంచి ఏదో ఒక విధముగా మాయజేసి వాళ్ళతో కాగితాలు వ్రాయించుకొని వాటిమీద వ్రేలుముద్రలు పెట్టించుకోవడము జరుగుతోంది. ఏమిటంటే, "మేము శిస్తులు కట్టుకోలేము, ఈ భూములతో మాకు నిమిత్తములేదు, అందుచేత ఈ భూములు మాకు అవసరములేదు" అని అక్కడ వున్న కరణములు వ్రాయించుకొని వాటిని వారు తమ భార్యలపేరనో లేక బంధువుల పేరనో పెట్టించుకున్నారు. ఆవిధముగా అక్కడవున్న భూములన్నింటినీ కాజేయడము జరుగుతోంది. అందువల్ల ఆ కోయ ప్రజలు తిరిగి గుట్టలకు వెళ్ళవలసిన అవసరము ఏర్పడుతోంది. గోదావరి దగ్గర అయ్యవారి గూడెము అనే ఒక గ్రామము వున్నది. ఆ గ్రామములో వున్న కోయ ప్రజలందరు కూడా కొంత పొలాన్ని సేద్యము చేసుకొని చక్కగా వ్యవసాయానికి అనువుగా తయారు చేసుకొన్నప్పుడు అక్కడ

వున్నటువంటి మల్లాది నరసింహముగారు అనే ఒక కరణం ఆ పొలాలను అన్నింటినీ వారి భార్యపేర పెట్టించుకొని ఆ గ్రామస్తులందరిని లేవగొట్టిన ఘటనలు వున్నాయి. అక్కడ నుంచి వారు లేచి ఇంకో ప్రాంతానికి వెళ్ళి అక్కడ కూడా ఒక అయ్యవారి గూడెము అనే పేరుతో ఒక గ్రామం ఏర్పాటు చేసుకొన్నారు. అక్కడ ఉన్న 20 ఎకరములు వాళ్ళు సేద్యము చేసుకుంటున్నప్పుడు అదికూడా మళ్ళీ మాయచేసి తన స్వాధీనము చేసుకున్నాడు. అక్కడనుంచి ఇంకొక ప్రాంతమునకు వారలు వెళ్లవలసి యున్నది. వాళ్ళు కోర్టులో పిటీషను పెట్టుకున్నారు. రెండు మూడు సంవత్సరములు జరిగినవి కాని వాటిని file లో తీసుకోకుండా అక్కడ ఉన్న ప్రభుత్వ ఉద్యోగస్థులు మాయపన్ని ఆ కోయలను మరల ఆ మల్లాది నరసింహంగారి యింటికి తీసుకవెళ్ళి బాగా నెయ్యివేసి భోజనం పెట్టించి మరల వ్రేలుముద్రలు వేయించారు. ఆ విధముగా చేయడం మూలంగా 1917 సం||లో చేసిన Act వృధా అవుచున్నది. కాబట్టి ఆ Act ను ఖచ్చితముగా అమలు జరిపేటందుకు ప్రభుత్వము పూనుకోవాలని మనవిచేస్తున్నాను.

రెండవ విషయము ఏజెన్సీ ప్రాంతములలో ఉన్న వాళ్ళకు agency allowances యివ్వడములేదు. Agency ప్రాంతములో పుట్టారు. అక్కడ ఏదో చదువుకున్నారు. ఉద్యోగములు చేయుచుండిరి. కాని agency allowances యివ్వడములేదు. ఎందుచేతనంటే మీరు agency ప్రాంతములో పుట్టారు. మీకు దోమలు కరువవు అంటున్నారు. ఎక్కడైనా ఇది జరుగునా? Plain నుంచి వచ్చిన వాళ్ళను కరవడం agency ప్రాంతముల వారిని కరవక పోవడము ఎక్కడైనా ఉండునా? 1931 వ సం|| వరకు allowances యిస్తూ వచ్చారు కాని "Madras Manual of Special Pay" Rule No. XI (a) అనుసరించి agency ప్రాంతములకు allowances యివ్వకూడదన్నారు. అందువలన ఆ చట్టమును సవరించ వలసినదిగా కోరుచున్నాను.

కోయ ప్రజలనుంచి పుల్లరి చాలా ప్రాంతములలో వసూలు చేయుటలేదు. కాని నూగూరుతాలూకాలో కోయలకు ఆ సౌకర్యములేదు. నేను మొన్న ఆ గ్రామము వెళ్ళినప్పుడు అక్కడి District Forest Officerను ఎందుకు పుల్లరి వసూలుచేయు చున్నారని అడుగగా వారు ఇవి C. P. Rules అన్నారు. అందువల్ల ఆ రైతులు పుల్లరి యిచ్చుటకు తగిన ఆర్థికస్తోమతులేక చాలా బాధపడుచున్నారు. అదిగాక పుల్లరి పెంచినారు. కాన ప్రభుత్వమువారు పుల్లరిని వసూలుచేయకుండా ఉండగలందులకై తగిన చర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను.

ఇంకొక విషయము జమీందారీవిషయము. ముఖ్యముగా నూగూరు జమీందారువల్ల అక్కడ రైతాంగము చాలా బాధపడుచున్నది. ఆ జమీందారు వీరిచేత నిర్బంధముగా పనులు (వెట్టిచాకిరి) చేయించుకుంటూ ఉంటారు. వీరికి ఎన్నిపనులున్ననూ జమీందారు దగ్గరకు వెళ్ళి పనులుచేసి రావలసినదే. ఆ విధంగా పనులు చేయకపోయినట్లయిన వారు భూములు సేద్యముచేయుటకు వీలులేకుండా ఉన్నది. కాబట్టి జమీందారీ విధానమును రదుచేయాలని కోరుచున్నాను. అక్కడ వసూలుచేసే శిస్తులుకూడ చాల ఎక్కువ. నేను మేనెల 29 వ తారీఖున నూగూరు, వెంకటాపురం మొదలగు గ్రామములు వెళ్ళితిని. అక్కడ విచారించితిని. నేను వెళ్ళుసరికి అక్కడ ఒక Cricle Inspector గారు

రైతుల దగ్గరకు వచ్చి కేసు విచారిస్తున్నారు. జమీందారులు ఎక్కువగా పన్నులు వసూలు చేస్తున్నారని రైతులు పిటీషన్ పెట్టినారు. దానిమీద ఆ Circle Inspector గారు వచ్చి విచారిస్తున్నారు. 4 సెంట్ల భూమి ఉన్నదో లేదో దానికి రు. 18/- గోళ్ళు ఊడగొట్టి వసూలుచేస్తున్నారు. ఇది చాలా దారుణమైన విషయము. కనుక నూగూరు ఎస్టేటును వెంటనే రద్దుచేయవలసినదిగా కోరుచున్నాను. అదేవిధముగా ముఠాదారీ విధానము. ఆ ముఠాదారిక్రింద 30 గ్రామములు ఉండును. ఆ ముఠాదారుక్రింద గుమాస్తా, ఆ గుమస్తాదగ్గర ఉండే తలారివెళ్ళి కోయలదగ్గర నిర్బంధముగా ఇంటిపన్ను వసూలు చేయడము జరుగుతూ ఉన్నది. పైగా ఆ ముఠాదారు గ్రామములోకి రావటముతోనే ఆ గ్రామస్థులు అందరు సాష్టాంగదండ ప్రమాణము చేయవలసినదే. అదీకాక ఇంకొక ఘోరమైన విషయము. అతని కంటికి నచ్చిన స్త్రీలు గ్రామములో కనబడినపుడు వాళ్ళను తన యింటికి పంపించమంటే తప్పకుండా పంపించ వలసిందే; లేకపోతే గ్రామములో ఉన్న ఆ రైతును వెళ్ళగొట్టిన ఘట్టాలుకూడా ఉన్నవి. అందువల్ల ముఠాదారు విధానమును రద్దు చేయవలసినదిగా కోరుచున్నాను. గవర్నమెంటువారు Forest area లో కొన్ని బావులను స్వాధీనము చేసుకుంటున్నారని తెలుస్తున్నది. ఇది చాలా సంతోషించదగ్గ విషయము. కాని ఈ విధానములో కూడా లోటు జరుగునని చెప్పుతున్నాను. ఈ విధానమునకు ముందు contractors ఉన్నప్పుడు రేటు నిర్ణయించి రైతాంగమునకు ముందు పెట్టుబడిపెట్టి వారితో పనులు చేయించుకొనుట జరుగుచున్నది. ఇప్పుడు ఉన్న కూలిరేటు చాల తక్కువ. కాబట్టి గవర్నమెంటువారు ముందు ఈ రైతాంగానికి కూలిరేటు సక్రమంగా నిర్ణయించాలని కోరుతున్నాను. గవర్నమెంటు ఆఫీసర్లు ఎటువంటి దగా చేయకుండా అందరిపైన అజమాయిషీ తీసుకొనవలసిన అవసరము ఉన్నది. వారలకు ముందుగా కొంత డబ్బు advance గా యివ్వాలి. 10, 15 రోజుల కొకసారి బట్వాడాలు పెట్టేటట్లు ఏర్పాటు చేయవలెను. ఇప్పుడు Upper Godavari Division లో నూగూరు, భద్రాద్రి తాలూకాలు ఉన్నవి. దాని District Forest Office యిదివరకు కూనవరంలో ఉండేది. దానిని రాజమండ్రికి మార్చినారు. ఇప్పుడు ఇళ్ళు లేక మార్చినారా అనినచో అక్కడ చాలమంచి బిల్డింగులు ఉన్నవి. మరి ఎందుకు మార్చినారో తెలియదు. కాని 100 మైళ్ళు వెళ్ళాలన్న T. A. లకు చాల అగుచున్నది. రాజమండ్రి ఆఫీసులకు చాలా అద్దెకూడా యివ్వాలి. కాన ఆఫీసును మరల కూనవరంకు మార్చాలని కోరుచున్నాను.

Sri G. SURYANARAYANA :— అధ్యక్షా! ఈ హరిజన డిమాండుపైన గౌరవనీయులైన ప్రగడ కోటయ్యగారు ఒక విషయము తీసుకవచ్చారు. వెనుకబడిన కులాలు అన్నీ ఉన్నాయి, కాని హరిజనులే ఎక్కువగా మాట్లాడుతున్నారు, చాలా ఆవేదనతో మాట్లాడుతున్నారు, అట్లా మాట్లాడకూడదు, అన్నికులాలు కూడా ఆర్థికంగా వెనుకబడి ఉన్నాయని చెప్పారు. అది నిజమే. మన ఆంధ్రదేశములో 100 కి 95 మంది ఆర్థికపరిస్థితి బాగుగాలేక చాలా వెనుకబడి ఉన్నారని, తిండి బట్టలేక దరిద్రనారాయణులుగా ఉన్నారని అందరికి తెలిసినవిషయమే. అందులో ఎక్కువ బాధ పడేవారు ఉన్నారని వారు గుర్తించుకోవాలి. ఇప్పుడు ఈ ఎరుకలు యానాది మొదలైన వెనుకబడిన జాతులకు సంఘములో ప్రాధాన్యము ఉన్నది. ఎందుకంటే వీరు [illegible]

కము చేసుకొనవచ్చు. కాని ఈ హరిజనులు బ్రాహ్మణీలు వేయించుకొని అమ్మకమునకు పోయినప్పుడు ఎవరైనా "నీవెవరవు" అని అడిగినప్పుడు, నేను హరిజనుడను అని చెప్పినప్పుడు దూరముగా పొమ్మనెదరు. ఆఖరుకు పొలములో కష్టపడి చెమటోడ్చి పండించిన పచ్చిబియ్యమునుకూడా గడపదాటి లోపలకు తీసుకవెళ్ళుటకు వీలులేదు. కనుక యీ పరిస్థితులలో హరిజన డిమాండుపైన హరిజనులు మాట్లాడుతున్నప్పుడు ఇటువంటి ప్రస్తావన తెచ్చినందుకు చాలా విచారిస్తున్నాను. ఈ విషయమును నా సోదర సభ్యులేకాకుండా మంత్రిగారుకూడా గుర్తించవలెనని విజ్ఞప్తి చేయుచుంటిని. ఆంధ్ర దేశములో వారి అభ్యుదయమునకు అనేక పథకములువేశారు. ఈ పథకము వేయడము దానిపై తర్జన భర్జనలు జరుగడమే గాని ఏ విధముగానైనా ఈ సూచనలను సరిగా అమలుజరిపి హరిజనుల పురోభివృద్ధికి ఏ మాత్రము చర్యతీసుకొన్నట్లు కనబడడము లేదు. ఇక పోతే అంటరానితనము. అది మనకు అందరకు తెలుసు. దానివల్ల చాలా బాధపడుతున్నారు. అయితే బంజరు భూములను హరిజనులకు ఉచితముగా యిస్తామన్నారు. హరిజనులు దరఖాస్తులు పెట్టుకున్నప్పటికి వాళ్ళకు భూములు యివ్వడములేదు. అయితే బీదవారు అయిన హరిజనులచేత దరఖాస్తులు పెట్టించడము, సర్వే నెంబర్లు యిప్పించడము, రు. 1000 లేక 800 ఇచ్చి పుచ్చుకోవడము జరుగుచున్నది. హరిజనులకు భూములుఇస్తాము అన్నప్పుడు వాళ్ళు 'మనము చాలా వెనుకబడి ఉన్నాము, మనకు ఆర్థికస్థోమతులేదు, అందువల్ల ఆర్థికస్థోమతతెచ్చుకొని, సంఘములో గౌరవమర్యాదలు తెచ్చుకొని తోటిప్రజలవలె మనముకూడా పెద్ద స్థాయిగా ఉంటామనే భ్రమతో హరిజనులు దరఖాస్తులు పెట్టుకున్నారు.

విజయనగరం ఎస్టేటులో 1950-వ సంవత్సరంనుంచి వేలకొలది హరిజనులు ఎంతో ఆశపడి ప్రభుత్వం బంజరు భూములను తరతరాలుగా వెనుకబడినవారమని, సాంఘికంగా ఆర్థికంగా వెనుకబడినవారమని మనలను ఉద్ధరించడానికి ఇస్తున్నది; ఇటువైన సంఘములో ఒక ఆర్థిక పరిస్థితి తెచ్చుకుని సంఘంలో గౌరవ మర్యాదలతో తోటి సోదరులవలె బైటకు వస్తాము అని బ్రహ్మాండమైన ఆశతో హరిజనులు దరఖాస్తులు పెట్టారు. వారికి గోష్పదమంత భూమికూడా లభించలేదు. అన్నీ తగవులే. ఇటువంటి పరిస్థితులలో హరిజన అభ్యుదయ కార్యక్రమం జరుగుతోంది. అదేవిధంగా ఇంట్లస్థలాల విషయములో అనేక బాధలు పడుతున్నట్లు మన కందరికి తెలుసును. హరిజనులకు ఏదో చేస్తున్నాం అని చెబుతున్నారు. హరిజనులకు జరిగే లాభం శూన్యం అని నేను భావిస్తున్నాను. ఈనాడు హరిజనులకు ఇంట్లస్థలాలు ఇచ్చేశాము; ఎంతోమందికి ఇచ్చాము అంటున్నారు. నేను విశాఖపట్నం జిల్లాలో 4, 5 తాలూకాలు తిరుగుతుంటాను. అన్ని విధాల కనుక్కుంటున్నాను. అన్ని గ్రామాలలోను దరఖాస్తులు పెట్టుకున్నాం అనడమే కాని ఒక గ్రామంలో కూడా గోవుపాదమంత భూమికూడా రాలేదని రిపోర్టులు వస్తున్నాయి. అదేవిధంగా మంచినీటి బావులు కూడా లేవు. ఒకగ్రామంలో ఒక కోనేరు వున్నదనుకోండి. అక్కడికి హరిజనులు వెళ్ళడానికి లేదు. హరిజనుల housing scheme అన్నారు. పూరికొంపలు తీసివేసి ఎత్తు అరుగులతో ఇండ్లు కట్టుకోండి, దీనికి రు 500 లు ఇస్తాము అన్నారు. రు 250 లు ఉచితంగా ఇస్తాము; మిగిలిన రు 250 లు ఋణము రూపంగా ఇస్తాము అన్నారు. కొన్నాళ్ళ వ్యవధిలో తీర్చుకోవచ్చును అన్నారు. పంచ

వర్ష ప్రణాళికలో తీర్చుకోవచ్చును, పంచవర్ష ప్రణాళికలో వేసాము అన్నారు. ఈనాటికి పనిజరగడంలేదు. జిల్లా కమిటీలో మేము అడిగితే దీనిని గవర్నమెంటు త్రోసిపుచ్చారు అన్నారు. ఇటువంటిది హరిజన అభివృద్ధి కార్యక్రమం. హరిజన అభివృద్ధి కార్యక్రమము వేసుకొని లక్షలు ఖర్చు చేస్తున్నాం అంటున్నారే కాని హరిజనులకు అభ్యుదయం కలుగుటలేదు. బ్రిటిషు వారి హయాంలో ఎట్లావున్నామో అదేవిధంగా స్వాతంత్ర్యం వచ్చిన తరువాతకూడా అంటరానితనం మొదలైన వాటితో అనేక బాధలు పడుతూ క్రుంగి కృశించి వున్నాము. ఈపరిస్థితులను ప్రభుత్వం గుర్తించి ఆర్థికంగా పైకి రావడానికి హరిజనులకు బంజరుభూములను ఇచ్చి వీటిని బాగుచేసుకోడానికి సహకార సంఘాల ద్వారా ఋణాలు ఇచ్చి సహాయపడాలని, వృత్తులు కల్పించడానికి సహాయపడాలని కోరుతున్నాను. Co-operative Marketing Societies పెట్టి వారికికూడా ధనసహాయం చేసి వృత్తులు, వ్యాపారం, చేతిపనులు నేర్చుకునే అవకాశం ఏర్పరచి ఈ 5 సంవత్సరాలలో ఎక్కువగా హరిజన అభ్యుదయమునకు కృషిచేస్తారని కోరుతున్నాను.

**Sri V. KAMAYYA:**— అధ్యక్షా, ఈ శాసన సభలో ఇదే ప్రథమంగా నేను మాట్లాడడం. ఈవేళ హరిజనోద్ధరణపైన సభ్యులందరూ చాలా విషయాలు మాట్లాడారు. నేనుకూడా రెండు విషయాలు మాట్లాడాలని వచ్చాను. 1921 లో బ్రిటిషు గవర్నమెంటువారు లేబరు డిపార్టుమెంటును స్థాపించారు. దానిని 1935లో అనుకుంటాను, Harijan Welfare శాఖగా ఏర్పాటుచేశారు. దీనికి ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలో Harijan Welfare అనే పేరు మార్చి Social Welfare అని పేరుపెట్టారు. దీనికి కారణం ఏమిటో తెలియకుండా వున్నది. హరిజనులకు ఈ ప్రభుత్వంలో ప్రాతినిధ్యం వున్నదా, లేదా అనే విమర్శ ప్రజలలో కలిగింది. ఇకముందు మన కాంగ్రెసు ప్రభుత్వం దీనిని ఏమిచేయదలచారో తెలియకుండా వున్నది. హాస్టల్సు విషయం చూస్తే చాలా అధ్వాన్నంగా వున్నది. చాలా mismanagement జరుగుతోందని చెప్పారు. చాలామంది సభ్యులు hostels వుండకూడదని హరిజనులు అభివృద్ధిచెందకూడదనే వుద్దేశ్యంతో వున్నారు. ఇటువంటిది ఎందుకు వచ్చిందో నాకు అర్థం కావడంలేదు. గాంధీగారు హరిజనులను ఉద్ధరించాలని ఘోషిస్తే ఈనాడు గాంధీగారి సిద్ధాంతాలను అనుసరించే సభ్యులు - వారి శిష్యులం అని చెప్పుకునేవారు హరిజనుల హాస్టల్సు మూసివేయాలని, హరిజనుల అభివృద్ధి నిరోధించాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నట్లు వింటున్నాము. దీనికి కారణం ఏమిటో నాకు అర్థంకావడంలేదు. వీరందరూ కమ్యూనిస్టులని ఉద్దేశ్యమట! హరిజనులు కమ్యూనిస్టులుకారు. అగ్రజాతివారే కమ్యూనిస్టులని నేను అంటున్నాను. వారే హరిజనులను కీలుబొమ్మలుగా చేసుకొని, రాజకీయపార్టీలను ఆడిస్తున్నారు. కాని హరిజనులలో కమ్యూనిజంలేదు. మమ్ములను అందరిని ఎంతవరకు అభివృద్ధిలోనికి తీసుకురావాలో చాలాదూరంగా ఆలోచించాలి. ఎంతచేసినా మాకు తృప్తికరం కాదనే అంటున్నాను. ఎందుచేతనంటే మేము చాలా దూరంగా వున్నాము మీకు అన్నివిషయాలలో. విద్యావిషయకంగా, ఆర్థికంగా మీకు చాలా దూరంగా వున్నాము. మీరు మీ మనస్సులను మార్చుకుని ఉదారంగా, మమ్ములను మీ బిడ్డలవలె - తప్పుచేసిన బిడ్డలను ఏ రకంగా మంచి మార్గాలకు త్రిప్పుతుంటారో - ఆ రకంగా ఆదరించి, మమ్ములను మంచి మార్గాలలోనికి తీసుకువెళ్ళి వృద్ధిలోనికి తీసుకువస్తారని ఆశిస్తున్నాను.

22nd July 1955]

Sri B. APPARAO:— అధ్యక్షా, సంక్షేమశాఖ పద్దుమీద మాట్లాడే అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞుణ్ణి. సమయం చాలదు. నేను ముఖ్యంగా గిరిజనుల సమస్యలను గురించి మీ ద్వారా మంత్రిగారి దృష్టికి తీసుకురాదలచినాను. గిరిజనుల సభలు జరిపి గిరిజనుల నివేదికపై శ్రీ కొండయ్య, శ్రీ కంఠం గార్లను శ్రద్ధతీసుకొని రాజేంద్రప్రసాదుగారి దగ్గరకు పంపారు. దానిమీద మద్రాసు ప్రభుత్వంవారు శ్రీ మలయప్పన్ గారి అధ్యక్ష్యమున ఒక కమిటీ వేశారు. Enquire చేసి చాలా సూచనలు ఇచ్చారు. ఆ సూచనలు అమలుచేయడానికి ప్రభుత్వం ముందుకు రాకుండా వున్నది. మాకు సంపదలు లేవు; వెనుకబడినవారము అని పదేపదే ప్రభుత్వదృష్టిలోనికి వస్తోంది. మంత్రిగారు చెప్పారు 5½ లక్షల గిరిజనులు వున్నారు అని. సమాచారం రాకుండా census లెక్కలలో చేరకుండా, ఇంకా 2½ లక్షల మంది తూర్పుకనుమల్లో వున్నారని మనవి చేస్తున్నాను.

తూర్పు కనుమలు ప్రభుత్వం దృష్టికే రావడంలేదు. ఒక ఉదాహరణ మనవి చేస్తున్నాను. అర లక్ష జనాభా వున్న గూడెం ఏజన్సీలో యిటీవల 3 వేల వోట్లతో మచ్చరాజు గారిని ప్రజలు ఎన్నుకున్నారంటే అక్కడ ప్రజలు అంతేవున్నారా అని అడుగుతున్నాను. అక్కడ ప్రభుత్వ పరిపాలన నామమాత్రముగ వున్నది. ప్రభుత్వానికి సరైనంత పరిపాలన లేదు. అక్కడ వున్నది రావణాసురిడి పరిపాలన అని చెప్పడానికి చింతించవలసి యున్నది. అక్కడ పోలింగు స్టేషనుకు 5 రోజులనుండి వచ్చిన వారికి చదువులేదు, vote లేదని తరిమేశారు. అక్కడ ప్రభుత్వం అంతా మురాదారుల చేతులలో వున్నది. బర్సింగు గ్రామంలో గూడెం agency ప్రజలు ముఠాదారుకు ఓట్లు ఇవ్వనందుకు ఇళ్లు తగల బెట్టించారు. రాజాజీ ప్రభుత్వం "conduct enquiry and send report" అని వ్రాసినప్పటికీ యిప్పటికి enquiry లేదు. రిపోర్టు వెళ్ళడంలేదు. అక్కడకు ఆఫీసర్లెవరూ మలేరియా భయంవల్ల వెళ్ళరు. అక్కడ పుసులూరి కోదండరామయ్య, రెబ్బాప్రగడ మంగేశ్వరశర్మ గార్లు త్యాగంచేసి, శరీరం ఆహుతి చేసుకుని మాతోపాటు వచ్చి, అప్పుడప్పుడు నివేదికలు యిచ్చినా యీ ప్రభుత్వము తగినంత శ్రద్ధ తీసుకోనలేదు. ఇచ్చిన సూచనలు అమలు పరుచలేదు. అక్కడ కాఫీ తోటలు ఎక్కువగా వేయవచ్చు. జీడిమామిడి తోటలు అభివృద్ధిచేస్తే ఆర్థికంగా అభివృద్ధి చేయవచ్చు. ఈ సూచనలు అమలు పరిస్తే ప్రభుత్వానికి లాభదాయకంగా వుంటుంది. Burma నుంచి వచ్చినటువంటి, South-East Asia నుంచి వచ్చినటువంటి కాందిశీకులకు పని కల్పించవచ్చు. తగినంత పెట్టుబడి పెడితే Western ghats కు వలెనే తూర్పు కనుమలనుకూడ బంగారు చేయవచ్చును కనుక ప్రభుత్వం ఒక ప్రత్యేక కమిటీవేయగోర్తాను. ఉత్తరాంధ్రలోగల ఖనిజ సంపదలను వినియోగించుకో వచ్చు. తరువాత యీ agency ప్రాంతాలలో ముఠాదారుల పలుకుబడి హెచ్చుగ మన్నది. అక్కడ న్యాయ పరిపాలనలేదు. న్యాయ, కార్యనిర్వాహణ శాఖను విభజించాలి. కర్రయున్నవాడిదే బర్రె అయివున్నది. రాజలాంఛనాలు ప్రకాశం ప్రభుత్వం రద్దు చేసినప్పటికీ అక్కడ ముఠాదారులు ప్రభుత్వోద్యోగులకు సహాయిదారులై, వారు వీరు కలిసికట్టై రాజ లాంఛనాలు వసూలు చేస్తూ, జరిమానాలు విధిస్తున్నారు. ఈ విధంగా ముఠాదారులు, అధికారాలు చేతబట్టి ప్రజలను దోచుకుంటున్నారు. ఈ అరాచకాన్ని

తొలగించి ఆ ఏజెన్సీ ప్రాంతాలలోని గిరిజనులకు న్యాయం కలుగజేయవలసినదిగా ప్రభుత్వమును కోరుతూ విరమిస్తున్నాను. జైహింద్.

**Sri P. KODANDARAMAYYA** :— అధ్యక్షా, గిరిజనులయొక్క విషయం ప్రపంచంలో చాల తక్కువగా తెలసినదని నేను ఊహిస్తున్నాను. వారి విషయంలో యిప్పుడు యిక్కడ చాలా తక్కువగా ఎవరో ఒకరిద్దరుతప్ప విశేషంగా చెప్పలేదు. ఐతే యిది ఆట్టే చెప్పనక్కరలేదు. Social Welfare మంత్రి లచ్చన్న గారికి బాగా తెలుసును. ఐతే ఒకటే విశేషం. ఆట్టే చెప్పడం కోసం కాదు. ఇందాకా మన అప్పారావుగారు చెప్పినట్లు 34, 35 సంవత్సరాలునుంచి యీ ప్రాంతంలో పనిచేస్తూ సేవచేస్తున్నాను. ఒక కమిటీని మలయప్పన్ గారి అధ్యక్షతను వేశారు. ఆ కమిటీ ఒక రిపోర్టు యిచ్చారు. స్కీము తయారుచేశారు. ఆ స్కీము 3, 4 సంవత్సరాలనుంచి రాజకీయపరిస్థితులవల్ల అమలులోనికి తీసుకురాకపోవడం చాల విచారకరం. భద్రాచలంకు Deputy Minister గారు వచ్చినపుడు ఆయనకుకూడా చెప్పాను. స్వయంగా ఖ్జూగారికి చెప్పాను. ఇంతవరకు ఏమీరాలేదు. మంత్రిగారు దీనికోసం ప్రయత్నించాలని కోరుతున్నాను. అదే కాకుండా మొన్న ప్రశ్నల సందర్భంలో Planning మంత్రిగారు, ఏజన్సీలగురించి చెప్పారు. లచ్చనగారు చాల గొప్పప్లాను తయారుచేసి యీ గిరిజనులకు గృహావసతి కల్పిస్తారని, అలాంటిది చేయాలని కోరుచున్నాను. ఇక్కడ మనుష్యులు బట్టలుకూడా వేసుకోలేని హీనస్థితిలో వున్నారని మనవిచేస్తున్నాను. ఏడాదికొక బట్టకట్టుకుంటూ, అది మాసినా చిరిగినా విడువక కాలక్షేపం చేస్తున్నారు. వీరిస్థితి అభివృద్ధి చేయడానికి ఎంతయినా కృషిచేయాలని ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

**Sri K. APPA RAO** :— అధ్యక్షా! గౌరవ సభ్యులంతా భూభాగంమీద వెనుకబడి నటువంటి జాతులగురించి మాట్లాడారు. నేను జలభాగంమీద ఆధారపడిన వెనుకబడిన జాతులగురించి మాట్లాడదలచుకున్నాను. ఆంధ్రదేశంలో ఒక పెద్ద సరస్సున్నది. అది కొల్లేరు సరస్సు. చాల విశాలమైనది. అక్కడ లంకలలోని ప్రజల జీవితము దుర్భరంగా దారుణంగా, నికృష్టంగా వున్నది. అక్కడ ఆరోగ్య వసతులు ఎంతమాత్రం లేవు. అక్కడ వడ్డీలు, హరిజనులు, అగ్నికుల క్షత్రియులు యింకా వెనుకబడిన జాతులు చాల నికృష్టమైన, హేయమైన జీవితం గడుపుతున్నారు. వారికి రాక పోకలు సౌకర్యాలు లేక యిబ్బంది పడుచున్నారు. కనుక వారు కైకలూరుకు వచ్చి పోవడానికి వీలుగా చేయాలని ఆందోళన చేస్తున్నారు. ఈస్కీములలో దానిగురించి కనిపించడంలేదు. అక్కడివారు విద్యలో చాల వెనుకబడి వున్నారు. అందుచేత education centres అక్కడక్కడ కొన్ని చోట్ల స్థాపిస్తే చాల బాగుంటుంది. అక్కడక్కడ primary education centres స్థాపించాలి. వారికి చేపలు పట్టుట ప్రధానవృత్తిగా వున్నది. వీరిమీద వలలనుబట్టి పన్ను వేస్తున్నారు. ఈ అన్ని వలలకు పని వుండదు. కాని అన్నింటిమీద పన్ను చెల్లించడం కష్టం. కనుక పట్టిన చేపలనుబట్టి పన్నువేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను.

తుపాను సమయాలలో, అర్ధరాత్రికాడ అనుకోకుండా వచ్చే తుపాను భీభత్సములో, మామూలుచోట్ల అయితే ఒక pucca building ఉండటం, తలదాచుకోవడం

ఉంటూ ఉంటుంది. ఆ లంకలలో ఇటువంటి buildingలు ఉండవు. తుఫాను భీభత్సంనుంచి తప్పుకోవాలంటే సమీపంలో వుండే లంకలోకి వెళ్ళి మధ్యన ఎక్కడ పడితే అక్కడకు పోవడానికి చుట్టు నీళ్ళు ఉండడంవల్ల వీలుకాకపోవడం, అలాగే తమస్తూఉండడం తటస్థించుచున్నది. కనీసం ఒక్కొక్క లంకలో ఒక్కొక్క building నిర్మాణంచేస్తే అది ఆరోగ్యానికో లేక వైద్యశాఖకో ఉపయోగపడేటట్లు చేస్తూ ఉండవచ్చును. తరువాత ఈ ప్రాంతంలో, ఈ మధ్య పంచవర్ష ప్రణాళికలో, ఒక రైలు మార్గం వేయించవలెనని శిఫారసు చేశాము. కైకలూరునుంచి ఏలూరుకు 12 మైళ్ళ దూరం. 12 మైళ్ళ దూరంతో ఆ వెనుకపడిన ప్రాంతం చాలా అభివృద్ధిలోకి రావటానికి చాలా వీలుగ ఉంటుంది. సెంట్రల్ గవర్నమెంటుకూడ ఒప్పుకొనుటకు వీలు ఉంటుంది. State plan లో కూడ మంత్రిగారు దానిని include చేయించి, ఈ ప్రాంతాన్ని ప్రత్యేకశ్రద్ధతో తిలకించవలసినదిగ నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అలా చేయడంవల్ల గుడివాడ, కైకలూరు, భీమవరం, నర్సాపురం, నాలుగు తాలూకాల ప్రయాణీకుల పేరు మీద మనము అంతాకూడ ప్రయాణం చేయడానికి వీలుగ ఉంటుంది, తేలిక అయిన రైలు మార్గం. చాలా చిన్నమార్గం. ఆరోగ్య విషయంలోగాని రాకపోకల సౌకర్యాల విషయంలోగాని, వాళ్ల వృత్తి విషయంలోగాని అనేక సమస్యల పరిష్కారానికి ఒక welfare officer ను నియమించి, ప్రత్యేక శ్రద్ధతో చూడవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను.

Sri RATHNAM:— అధ్యక్షా, మనమంత్రిగారు సెలవు ఇచ్చినట్లు హరిజనుల హాస్టల్సుకు ఇండ్లవసతుల గురించి కొద్దివేలు, నీటి వసతులగురించి కొన్ని వేలు, ప్రత్యేకం, ప్రత్యేకంగా ఎన్నో వేలుకాదు, లక్షలుకూడ ఖర్చుపెట్టుతూ ఉన్నామని ప్రసంగించారు. గాని ముఖ్యంగా మానవునికి, పేదప్రజానీకానికి, ఎవరికిగాని కావలసింది ఏమంటే త్రాగుటకు నీరు. నీరే ప్రాణాధారం. అనేక హరిజనవాడలలో చాలవరకు నీటిభావులులేవు. అయితే మా సోదరసభ్యులంతాకూడ ఈరోజు ప్రసంగించారు. అయితే వారిజిల్లాలో నీళ్ళు చాలా ముఖ్యంగా ఉన్నదేమో! మా చిత్తూరు జిల్లాలో, పలమనేరు, పుంగనూరులలో నీటి సమస్య తీవ్రంగా ఉంది. అది దాదాపు వందలాది సంవత్సరాలుగ జమీందారి ప్రాంతం. ఆ కారణంచేత జమీందారులు, 'స్వయంరాజా, స్వయంమంత్రి' అన్నట్లుగా ప్రవర్తించారు. హరిజనులకు, బీద ప్రజానీకానికి నీటివసతి కల్పించవలెను, లేక lands వాండ్లకు ఇవ్వవలెను, వాండ్లను కుదురుపాటుకు తీసుకొని రావలెను అని వాండ్లకు ఉండదు. వాండ్లను అడిగే దాతలు, ప్రభువులులేరు. జమీందారులదే ప్రభుత్వం. ఈ నాడు జమీందారి ప్రాంతములు ప్రభుత్వం స్వాధీనంలో ఉండేకారణంచేత ఆ జమీందారి ప్రాంతములలో వుండే పేద ప్రజానీకమే గాక హరిజనులు గిరిజనులు అందరు కూడ ఈ నాడు మన ప్రభుత్వాన్ని ఆశ్రయించవలసి ఉంది. సాధారణంగా మన మంత్రిగారు చెప్పేది ఏమంటే, ఈ నీటిభావులు తృతీయ పంచవర్ష ప్రణాళికలో చూపించాము, నూటికి 50% లేక 75% ప్రభుత్వం ఇస్తుంది. 25% వారు సహాయం చేసి ఆ బావులు త్రవ్వించుకొని నీటివసతులు కల్పించుకొనవచ్చునని, వేలాది సంవత్సరాలుగా భూమిలో స్థాపనపడి పోయిఉండే, బీదప్రజానీకం, హరిజనులు

ఈ నాడు తినుటకు తిండి, కట్టుటకు బట్టలేకుండ అవస్థపడుచున్న ఉండే సమయంలో, నూటికి 25% వాండ్లు ఎక్కడ ఇవ్వబోతారు? ఎక్కడ బావులు త్రవ్వించుకోబోతారు? అని నేను మనవిచేస్తున్నాను. ఇచ్చేటటువంటి 50%, 75% కూడ ఈయమని కలెక్టరు వద్దకువెళ్ళి కలెక్టరుని అడిగాను. అది ఏవిధంగా ఇస్తారు, కంట్రాక్టు విధంగా ఇస్తారా, లేక గ్రామంలో ఉండేటటువంటి సేవ గ్రామసీమల్లో, నలుగురినో అయిదుగురినో ఒక కమిటీమాదిరి ఏర్పాటుచేసి వాండ్ల స్వాధీనములో ఉంచి వాండ్లే ఆ నీటి భావుల వసతులు కల్పించే మాదిరిగా ఇస్తారా అని అడిగితే, అట్లా ఇవ్వము, పూర్తిగ చేతినుండి ఖర్చు పెట్టి నీటివసతికి భావులు కల్పించుకొని వాటిని గట్టిగా దిట్టపరచి, పూర్తిచేసుకొన్న తర్వాత వచ్చారంటే మేము ఇస్తామని చెప్పారు. లేకపోతే ఎవరైనా కంట్రాక్టు తీసుకోవాలి. కంట్రాక్టు విషయం ఎట్లా అంటే, అది పెద్ద పెద్ద మహారాజులుగా ఉండేవాండ్లు, బలవంతులుగా ఉండేవాండ్లు కంట్రాక్టు తీసుకోవాలి. ఇంతకుముందు వెయ్యి రూపాయలు ఖర్చు అయ్యేటట్లుగాఉంటే రెండు వేల రూపాయల కంట్రాక్టుగా ఉండేది. ఆ కంట్రాక్టు తీసుకొనే విషయంలో మొత్తం వాండ్లే ఖర్చు పెట్టుతూ ఉండిరి. ప్రభుత్వంనుంచి తర్వాత తీసుకుంటూ ఉండిరి. ఈ నాడు 75% ప్రభుత్వంద్వారా వాండ్లు తీసుకొని, 25% ఈ బీద ప్రజలవద్ద వసూలు చేసుకోవాలంటే, వాండ్లకు సాధ్యంకాదు. వీండ్లు ఇవ్వరు. వాండ్లు తీసుకోరు. కాబట్టి ఈ నీటి భావుల విషయమై పంచవర్ష ప్రణాళికలో చూపించినా ఇది ఎప్పటికీ ద్వితీయ పంచవర్ష ప్రణాళికగానే ఉంటుంది. ప్రజలు ఏమో ప్రజలుగానే ఉంటారు. నీటివసతి, భావులు కల్పించుకొనేందుకు మార్గంలేకుండా పోతుంది. కాబట్టి వేరే ఏర్పాట్లుచేసి, నీటిభావుల వసతి కల్పిస్తే బాగా ఉంటుందని మంత్రిగారితో మనవి చేస్తున్నాను.

**Sri M. POTHU RAJU** :— అధ్యక్షా, హరిజనుల uplift ను గురించి మా సోదరులు చాలామంది మాట్లాడి ఉన్నారు. హరిజన uplift జరుగలేదనే ప్రభుత్వంతో మనవి చేస్తున్నాను. కారణంఏమంటే హరిజనులు సాధారణంగా సవర్ణహిందువులలో షుమారు నూటికి 8, 10 కంటె ఎక్కువగలేరు. అదీకాకుండా ఈ హరిజనులంతరు కూడ భూస్వాముల చేతులలో ఉండి, వారి చెప్పుచేతిలలోనే వారి కూలిపనులు వారి భూమి పనులు వారినౌకరీలు యావత్తు చేసుకొని జీవించుతూ ఉన్నారు. అదే కాకుండా వారి దొడ్లలో కాపులుగాఉండి వారి తోటలలో, దొడ్లలో ఇండ్లు, పాకలు వేసుకొని జీవిస్తూ ఉన్నారు. కాబట్టివారి ఆధారాన్ని బట్టే జీవిస్తున్నారు. ఇటువంటి ఈ భూకామందులే ఇపుడు ప్రభుత్వములో ఉన్నారు కాబట్టి ఈ ప్రభుత్వమువారు భూకామందులను ఒప్పించి మా హరిజనులకు కావలసిన సహాకారము చేయవలసిందే గాని, మేము స్వతంత్రంగా చేసుకొనేటటువంటి అవకాశం ఏమి కనబడలేదు. అందుచేత ఇపుడు హరిజన uplift అని చెప్పేసి మా హరిజన సోదరులందరు చాలామంది మాట్లాడినప్పటికి మేము స్వతంత్రముగా చేసుకొనే శక్తి, ఇపుడుకాదు, మరి ఎప్పటికి కూడ ఉండదు. ఎప్పటికైనా భూకామందులవల్ల, ప్రభుత్వంవల్ల మాకు సహాకారం జరుగవలెనని పదే పదే మనవిచేస్తున్నాను. రెండవది, మా ప్రాంతములో Highways శాఖ పనులన్నికూడ చాలమంది హరిజనులే ఎక్కువగ చేస్తున్నారు. Highways శాఖ పనులను గురించి కంట్రాక్టు పద్ధతి లేకుండా ఆ సొమ్ము కూలి పద్ధతిమీద సంఘములకు ఇస్తామని

చెప్పి సుమారు సంవత్సరం క్రిందట ప్రభుత్వం తహసీల్దార్లద్వారా తెలియపరచిఉన్నారు. ఆ సంఘాలను గురించి రివిన్యూ ఇన్ స్పెక్టర్లు రిపోర్టు చేసి ఉన్నారు. అది ఏమైందీ ఇంతవరకు తెలియదు. కాబట్టి Highways శాఖ పనులు యావత్తు కంట్రాక్టు పద్ధతి లేకుండా కూలి సంఘాలకే ఇస్తారని ఆశతో కూలి ప్రజలందరు కూడ నిరీక్షిస్తున్నారు. తప్పకుండా ఆ ప్రకారం చేస్తారని ప్రభుత్వానికి నేను మనవిచేస్తున్నాను.

తరువాత హరిజనుల విషయంలో అనేకచోట్ల అనగా మాధవరపాలెం, కోటప్పకుట్ల, రామభద్రాపురం, పాతలేయపేట మొదలగు చాలా గ్రామాదులలో నివాస స్థలముల విషయమై దరఖాస్తులు పెట్టుకొన్నారు. కొన్ని గ్రామాలలో గాలివానలువల్ల చాలావరకు వారి కొంపలు కూలిపోయినాయి. కనుక నివాసస్థలాలకు దరఖాస్తులు పెట్టినటువంటివారికి Planning Officer ద్వారా తప్పకుండా స్థలాలు ఇప్పించవలెనని మనవి చేస్తున్నాను.

ఇంకొక్క విషయము మనవి చేస్తున్నాను. నరిసీపట్నంలో high school లో హరిజన విద్యార్థులు చదువుకొంటున్నారు. ఆ హరిజన విద్యార్థులు గ్రామాలలో భూ కా మం దు ల యొక్క పాకలలోను, వారి చేనులలోను, తోటలలోను, ఉంటూ, కొన్నాళ్ళు అక్కడ ఉండినతరువాత ఆ గ్రామమే వారి స్వగ్రామంగా భావించి, అక్కడ మునసబుద్వారా తాలూకా తహశీల్దారువద్ద సర్టిఫికెట్లు తీసుకొని అచ్చట హాస్టలులో ప్రవేశించినటువంటివారిని ఈ సంవత్సరం సుమారు 6, 7 గురిని నర్సీపట్టణం హాస్టలులోనుంచి తీసివేశారు. హాస్టలులో స్థానం ఇవ్వలేదు. ఈ విషయమై దరఖాస్తులు ఇచ్చుకొన్నాను. కనుక వెంటనే ఒక టెలిగ్రాము ద్వారా వారిని తిరిగి హాస్టలులో చేర్చుకోడానికి ఏర్పాటు చేయవలసిందని ప్రభుత్వమును కోరుతూ విరమిస్తున్నాను.

**Sri G. NAGESWARA RAO**:— అధ్యక్షా, హరిజన డిమాండుమీద చాలామంది సభ్యులు మాట్లాడారు. ఈ బడ్జెటులో ఒకటి ప్రధానంగా కనిపిస్తున్నది. హరిజన వెల్ ఫేర్ శాఖను రద్దుచేసి, దానిని social welfare శాఖలో కలిపి వేయడం అనేది హరిజనులపట్ల, ఆర్థిక, సాంఘిక విషయంలోను, అభివృద్ధివిషయంలోను; అన్ని విషయాలలోను చాలా తక్కువ అంచనావేసి, వారిఅభివృద్ధికి ఏలాటి ప్రాముఖ్యత లేకుండా అసలు ఈ హరిజన వెల్ ఫేర్ శాఖనే రద్దుచేశారనేది స్పష్టంగా తెలుస్తున్నది. హరిజనులు ఈరోజుకు కూడ సమాజంలో ఎక్కడో ఏ మూరుమూలనో అంటరాని వాళ్లుగా, మానవులుగా పరిగణింపబడక జంతువులకంటె కూడ తక్కువగా చూడబడుతున్నారుఅనేది శాసనసభ్యులందరికి తెలిసినవిషయమే. కనుకనే భారతదేశంలో ప్రత్యేకత అనేది హరిజనుల కొక్కరికే ఉన్నదనే విషయంకూడ అందరికి తెలుసును. అందుచేతనే ముఖ్యంగా ఈ హరిజనులను ప్రత్యేకంగా అభివృద్ధిచేయాలనే ఉద్దేశంతో ఒక ప్రత్యేక శాఖను ప్రభుత్వము ఏర్పాటుచేసింది. అటువంటిదాన్ని ఈ రోజున మరల వారే గుర్తించకుండా రద్దుచేయడం చాలా అన్యాయమని, ఘోరమని మనవిచేస్తున్నాను. కనుక ప్రభుత్వము ఈ విషయంలో దీర్ఘంగా ఆలోచించాలి. దీనికొరకు బయట హరిజన ప్రజానీకం సుమారు 31 లక్షలమంది ఎంత ఆందోళన చేస్తున్నారనేది గుర్తించి

ఈ Harijan Welfare శాఖను పునరుద్ధరించవలెనని కోరుతున్నాను. తరువాత ముఖ్యంగా గత సంవత్సరం Revenue Reserve Fund లో నుంచి, 10 లక్షల రూపాయలు హరిజనుల ఇళ్ళస్థలాలకుగాను ప్రకాశం మంత్రివర్గం కేటాయిస్తే ఆ 10 లక్షల Fund ను ఈరోజున గోపాలరెడ్డిగారి ప్రభుత్వం రద్దుచేసి ఇళ్ళస్థలాలకు 2,60,000 మాత్రం ఉంచారు. గత సంవత్సరం ఈ పది లక్షల Fund తో కూడ కలసి మొత్తము 13,60,000 రూపాయలలో ఇళ్ళస్థలాలకు ఏ జిల్లాలో ఎంతెంత ఖర్చు పెట్టిందిగాని ఎంత మిగలబోయిందిగాని ఈ వివరాలు మంత్రిగారు చెప్పలేదు. నేను అసెంబ్లీకివచ్చిన తరువాత ఈ 3 సంవత్సరముల కాలంలో ఎన్ని పిటీషన్లు నాద్వారా ప్రభుత్వానికి ఇచ్చానో వారికి తెలుసును. అట్లాగే తూర్పు గోదావరి జిల్లాలో కొన్ని వందల petitions వెళ్ళినప్పటికినీ ఏ కొద్దిమాత్రమే enquire చేయడం జరిగింది. చాల ఎక్కువ గ్రామాలలో enquire చేసినట్లులేదు. అసలు ఈ మొత్తములో ఎంత ఖర్చు పెట్టారో ఎంత మిగిలిపోయిందో కూడ చెప్పరు. ఈ ఇళ్ళస్థలాలు లేక ఎంతమంది రైతుల స్థలాలలోను భూస్వాముల స్థలాలలోను కాపురముంటూ వారికి వెట్టి చాకిరీ చేస్తూ తక్కువకూలితో బాధపడుతూ అగౌరవానికి, వాళ్ళయొక్క నిర్బంధాలకు, దౌర్జన్యాలకు గురి అవుతున్నారు. అటువంటి వాళ్ళే ఈ రోజున క్రొత్తస్థలాలకు petition పెట్టుకొన్నవారిలో ఉన్నారు. అదే విధంగా 20, 30 సంవత్సరాలనుంచి కూడ వెనుక బడిన తరగతులవాళ్ళు హరిజనులు ఈ ప్రభుత్వ P. W. D. Revenue పోరంబోకులలో ఇళ్ళుకట్టుకొని నివసిస్తున్నారు. వాళ్ళమీద అధిక పెనాల్టీ వేస్తున్నారు. వాళ్ళ ఇంటి ప్రక్కనే ఒక కొబ్బరిమొక్కగాని చింతమొక్కగాని వేసుకొంటే, ఒక్కొక్క దానికొక రూపాయి penalty విధిస్తూ అది త్వరగా చెల్లించకపోతే జప్తునోటీసులు యివ్వకుండానే యిండ్లను జప్తుచేస్తూన్నారు. జప్తు చేస్తున్నప్పుడు వాళ్ళేదైనా ఒకమాట అంటే వీళ్ళు జప్తుకు ఆటంక పరచారని కేసు పెట్టి ఆరువారాలు శిక్షవిధిస్తున్నారు. ఉదాహరణకు రాజోలు తాలూకా పొన్నమండలో ఒక హరిజనునికి ఎవిక్షన్ నోటీసు యిచ్చి ఆ రోజునే జప్తుచేయడము, ఆ రోజునే పోలీసు కేసు పెట్టడము ఆ మరునాడే రాజోలు మేజిస్ట్రేటు కోర్టులో 6 వారాలు శిక్షవిధించడము జరిగింది. ఈ విధంగా ఉంది పోరంబోకులలో కాపురం చేస్తున్నటువంటి హరిజనులయొక్క స్థితి. ఆ ప్రక్కనే పొలాలుగలిగినటువంటి పెద్దరైతులు భూస్వాములు పోరంబోకుల సర్వేరాళ్ళను మార్చివేసి ఆ పోరంబోకులను తమ పొలాలలో కలిపివేసుకొంటున్నారు. ఆ పోరంబోకులలోనే కాపురముంటూన్న హరిజనులకు మసలడానికి చోటులేదు. దూడలను గొళ్ళను మసలకుండా చేసి హరిజనులను చాల బాధలు పెడుతున్నారు. అందుచేత ఈ రోజువాళ్ళకు ఇళ్ళ స్థలాల గురించి చాలా ఆందోళనగా ఉన్నది. కనుక ఈ ఇళ్ళ స్థలాలకొరకు పెట్టినటువంటి పిటీషన్లను వెంటనే ఎంక్వైరీ చేసి స్థలాలను అక్వైరు చేసియివ్వాలి. గత సంవత్సరపు డబ్బునుకూడా యీ సంవత్సరం దీని యోగం చేసి ఇళ్ళస్థలాల కార్యక్రమాన్ని ఎక్కువగా తీసుకోనవలెనని కోరుతున్నాను. ఒక ఉదాహరణ చెప్పుతున్నాను– పిఠాపురం తాలూకాలో నవఖండ్రవాడ అనే గ్రామమున్నది. ఈ గ్రామ హరిజనులు 1946వ సంవత్సరములో 18 వందల రూపాయలు యిండ్ల స్థలాలకంటూ ప్రభుత్వమువారికి చెల్లించారు. కాని ఈ రోజుకుకూడా వారికి భూములు అక్వైరుచేసి ఇవ్వలేదు. ఇక ఇటువంటి కేసులు ఇతర జిల్లాలలోకూడ ఎన్నో వున్నాయి.

ఈనాడు ముఖ్యంగాఈ హరిజన హాస్టళ్ళ విషయం చూద్దాం. కొంతమంది ఈ హాస్టళ్ళను ప్రభుత్వం నడపాలని చెప్పారు. వారు ఈవిధంగా చెప్పడానికి కారణం ఈ హాస్టళ్ళలో నూటికి 99 ప్రయివేటు మేనేజిమెంటు క్రింద ఉన్నవి. ఇవి సక్రమంగా జరగడంలేదు. ఈ హాస్టల్సులో ఉన్నపిల్లలు, ఆ మేనేజరుకుగాని అతని భార్యకుగాని వెట్టిచాకిరి చేస్తూ వారి నిర్భంధనలకు గురిఅవుతూ భానిసత్వములో ఉంటున్నారు. నిజంగా అది చూస్తే పిల్లలు ఇంటిదగ్గర తిండి లేకపోయినప్పటికి బడికివచ్చి చదువుకుంటే మనశ్శాంతి, స్వేచ్ఛ వుంటుంది. కాని ఈ హాస్టల్సులో ఉంటే సరైనతిండిలేక వెట్టిచాకిరికి నిర్భంధాలకు గురికాక తప్పదు. అందుచేతనే ఈరోజు హాస్టల్సుఅన్నీ ప్రభుత్వమే తీసుకొని నడిపి ప్రభుత్వం ఇచ్చేటటువంటి grants ను సద్వినియోగ పరచాలనే ఉద్దేశంతోనే మేము ఆందోళనచేస్తూ వస్తున్నాము. ఈ రోజు ప్రభుత్వమువారు జిల్లా headquarters లో ఉన్న hostels ను మాత్రమే తీసుకొనే ఒక విధానాన్ని అవలంబించారు. ఈ సందర్భమున అన్ని జిల్లాలలోని ముఖ్యపట్టణాలలో ఉండే hostels ను ప్రభుత్వము తీసుకొనవలెనని కోరుతున్నాను. ఇంకా కొన్ని hostels ను బెజవాడ, కర్నూలు మొదలైన ప్రదేశాలలో ఉన్నవాటిని విడిచిపెట్టారు. వాటిని కూడ తీసుకోవలెనని కోరుతున్నాను.

ఇక ముఖ్యంగా యీ primary education విషయములో చూస్తే పిల్లలకు మధ్యాహ్నము భోజనము లేబరు స్కూళ్ళలో పెట్టుతున్నారు. ఇక హరిజనులు, వెనుకబడిన జాతులవారు Mission Schools లోనూ, Board Schools లోనూ, Aided Schools లోనూ కూడా చదువుచున్నారు. వాళ్ళకు మధ్యాహ్నము భోజనము ఏర్పాటుచేస్తే, ఎక్కువమంది వెనుకబడిన తరగతులవారు చదువటానికి అవకాశము వుంటుంది. ఈ విద్యార్థులకు స్కాలర్ షిప్పుల విషయములో విద్యార్థులు హాస్టళ్ళలో వుంటేనే, యీ స్కాలర్ షిప్పు గ్రాంటు యివ్వడము జరుగుతుంది. అసలు యిందులో ఒక రహస్యం ఉన్నది. హాస్టలు మేనేజరు ఆ హాస్టలులో భోజనము పెట్టడు. హాస్టలులో వసతి కలుగజేయడు. కాని హాస్టలులో వున్నట్లు పేరు మాత్రము మేనేజరుద్వారా పంపిస్తారు. వారికి స్కాలర్ షిప్పు మాత్రము గ్రాంటు చేస్తాడు. ఆ స్కాలర్ షిప్పు క్రింద 150 రూపాయలో, 180 రూపాయలో వస్తే, అందులో ఎక్కువ భాగము ఏ రు. 130 లో మేనేజరు తీసుకుంటాడు. తక్కినది ఆ విద్యార్థికి పంపుతాడు. రెండు మూడు సంవత్సరాలనుంచి కూడా ఈ విషయం గురించి మేము చెబుతూ వున్నాము. ఆ విద్యార్థి ఎక్కడ వున్నప్పటికికూడా స్కాలర్ షిప్పు యిస్తే, ఆ విద్యార్థికి ఉపయోగముగా వుంటుందని చెప్పాము. ఇదికూడా ప్రభుత్వమువారు గుర్తించారు.

తరువాత హరిజనులకు Societies వున్నవి. ఈ సొసైటీలకు అసలు ఆర్థికంగా సహాయము చేయడానికి ఏ బ్యాంకులుగాని, గ్రామాలలో వుండే ఏ credit సొసైటీలు కాని ఎవ్వరుకూడా యీ హరిజన సొసైటీలకు అప్పు యివ్వడములేదు. అందువల్ల గత ములో జరిగిన హరిజన శాసన సభ్యుల సమావేశములో ఒక తీర్మానముకూడా చేసి వున్నాము. హరిజనులకు, ముఖ్యంగా F. L. C. సొసైటీలకు గాను ఒక Co-operative Bank ను ప్రభుత్వమువారు స్థాపించి, దానిద్వారా యీ హరిజన సొసైటీలకు

అప్పులు యిచ్చేటట్లు సౌకర్యాలు కలుగజేస్తే, తిరిగి వచ్చే సంవత్సరములో వారికి ఉన్న సమస్యలు యీ అప్పులద్వారా తీర్చుకోటానికి అవకాశము వుంటుంది.

ఈ రోజున బడ్జెటులో 50 లక్షల రూపాయలు హరిజనులకు గాను కేటాయించి నప్పటికి, అందులో మన కూర్మయ్యగారు చెప్పినట్లు దాదాపు 50% వరకు ఉద్యోగస్తులకు గాను, అక్కడ establishment క్రింద ఖర్చు చేయబడుతున్నది. సుమారు 30 లక్షల రూపాయలవరకు యీ హరిజనుల అభివృద్ధికే ఉపయోగపడదనే విషయము వాస్తవమని శ్రీకూర్మయ్యగారు చెప్పినందుకు వారిని నేను అభినందిస్తూ విరమిస్తున్నాను.

Sri P. GUNNAYYA:—గత సంవత్సరముగాని, మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్నప్పుడుగాని, హరిజన సమస్య చాలా ప్రాముఖ్యమైనది కాబట్టిన్నీ ఇది గాంధీగారి సిద్ధాంతరీత్యా సగభాగము ప్రాముఖ్యత వహించింది కాబట్టిన్నీ, యీ డిమాండుమీద చర్చకు వచ్చినప్పుడు గత శాసన సభాధ్యక్షులు నల్లపాటి వెంకట రామయ్యగారు అయితేనేమి, అక్కడ శివషణ్ముగం పిళ్లె గారు అయితే నేమి, రెండేసి రోజులు చర్చకు అవకాశము యిచ్చేవారు. అదేపదవిని యిప్పుడు అధ్యక్షులవారు అలంకరించారు. ఈ సమయములో యీ హరిజనుల సమస్య చాలా ప్రాముఖ్యమైనది కాబట్టిన్నీ, ఇది గాంధీగారి సిద్ధాంతాలలో మొదటిది కాబట్టిన్నీ, యీ డిమాండుమీద రెండురోజులు చర్చించడానికి అవకాశము యివ్వమని అధ్యక్షుల వారిని ప్రార్థిస్తున్నాను.

Mr. SPEAKER:— పార్టీనాయకులందరూ కలసి యీ డిమాండుమీద చర్చకు నాలుగు గంటలు నిర్ణయించుకున్నారు గనుక ఆ నిర్ణయముమార్చే అధికారము నాకు లేదు.

Sri V. KURMAYYA:— పార్టీనాయకులలో హరిజనులు లేకపోవడము వల్ల యీ సమస్య అంత ముఖ్యమైంది కాదని తలంచి, అన్ని అయిటములు మాదిరిగానే దీనికిగూడా నాలుగుగంటలు చాలని వప్పుకున్నారని అనుకుంటున్నాను.

Sri T. VEERARAGHAVULU:— అధ్యక్ష మహాశయా, ఈ సాంఘిక సంక్షేమ పద్దును నేను బలపరుస్తూ కొన్ని ముఖ్యమయిన సూచనలు సవినయముగా మనవిచేస్తున్నాను. హరిజనుల సమస్య సాంఘిక, ఆర్థిక రంగాలకు సంబంధించి నటువంటిది. అంటే యిది social economic problem. అంటే దీనికి సంబంధించిన అభ్యుదయము రెండు భాగాలుగా వుందని భావిస్తూన్నాను. ప్రభుత్వమువారు చేయతగ్గ భాగము కొంత; అంతకంటెమించినది, విలువైనభాగము సంఘసంస్కర్తలు, దేశ సేవా తత్పరులు చేయతగినది. ఈ సమస్య చట్టాలరీత్యా పరిష్కరించబడేది కాదని నా నమ్మకము. అయితే హృదయ పరివర్తనతో యీ సమాజములో యీ విషయాన్ని గురించి కృషిచేయాలి. ఇంతవరకు ప్రభుత్వంలో మనకు అధికారము రాక ముందుకూడా, దేశసేవకులు ప్రముఖమైన భాగముగా జీవితములో సేవకు అంకితముచేస్తూ, హరిజనసేవే హరిసేవ అనే తత్వముతో చాలామంది కృషిచేశారు. కనుకనే యీ సభలో యింతక్షుముందు నిర్భయముగా, నిర్మొహమాటముగా వారియొక్క కష్టసుఖాలు, ఆవేదనలు

తెలుపుకోటానికి అవకాశంలభించింది. ఈసందర్భములో హరిజనులకు విద్యగురించి చేసిన సేవ అపారమైనది. ఎందుకంటె అక్షరముఅంటె దాని స్వరూపము యేమియు తెలి యని మేము విద్యావిహీనులుగా సాంఘికంగా వెనుకబడిన మేము యీ రోజున కొంత కాకపోయినా కొంతఅయినా చదువుకున్న వారము ఉన్నాము అని చెప్పుకుని సాహ సించి చెప్పుకునే స్థితిలోకి వచ్చామంటే, హరిజనులకొరకు ప్రభుత్వము చాలా డబ్బు వ్యయ పరిచింది. అందుకు ప్రభుత్వాన్ని నేను అభినందినిచుచున్నాను. ప్రభుత్వము తలపెట్టిన ప్రణాళికలకు అన్నిటికినీ నా హృదయపూర్వకమైన సహకారము యిస్తానని చెబుతూ వారి ఋణము నేను తీర్చుకొలేనని మనవి చేస్తున్నాను. ఇక సంఘసేవా పరాయణులు సంఘ సంస్కర్తలు మాకొరకు ఎంతోమంది వారి జీవితాలను బలిపెట్టిన వారు వున్నారు. వేమూరు రాంజీరావు పంతులుగారు, గూడూరు రామచంద్రుడుగారు, పిఠాపురం మహారాజాగారు, చల్లపల్లిరాజాగారు, యిటువంటివారుకూడా సంఘ సేవా పరాయణులుగా మాకోసము ఎంతో కృషిచేశారు. అయితే అంటరానితనమనేది ఒక మచ్చ. ఇది తీరని కళంకము. కాబట్టి దాన్ని గురించి విచారించకుండుట తప్పు అని అంటాను. ఒకానొకప్పుడు జాతీయ అహంకారము మంచిదికాదు, విచక్షణాభావం తప్పు, అని విజయలక్ష్మి పండిట్ వుపన్యాసము చేస్తున్నప్పుడు Dr. Malan దానికి సూటీగా చులకనగా చూస్తూ ఒక్కముక్క చెప్పాడు. అది యేమిటంటే "The pot calls the kettle black" అని అన్నాడు. విజయలక్ష్మి పండిట్ యీ జాతీయ అహంకారాన్ని గురించి, జాతీయ విచక్షణభావాన్ని గురించి మాట్లాడుతుంటే "కుండ నఖశిఖపర్యంతము నల్లగా వున్నప్పటికినీ, కాగు అడుగుభాగాన వున్న మసినిగురించి వెక్కిరించడమనే దానిమాదిరి ఉన్నది సుమా" అని వారు అవహేళన చేశారు. దీనిని భారత జాతి అంతా కూడా అవహేళనగా భావిస్తుందని, అది తీరని కళంకమనే సంగతి మాకు తెలియనివిషయముకాదు. అయితే అనాదిగా ఉంటూ ఉన్న సమస్య యిప్పుడు మనముందర వున్నది. దీనిని ఏ విధముగా పరిష్కారం చేయాలి అనేది ప్రశ్న. ఒక కొబ్బరికాయ నీరును సముద్రములో పోసి ఉప్పునీరు మధురజలముగా లేదని బాధ పడడం మంచిదికాదు. ఇప్పుడు దేశములో చేస్తున్న సేవ, విద్యారంగములో చేస్తున్న సేవ అంతాగూడా అపారమయింది. ఈ జాతి అంతా తరించటానికి నిర్దిష్టమైన సోపానాలు వేయడానికి వుపయోగిస్తుంది. శ్రేయోరాజ్యం, అందులో వర్గ, కుల, మతరహితమైన సమాజం స్థాపించుకొనటానికే యీ రోజున ప్రభుత్వములో నున్న వారందరు కంకణము కట్టుకొన్నారు.

రానైయున్న భూస్వామ్య సంస్కరణలవల్ల అయితేనేమి, తదితర శాసనాల ద్వారా అయితేనేమి, మా జాతికి కావలసిన పురోభివృద్ధి జరుగుతుందా లేదా అనే అనుమానం మాలో వున్నది. అయితే మనము నెమ్మదిగా పోవలసిన సంగతి నిజమే. జరిగిన సంగతి, జరగబోయే సంగతి తలచుకుంటే, అది కొద్దిఅనేమాట యదార్థమే. ప్రతిదానికి గూడా ధనము కావాలి. ధన లోపమువల్లనే అన్ని విషయాలు వెనుకబడి యున్నవి. ఇక ముఖ్యంగా ఒకటి రెండు విషయాలు మాత్రము మనవి చేస్తాను.

ఇళ్ళ సమస్యనుగురించి అనేకమంది సభ్యులు మాట్లాడారు, ఇళ్ళ విషయములో కేవలము మంత్రులను నిందించిన ప్రయోజనము లేదు. మనలో కేవలము ఒకరినొకరు దూషించుకొని లాభములేదు. అది అయ్యేపని కాదు. Land Acquisition చట్టము సవరించకుండా పనిజరిగేది కాదు. Land Acquisition Act ను house sites acquisition కు సంబంధించి సంతవరకూ, సవరించి యీ సమస్యను ముఖ్యమైనదిగా treat చేసి ఏమైనా emergency provisions ను పట్టుకొని వస్తేగాని, యీ acquisition అనేది సత్వరంగా జరగదు. అయితే మరి యే శాఖ అయినాసరే ఒక plan లేకుండా పనిజరుగుతుందా? మానవ లీడర్లు వుండాలి. వారికి జీతాలులేకుండా పనిచేస్తారా? జీతాలు లేకుండా పెట్టినట్లయితే అటువంటి అభివృద్ధి వస్తుందా? అది అంతా కూడా గమనించాలి. ఇక యీ ప్రభుత్వం వారుకూడా యీ విషయములో Central Government వారికి సిఫార్సుచేసి అయినాసరే, హరిజన నివేశనస్థలాల విషయంలో provisions అన్నీ గూడా లాంఛన ప్రాయముగా జరగకుండా, emergency provisions క్రింద అమలుపరచే పద్ధతి మీద దానిన్ని చేయడానికి ఆలోచిస్తే, ఇంతకంటె సత్వరంగా పనిచేయటానికి వీలు వుంటుందని అంటున్నాను. రు. 2,60,000 లు మాత్రమే యిళ్ళ స్థలాలకోసము కేటాయించినట్లుగా నాకు తెలుస్తున్నది. అయితే గవర్నరుగారి ప్రసంగములో పది లక్షల రూపాయలు కూడా యిచ్చినట్లుగా వున్నది. ఇదికూడా అందులో కలిసివున్నదేమో తెలియదు. ఈ విషయమును మన మంత్రిగారు నిరాశపరచరు అని అనుకుంటున్నాను.

ఇక యీ హరిజనులయొక్క వృత్తి ప్రాతిపదికగా చేయకుండా వ్యవసాయ కూలీలుగా కొంతమందిన్నీ, చర్మకారకులుగా కొంతమందిన్నీ వుంటున్నారు. ఈ వ్యవసాయ కూలీలకు వేతనముల వసతులు చేయడము, తగినంత హెచ్చుభాగం వచ్చేటట్లు ఒక చట్టము తెచ్చి అమలుపరచేట్లుగా చేయాలి.

రెండవది యీ వ్యవసాయ కూలీలకు సంబంధించినంతవరకుకూడా వీరికి ఋణ విమోచన చట్టము ఒకటి తీసుకొని రావలసిందిగా కోరుతున్నాను. చర్మకారకులకు సంబంధించినంతవరకు వారికి కావలసిన వృత్తికి అనుగుణంగా ఒక cottage industry ని ఏర్పాటు చేయవల్సిందిగా కోరుతున్నాను. చర్మకారకులకు కేటాయించటానికి భావించతగిన సొమ్మును కేటాయించి, యీ చర్మకారకవృత్తికి కావలసిన ఎగుమతి దిగుమతి సౌకర్యాలు, marketing facilities వగైరాలు కలుగజేయటానికి వారికి తగినంత ప్రోత్సాహము యిచ్చినట్లైతే, వారి వృత్తిని అభివృద్ధిలోకి తెచ్చుకోగలుగుతారు. ఈ విధంగా చేస్తే, దేశములో యీ చర్మకారకవృత్తిని చేసుకునేవారందరికి ప్రభుత్వము పని కల్పించినవారలవుతారు. ఆ విధంగా చేస్తే వారు వ్యవసాయవృత్తిని చేసుకుంటూ, యింకను వారికివున్న టైము యీ వృత్తికి వుపయోగించగలరు. ఆవిధంగా చేస్తే, వారికి చేతినిండా పని వుంటుంది. కడుపునిండా తిండి కలిగించుకునే శక్తివస్తే, వారి పిల్లలను చదివించుకోటానికి వీలు కలుగజేసుకుంటారు.

ఇక హాస్టళ్ళను గురించి కొంతమంది సభ్యులు మాట్లాడారు. నేను ఒకటే సంగతి చెప్పదలచాను. హాస్టళ్ళు నడపడము అంటే, డబ్బుతో కూడుకున్న విషయము.

డబ్బుఅంటే చేదుకాదు. ప్రతివాడికి మానవస్వభావము, మంచిదిగాని, చెడుదిగాని వుంటుంది. అది సక్రమంగా వుపయోగించుకొనే బాధ్యత వ్యక్తిదే. మానవులు అందరు గూడా జితేంద్రియులు కారు. అక్కడక్కడ పొరబాట్లు వుండవచ్చు. కాబట్టి ప్రభుత్వము వారు ఒక విషయము మాత్రము గుర్తించాలి. ప్రభుత్వమువారు యీ హరిజనులకు ఎట్టి సహాయము చేయకపూర్వము నుంచీ హరిజనులకు విశేషంగా సేవచేసిన సంఘ సేవాపరాయణులు చాలామంది వున్నారు.

నేను పది సంవత్సరాలపాటు హరిజన హాస్టలులో వుండి 8 వ తరగతినుంచి B. A. వరకూ చదువుకున్నాను. అందువల్ల యీ హాస్టళ్ళ సంగతి నాకుగూడా కొద్దో గొప్పో తెలుసును. ఈ హాస్టళ్ళు నడిపేవారికి యిదే బ్రతుకుతెరువు అని చులకనగా మాట్లాడడం భావ్యంకాదు. ఈసంవత్సరం ప్రభుత్వంవారు అమలుచేసిన విధానాన్ని బట్టి ప్రభుత్వమును నేను హృదయపూర్వకముగా అభినందించలేకుండా ఉన్నాను. కాబట్టి ప్రభుత్వము యీ విషయము కొంచెము ఆలస్యము అయినా సరే, జాగ్రత్తగా పునరాలోచించి, తొందర పడకుండా యీ విధానాన్ని అమలుపరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుచున్నాను.

*Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, మొట్టమొదట 5 నిముషములలో ముగించాలని అన్నారు. నేను దానికి కట్టుబడి వుండటానికి ప్రయత్నిస్తాను. ఇప్పుడు ఈ శాఖపేరును సంక్షేమశాఖగా మార్చారన్నారు. హరిజన సంక్షేమశాఖ అనేదానికి ఆడిటర్ జనరలు object చేశారు అని చెబుతున్నారు. దానికి కారణము ఏమిటో తెలియడం లేదు. దానిని ఆడిటర్ జనరలు మార్చమన్నారనే మెమోరాండములో వున్నది. అది 1955–56 బడ్జటు మెమోరాండములో, 82వ పేజీలో, మొదటి పేరాగ్రాఫ్‌లో, రెండవ లైనులో వున్నదని చెప్పి మనవిచేస్తున్నాను. అందువల్ల అసలు ఇది ఎందుకుమార్చారో, లెఖ్ఖల్లో ఏమి చిక్కులు వచ్చాయో నాకు అవసరము లేదు. సాంఘికఅభివృద్ధి తీసుకు వస్తున్నామని చెప్పడము నాకుకూడా సంతోషముగా వున్నది. మనము శ్రేయోరాజ్యాన్ని తీసుకు వస్తున్నాము గాన వెల్‌ఫేర్ శాఖగా మార్పు తీసుకొనిరావడం బాగానేవుంది. వెల్‌ఫేర్ స్టేటుకు ఏది అయితే అడ్డంగా ఉన్నదో దానిని ముందు పునరుద్ధరించితే గాని ఇది శ్రేయోరాజ్యముకాదు అనే ఉద్దేశ్యముతో దీనిని మార్పు చేసినట్లయితే చాలా సంతోషము. అంతవరకు బాగానే ఉన్నది. కాని ఒక విషయం ఉన్నది. సంఘములో దీనాతిదీనంగా చూడబడుచున్న, అనేక ఇబ్బందులు పడుతున్న జనానికి సంబంధించిన సమస్య ఇది. వారిలో మార్పు రానిదే ఈ సమాజములో ఏమీ మార్పు రాదని నా అనుభవమువల్ల చెబుతున్నాను. ఇది అందరూ కూడా ఒప్పుకునే విషయము. ఇది అన్ని వైపుల జరుగుతున్నదే. కాని పల్లెలలోకి వెళ్ళిచూస్తే వాళ్ళకు కూర్చోడానికి చోటువుండదు. పడుకోడానికి చోటువుండదు. ఈ విధముగా బాధ పడుతున్నారు. ఒక బిడ్డను కంటే వాని గతి ఏమవుతుందో తెలియదు. వాడిని పడుకోబెట్టడానికి చోటు వెతుకవలసి వస్తుంది. క్రిందటి పర్యాయము రాష్ట్రీ హరిజన సంక్షేమసంఘ సమావేశంలో హరిజనుల గృహావసతులకు 12 లక్షల రూపాయిలు కేటాయించామన్నారు. ఈ బడ్జటులో 2 లక్షల రూపాయిలు ఇచ్చామన్నారు. ఆ డబ్బు ఏమైనదో తెలియడములేదు. హరిజను

(Sri Vavilala Gopalakrishnayya) [22nd July 1956

లకు ఇండ్ల స్థలములు ఇస్తామంటున్నారు. ఇండ్లుకట్టికూడా ఇస్తామంటున్నారు. కట్టి ఇవ్వనవసరములేదు. వాళ్ళకు స్థలాలుకొని ఇస్తామంటున్నారు. కాని ఇవ్వనవసరములేదు. వాళ్ళు దరఖాస్తులు పెట్టుకొన్న స్థలాలు ఎక్వైర్ చేసి వాళ్ళు ఇండ్లు కట్టుకోడానికి హామీ ఇస్తే సంతోషిస్తాను. అది ఇవ్వకుండా పసన పద్ధతి జరుగుతోంది. దానికి కారణము అప్పం ప్రభుత్వముకాదు. దానికి కారణము సవర్ణహిందువులు కూడాని చెబుతున్నాను. వాళ్ళు అవస్థ పడుతున్నారు గదా అని దయదలచి ఒక్కడు కూడా తెన స్థలం యిండ్లకు ఇవ్వడు. దీంట్లోవున్న అధికారులు కూడా దీనికి బాధ్యులు. పైగా అధికారుల దగ్గరకు వెళ్ళిన కాగితమురాదు. నాకు అనుభవము ఉన్నదికాబట్టి చెబుతున్నాను. కాగితముకోసం తాలూకా ఆఫీసుకు పోతే గుమాస్తాకూడా అట్లానే కూర్చొని కాగితము ఇవ్వడు. ఎక్వైర్ అయినట్లు ఆర్డరు వచ్చింది. నేను అక్కడకు వెళ్ళితే తరువాత వెల్ ఫేర్ ఆఫీసరుచూచి మీరు ఎందుకు వచ్చారు అని అడిగాడు. అప్పుడు ఆ గుమస్తా ఇది పెద్దవాళ్ళ చేతుల్లోకి పోతోందిరా అని చెప్పి అంతకు ముందు 100 రూపాయిలు తీసుకున్న వాడల్లా అవి తిరిగి ఇచ్చి వెంటనే ఆ కాగితము ఇచ్చాడు. ఇది ప్రధాన సమస్యగా వున్నది. టైము తక్కువగా ఉన్నది కాబట్టి మలయప్పన్ కమిటీని గురించి నేను ఎక్కువగా చెప్పవక్కరలేదు. దీనిని సక్రమంగా సిఫార్సులు ఏరియాలలో అమలు జరుపగలిగితే మనము ఒక సత్ఫలితాన్ని సాధించగలిగినట్లే. దానిని గురించి నేను ఎక్కువగా చెప్పదలచలేదు. బోయ తెగవారు వడ్డెర అని వ్రాసుకుంటే ఎందులోనూ కూడా వారికి కన్సెషను ఇవ్వటములేదు, దొంగబోయఅని వ్రాసుకుంటే ఇస్తున్నారు. దరఖాస్తు పెట్టుకునేప్పటికి పరీక్ష రోజు వస్తుంది. ఇన్ని రోజులకు కూడా డబ్బు కడుతావా కట్టు లేకపోతే absent వేశాను పొమ్మంటాడు. ఏడుస్తూ ఏది అయినా అమ్ముకొని ఏదో చేసి పరీక్షకు రుసుము కట్టి ప్యాసు అవుతాడు. అట్లాంటిదే నాకు అనుభవం వున్నది. గైరు హాజరు గుర్తింపబడిన రోజులకు మెడికల్ సర్టిఫికెట్లు తెచ్చుకోమంటాడు. బడికి హాజరైనపుడు రోగం వచ్చిందని డాక్టరు సర్టిఫికెటు తెచ్చుకోమంటే యేమనాలి. అందువల్ల ఈ చిన్న సమస్యలన్నీ పరిష్కారము ఎట్లా అవుతాయి ? ఎన్ని వ్రాసినా డిపార్టుమెంటు నుంచి ఒక్క కాగితము కూడా రాదు. మీరు ఎన్నైనా కదిలించండి. అన్ని డిపార్టుమెంటులలో కన్నా చాలా చురుగ్గా జరుగవలసిన డిపార్టుమెంటు ఇది. ఇంత మందకొడి డిపార్టుమెంటు ఇంకొకటిలేదు. లంచం తింటూ కూర్చునే డిపార్టుమెంటు ఇంతకన్నా ఇంకొకటిలేదు. ఎందుకు అంటే, ఇచ్చినవాడికి ఏమీ తెలియదు, వాడికి నోరులేదు. నోరు లేనివాడిని మొత్తము మనిషినేమింగడానికి ప్రయత్నము చేసే డిపార్టుమెంటు ఇది. క్రిందనుంచి పైవరకు రెవిన్యూ ఇన్స్పెక్టర్లు ఎంక్వయిరీ చేస్తారు. వారుకదలరు. ఇక్కడనుంచి వ్రాసేస్తాడు, "ఆ భూమికి సంబంధించిన అతను వస్తాడు, ఇది వీల్లేదని చెబుతాడు," అని పైగా హెల్తు ఇన్స్పెక్టరును అడుగుతాడు. ఒక వేళ పొరపాటున రెవిన్యూ ఇన్స్పెక్టరు ఒప్పుకుంటే హెల్తు డిపార్టుమెంటు వస్తుంది. అందువల్ల మొత్తము మీద ఏవైపు చూచినప్పటికిన్నీ సాంఘికాభివృద్ధికి ఆటంకంగా ఉండి బ్రతకడానికి లివింగు స్పేసు కూడా లేకుండా వుంది. ఈ హరిజన సమస్యను, ఈ భూనాదుల సమస్యను, గిరిజనుల సమస్యను మనము తీర్చడానికి ప్రయత్నము చేయక

22nd July 1955] (Sri Vavilala Gopalakrishnayya)

పోతే, ఒక కోటి రూపాయలు ఇచ్చామంటున్నారే అది అంతా వృధా అవుతుంది. మన బడ్జెటు ప్రకారముగా అది చాలా పెద్దది అని చెప్పవచ్చును. అసలు ప్రధానమైనటువంటి సమస్యలను పరిష్కరించదలచినప్పుడు ఈ కోటే కాదు మరో కోటి రూపాయలు ఇచ్చినా కూడా ఫరవాలేదు. దీనికి రెండు విధానాలు మనవి చేస్తున్నాను. హరిజన మిత్రులకు కూడా మనవిచేస్తున్నాను. వాళ్ళలో వాళ్ళకు వచ్చే చిక్కులు కొన్ని వున్నాయి. నేను వాటిని నేరంగా చెప్పడము లేదు. నేనువినయపూర్వకంగా చెబుతున్న దేమిటంటే, వాళ్ళను మార్చవలసినది అధికారంలో వున్న వారే. అధికారంలో వున్న ఒక్క హరిజనుడుకూడా సాధారణంగా వారిదగ్గరకు వెళ్ళడములేదు. అది నాకు తెలుసు, నా మిత్రులకు కూడా తెలుసు. పెండ్లికూడా ఇంకెక్కడనో చేసుకుంటాడు అని కూర్మయ్యగారు కూడా అన్నారు. సవర్ణ మంత్రులుగాని అధికారులుగాని ఒక గ్రామానికివెళ్ళి అక్కడ ఉన్న హరిజనపాలెంలోని మాలలను, మాదిగలను తీసుకువచ్చి భోజనాలు టీపార్టీలు పెట్టండి. మంత్రులంపరూ వస్తే వాళ్ళూ వస్తారు. అప్పుడు వాళ్ళేమనరు. ఇంతకుముందు దబాయించిన వారంపరికికూడా మంత్రిగారితో ఏదో ఒక రకంగా పనివుంటుంది. గనుక మంత్రిగారితో విధిగా అచ్చట భోజనాలు చేస్తూ కూర్చుంటారు. అక్కడకు తప్పకుండా పోవలసి వస్తుంది కాబట్టి ఈ మాలపల్లెకు పోముగా అని అనరు. కనీసము ఆ పూటకైనా ఆ మాలపల్లెను బాగు చేయిస్తారు. ఆ విధముగా చేసినట్లయితే సాంఘిక సమత్వము వస్తుంది. జియ్యరుదాసుగారు మాలపల్లెను గ్రామములో నడుమగా పెట్టమన్నారు. నడుమగా పెట్టడం సమ్మతము అవుతుందో లేదోగాని వేరే పల్లెలుమాత్రము తయారు చేయవద్దు. ఊరికి ఆనుకొని ఎక్కడ అయితే చోటు వుంటుందో అక్కడ వెంటనే హరిజనులకు ఇండ్ల స్థలములు ఇవ్వడానికి ప్రయత్నించకపోతే సాంఘికముగా సమాజములో మార్పురాదు. అందుకు మనము ప్రయత్నించాల్సిన అవుసరము వుంది. ఇది సాంఘిక సమస్య.

దీనిని ఎట్లా తీర్చగలమంటే, కోటయ్యగారు చెప్పినట్లు చిన్న చిన్న పరిశ్రమలలో వారికి వృత్తికల్పించాలి. వారికి భూములు ఇవ్వడము జరగాలి. ఆర్థికంగా కూడా సాయపడాలి. అయితే ఆర్థికము అని చెప్పి సాంఘికంగా వదలిపెడితే లాభము లేదు. దేవాలయాల్లోకి పోతే ఒక పర్యాయము జరిగిన విషయము నాకు జ్ఞాపకము ఉన్నది. అది మంతెన వెంకట్రాజుగారికి కూడా జ్ఞాపకము ఉండియే వుండవచ్చును. వారి ఊరిలో ఒక దేవాలయమునకు హరిజనులు వెళ్ళితే, మేము మద్దతుగావుంటే మమ్ములను తన్నడానికి వస్తే వారు మమ్ములను రక్షించారు. మేము దెబ్బలు తినకుండా బయటపడ్డాము. అది అంతా ఒక ఉద్యమము. ఒకాయన మమ్ములను గండ్రగొడ్డలి పుచ్చుకొని నరకడానికి వచ్చాడు. ఆయన తమ్ముడు వచ్చి కాపలాకాసి నన్ను రక్షించాడు. లేకపోతే అసలు ఇక్కడ లేకుండా ఖాళీ అయిపోయేవాడిని. ఆ రోజుల్లో హరిజనులు దేవాలయాల్లో ప్రవేశించే సమస్యను మనము తీసుకున్నాము. ఇంతవరకు అది మనము సాధించలేదు, ఒక హరిజనుడు వెళ్ళి దేవాలయాల్లో ప్రవేశిస్తే మరొక బ్రాహ్మణుడు వెళ్ళి సంప్రోక్షన చేసివస్తాడు. అక్కడకు అది సరిపోతుంది, ఎందుకు ఇది? అవతల సాంఘికంగా చైతన్యము రానందువల్ల, తక్కువ కులముల వాళ్ళలో మార్పులు రానందువల్ల, ప్రభుత్వమువారు కావలసినప్పుడు తప్ప పోలీసులను పంపించనందువల్ల, ఇది సాధ్యం కాకుండా పోతోంది.

ఈ సంవత్సరంలో ఫలానాచోట ఈ చట్టం అమలుకురాలేదని నేరారోపణ రుజువు చేసుకొనుటకు తగిన సాధన సంపత్తి, సాంఘిక సంఘటితశక్తి, మనము ఇంకా సాధించుకోలేము అని గుర్తించవలెను అవసరమని మనవి. కాని జరిగింది. ఇది శవము మూడుముక్కలుఅయిన సంగతి రోడ్డుమీద అందరూ కళ్ళారా చూశారు. కాని కోర్టులలో కేసులు పోవుచున్నవి. ఎందువల్లననగా, direct evidence లేక. అదేమాదిరిగా ఈ చట్టాలవల్లకూడా ఎక్కువ అత్యాచారములు జరుగుచున్నవి. ఇట్లా అత్యాచారములు జరుగుచున్నవని నా ముందు ఈ ప్రభుత్వము ఏర్పడిన మూడుమాసాలలో ఇప్పటివరకు ఒక్క శాసనసభ్యుడుగాని ఇతరులుగాని రిపోర్టు ఇవ్వలేదు. ఇచ్చానని ఎప్పుడూ చెప్పడానికి సావకాశంలేదు. ఫలానాచోట ఫలానామనిషో, భూకామందో, మునసబో, ఆయన తాబేదారులో, జమీందారులో యీ అన్యాయము ఫలానావారికి చేసినారని రిపోర్టు వచ్చిఉంటే అది విచారణ పెట్టకుండా నిర్లక్ష్యపరచి ఏదో తప్పించుకు తిరిగే చర్యగానుంటే ఇది ప్రభుత్వ ఉపేక్ష కాదా అని విమర్శిస్తే అది న్యాయమైన విమర్శ. ప్రభుత్వము దానికి సిగ్గుపడవలసినదే, సమాధానము చెప్పుకోవలసినదే. ఇటువంటిది నాకెపుడూ జరుగలేదు. అందుచేత మనము ఊరికినే వాదిస్తున్నాము. నేనుకూడా శాసనసభలో సాధారణ సభ్యుడుగా ఉన్నాగాని బైట ఒక సామాన్య సేవకుడుగా ఉన్నా సరే విమర్శచేయడములో ఇక్కడఉన్న మిత్రులలో ఎవరికి తగ్గిపోననే విశ్వాసము నాకు ఉన్నది.

Sri S. VEMAYYA :— అటువంటి compliment ఇస్తామండి ? హరిజనులను యీనాదికాలనీనుంచి తరిమేస్తున్నారని చెప్పాను.

The Hon. Sri G. LATCHANNA :— తరిమేస్తున్నారనేది సాధారణ complaint. నా మనవి ఏమిటంటే general complaint యిస్తున్నారు, specific గా యివ్వాలి, అని నేను యిప్పుడు మనవిచేస్తున్నాను. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఉత్తరాన్ని అగౌరవపరచవలెనని నా అభిమతము కాదు. ఉత్తరమునకు సమాధానము వ్రాస్తున్నాము. శాసన సభ్యులకేకాదు, ఏ ఊరు నుంచి అయినాసరే స్త్రీగాని, పురుషుడుగాని వ్రాసినవారు అనామధేయుడైవున్నాసరే ఒక్క post card వ్రాస్తే సమాధానం ఇస్తున్నాను. పిటీషన్ వస్తే party కి notice యిచ్చి విచారణ చేయాలని యీ రోజు Harijan Welfare Department కు orders పంపిస్తున్నాను. ఇది చాలమంది గమనించే ఉంటారని నా విశ్వాసము. Complaint చేసినవారికి నోటీసు యిచ్చి విచారణ చేయాలని ప్రభుత్వ సలహా. Complaint యిస్తే, నేను complaint యిచ్చాను, మీరు అగ్జరు ప్యాసు చేయండి అంటే, అది ex-parte decree అవుతుంది.

ఈ ex-parte decree ఏ ప్రజాస్వామిక పద్ధతులలోగాని, ఏ సూత్రములలోగాని జరుగలేదని జరిగితే దౌర్జన్యమని, నిరంకుశత్వమని అందరూ అంగీకరిస్తారు. అప్పుడు నాకంటే ఎక్కువ తిట్టెదరు. తిరిగి ఆ మనుష్యులే ఏ సభ్యులు అయితే

ఒక అన్యాయము జరిగిందని అంటే అది విచారణ కాకుండా బుజువుకాకుండా, దానిమీద ఒక క్రమచర్య తీసుకుంటే, ఇది ఏకపక్షవాదనతో జరిగిన చర్య నిరంకుశము అని విమర్శించవచ్చును. అందువల్ల ఇచ్చినటువంటి నేరారోపణకు రుజువుచేసుకోవడము కష్టముగా వున్నదని నాకు తెలుసు అని మనవిచేస్తున్నాను. ఇప్పుడు రంగనాథ మొదలియార్ గారు surprise visits చేయమన్నారు. గ్రామాలలోనుంచి బైటికి వచ్చినవారమగు మనము గ్రామాలను visit చేస్తేనే వాటిదుస్థితి తెలుస్తుంది, లేకపోతే తెలియదు అని చెప్పుట నాకంత బాగుండ లేదు. నామట్టుకు నాకు ఈ 20 సం॥ల కాంగ్రెసు సేవా రంగములో ఎక్కువ కాలము ఈ హరిజనులతోగాని గిరిజనులతో గాని నివాసము ఏర్పాటు చేసుకొని తిరిగే అవకాశము, అదృష్టము, కలిగింది. నిజముగా అది అదృష్టమని నేను అనుకుంటున్నాను. అందువల్ల నేను మనవిచేసేది surprise visits వల్ల తెలిసేవి అని కాదు. ఇప్పుడు మనము ప్రధానంగా చేస్తున్న విమర్శ, ఈ నాడు మనము బాధ్యతాయుతంగా చేయాలంటే ఒక నిర్మాణయుత మైన దృష్టితో చేయాలి. అనేకమంది సభ్యులు ప్రభుత్వము ఏమిచేసినదని అడుగుతారు. నేను ఉమ్మడి మదరాసురాష్ట్రీయ లెక్కలు మీముందు పెట్ట లేను కాని యీ రాష్ట్రము ఏర్పడినతరువాత ఇళ్ళస్థలముల లెక్కలన్నీ మీఎదుట సాదృశంగా పెడుతున్నాను. సభ్యులు దానిని పరిశీలించాలని కోరుతున్నాను. మనరాష్ట్రము ఏర్పడిన నాటినుంచి 1955 మార్చి వరకు ఎన్ని పిటీషనులు ఏ జిల్లాలనుండి వచ్చాయో, ఎన్ని dispose అయినాయో, ఎన్ని కుటుంబాలకు ఇండ్లవసతులు ఏర్పాటుచేయబడ్డది అనే విషయాన్ని మీ దృష్టికి తీసుకువస్తు న్నాను. కడపజిల్లా నుండి వచ్చిన పిటిషనులలో 73 విచారించి వాటి మీద చర్య తీసుకున్నాము. 62 పిటీషన్లు ఇంకా విచారణలో వున్నవి.

Sri PILLALAMARRI VENKATESWARLU:— ఇంకా మిగిలినవి విచారణలో ఉన్నాయంటారా ?

The Hon. Sri G. LATCHANNA:—73 విచారణ అయినవి. 62 విచారణలో ఉన్నవి. (ఇవి ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పటినుంచి 1955 మార్చి వరకు వచ్చిన లెక్కలు.)

Sri N. K. LINGAM:—ఈ dispose అయిన కేసులు యీ హరిజన్ డిపార్టుమెంటు పుట్టినప్పటినుంచి జరిగినవా ? లేక యీ రాష్ట్రము వచ్చినప్పటినుండి జరిగినవా ?

The Hon. Sri G. LATCHANNA:—గౌరవ సభ్యులు నేను చెప్పింది మొదటినుండి వింటే ఈ ప్రశ్న వచ్చేదికాదు. ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పటి నుండి 1955 మార్చివరకు అని మనవిచేశాను. హరిజన డిపార్టుమెంటు పుట్టిన దగ్గరనుంచి, మన తాతగారు దగ్గరనుంచి అయ్యేదికాదు. కడప జిల్లాలో 135 దరఖాస్తులు వచ్చాయి. అందులో 73 దరఖాస్తులమీద చర్య తీసుకోవడం జరిగింది. ఆ చర్యవల్లను 1953-54 సం॥ ఆఖరు 6 మాసాలలో 51 హరిజన కుటుంబములకు ఇండ్ల వసతులు ఏర్పాటు చేయబడ్డవి. ఒక కుటుం

దానికి 5 సెంట్లు చొప్పున 1953-54 ఆరు మాసాల్లో 51 కుటుంబాలకు ఇండ్లు ఏర్పాటు చేయడం జరిగింది. 1954-55 లో 84 కుటుంబాలకు ఇండ్లు ఏర్పాటు చేయడం అయినవి. Allotment అయిన రు. 66,079 లలో రు. 32,694 లు ఖర్చు అయినవి. ఈ స్టేట్ మెంటు దానికి సంబంధించి వుంది. ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడిన వెంటనే హరిజనుల గృహసౌకర్యాల విషయమై ప్రత్యేకించబడిన 10 లక్షల రూపాయల ఫండులోని కార్యక్రమం. 10 లక్షల రూపాయలు ఈ దిగువ రీతిగా జిల్లాలమధ్య విభజించబడింది.

| | | |
|---|---|---|
| కడప జిల్లా | ... | రు. 66,00 లు |
| గుంటూరు జిల్లా | ... | 1,02,166 లు |
| చిత్తూరు జిల్లా | ... | 60,379 లు |
| తూర్పుగోదావరి జిల్లా | ... | 1,60,682 లు |
| నెల్లూరు జిల్లా | ... | 90,469 లు |
| కర్నూలు జిల్లా | ... | 76,215 లు |
| శ్రీకాకుళం జిల్లా | ... | 78,959 లు |
| విశాఖపట్నం జిల్లా | ... | 68,979 లు |
| పశ్చిమగోదావరి జిల్లా | ... | 54,049 లు |
| కృష్ణా జిల్లా | ... | 1,33,944 లు |
| అనంతపురం జిల్లా | ... | 1,04,079 లు |

ఈ 10 లక్షల రూపాయల allotment జనాభా ప్రాతిపదికమీద జిల్లాలమధ్య విభజించబడింది. ఇంతవరకు కడపజిల్లాలో ఖర్చు అయినది రు. 32,694 లు. మొత్తం 135 కుటుంబాలకు ఇండ్ల ఏర్పాటు పూర్తి అయినది. గుంటూరు జిల్లాలో రు. 19,840 లు ఖర్చు అయినది. మొత్తం 1953-54 వ సంవత్సరంలో 122 కుటుంబాలకు ఇండ్లస్థలాలు ఏర్పాటు చేశాము. చిత్తూరు జిల్లాలో 1955 మార్చి ఆఖరుకు 286 కుటుంబాలకు ఇండ్లస్థలాలు ఏర్పాటు చేసాము.

Sri P. SUNDARAYYA :— కడపజిల్లాకు చెప్పినమాదిరిగా ఎన్ని పిటీషన్లు వచ్చాయి ; ఎన్ని dispose అయినాయో అన్ని జిల్లాలకు చెబుతారా ?

The Hon. Sri G. LATCHANNA :— చెబుతాను. గుంటూరుజిల్లాలో 35 పూర్తిఅయినవి ; 87 దరఖాస్తులు పరిశీలనలో వున్నాయి. చిత్తూరుజిల్లాలో 205 దరఖాస్తులు పూర్తి అయినవి, 81 దరఖాస్తులు విచారణలో వున్నాయి. తూర్పు గోదావరిజిల్లాలో 601 దరఖాస్తులు విచారణలో వున్నాయి ; 41 పూర్తి అయినాయి. ఆ 41 దరఖాస్తులలోవుండే 640 కుటుంబాలకు ఇండ్లు పూర్తి అయినాయి. నెల్లూరుజిల్లాలో 75 దరఖాస్తులు పూర్తి అయినవి ; 62 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 75 దరఖాస్తులకు సంబంధించిన 132 కుటుంబాలకు ఇండ్ల వసతులు కల్పించబడినాయి. కర్నూలుజిల్లాలో 346 దరఖాస్తులు పూర్తి అయినాయి. 265 దరఖాస్తులు విచారణలో ఉన్నాయి. దీనికి సంబం

ధించిన 611 కుటుంబాలకు ఇండ్లవసతులు ఏర్పాటు చేయడమైనది. శ్రీకాకుళం జిల్లాలో 5 దరఖాస్తులు పూర్తిఅయినవి. 33 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 5 దరఖాస్తులకు సంబంధించి 38 కుటుంబాలకు ఏర్పాట్లు జరిగాయి. విశాఖపట్నంలో 52 దరఖాస్తులపై చర్య తీసుకున్నాం. 29 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 58 దరఖాస్తులకు సంబంధించి 87 కుటుంబాలకు ఇండ్ల వసతులను ఏర్పాటు చేశాము. పశ్చిమగోదావరిలో 42 దరఖాస్తులమీద చర్య తీసుకున్నాము. 9 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 51 కుటుంబాలకు ఇండ్లవసతులు ఏర్పాటుచేసాము. కృష్ణాజిల్లాలో 127 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 181 దరఖాస్తులపై చర్య తీసుకున్నాం. 181 దరఖాస్తులకు సంబంధించి 308 కుటుంబాలకు ఇండ్లవసతులు ఏర్పాటు చేయడమైనది. అనంతపురం జిల్లాలో 105 దరఖాస్తులు విచారణలో వున్నాయి. 196 దరఖాస్తులపై చర్యతీసుకున్నాము. 331 కుటుంబాలకు ఇండ్లస్థలాలు ఏర్పాటు చేసినాము. ఈ విధంగా ఆ యా జిల్లాలకు ఏర్పాటు చేయబడిన మొత్తంలో రు. 2,02,050 లు ఖర్చు అయినది. మిగిలిన డబ్బు lapse కాలేదు. ఈ విధంగా house sites క్రింద గత ఏడాదిలో 26 లక్షలు ప్రత్యేకించబడ్డాయి. అదేవిధంగా ఈ ఏడాదిబడ్జెటులో 2 లక్షల 60 వేల రూపాయల గ్రాంటు ప్రత్యేకించబడింది. మిగిలినదానితో చేర్చి ఈ కార్యక్రమం అంతాకూడా ప్రస్తుతం ప్రభుత్వం మళ్ళీ ఏర్పడేసరికి ఏ ఏ ఇండ్ల స్థలాల సమస్యలు పరిశీలనలో వున్నాయో అవన్నీ సెప్టెంబరు 30 వ తేదీ నాటికి పూర్తి పరిష్కారం చేయాలని జిల్లాకలెక్టర్లు emergency rules క్రింద చర్యతీసుకోవాలని, దానినిగురించి నిర్ణయించిన ప్రత్యేక staff 13 గురు ఉద్యోగులుద్వారా ఈ కార్యక్రమం పూర్తిచేయాలని జిల్లాకలెక్టర్లకు రెండవమారు కూడా హెచ్చరిక చేయబడింది. సంపూర్ణంగా ఈ కార్యక్రమాన్ని సెప్టెంబరు 30 వ తేదీ లోపుగా పూర్తిచేయగలమని మనవి చేస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— Ex-criminal tribes వారికి ప్రత్యేక గృహ వసతి ఏర్పాటుచేశారా ?

The Hon. Sri. G. LATCHANNA :— ఆ విషయం వచ్చినపుడు మనవి చేస్తాను. గౌరవసభ్యులు శ్రీ కూర్మయ్యగారు మాట్లాడుతూ హరిజనులకోసము ఏర్పాటుచేయబడిన డబ్బులో 50% వరకు ఉద్యోగులే తినేస్తున్నారు అన్నారు. ఈ శాఖ కేంద్రప్రభుత్వం ఆదేశంవల్లనైతేనేమి, అఖిల భారత కాంగ్రెసుసంస్థ సిద్ధాంతాలను అనుసరించి ప్రారంభమైనపుడు శ్రీ కూర్మయ్యగారు మంత్రిగా వున్నారు. వారి హయాంలోనే ఈ కార్యక్రమం ప్రారంభమైనది. 50% ఉద్యోగులే తినేస్తున్నారని ఏ ఆవేదనతో ఆయన అన్నారో తెలియదు కాని 7% మాత్రమే ఉద్యోగుల క్రింద ఖర్చు అవుతోంది. డిపార్టుమెంటు అంటూ ఏమీలేదు. డిపార్టుమెంటు ఏర్పడినాక డైరక్టరు, సిబ్బంది, కార్యాలయాలు తప్ప ప్రతి జిల్లాలో వేరే శాఖలు ఏమీలేవు.

Sri V. KURMAYYA :—On a Personal explanation, sir, నేను చెప్పిన 50% ఉద్యోగస్తులు, labour school teachers. వారి D. A. అంతా కలిపి చెప్పాను. Special department పెట్టినా 8 లక్షల రూపాయిలు ఖర్చుచేయకుండా మిగిల్చారు. ఉద్యోగస్థుల జీతాలుక్రింద ఖర్చుచేయడానికి ఏమి అభ్యంతరం లేదు. ఆ డబ్బు సక్రమంగా ఖర్చుచేసి హరిజనులకు సేవచేయాలని నేను అనేది.

The Hon. Sri G. LATCHANNA :— స్కూలు టీచర్ల జీతాలుకూడా సిబ్బంది ఖర్చుక్రింద అవుతున్నట్లు లెక్క వేస్తే-ఇంకా hostels' contractors mid-day meals' contractors వీరందరికి అయ్యేదికూడా లెక్క వేస్తే - సరియైన పద్ధతి కాదని ఆ విధంగా పరిశీలన చేయడం సమంజసం కాదని మనవి చేస్తున్నాను. ఆవేదనతో మాట్లాడారని ప్రభుత్వదృష్టిలో అసమ్మతి చెబుతున్నానని అనుకోనక్కరలేదు. జరిగిన కార్యక్రమం మరొకసారి మీ దృష్టికి తీసుకురావడానికి మాత్రమే మనవిచేస్తున్నాను. రివెన్యూ డిపార్టుమెంటువారు చేస్తున్న కార్యక్రమాల్లో హరిజనులకు నీటివసతి సమకూర్చే నిమిత్తం 1953-54 ఆరుమాసాల్లో రెండులక్షల నలభైవేలరూపాయలు ఖర్చుచేశారు. 1954-55 లో 3 లక్షల 60 వేల రూపాయిలు ఖర్చుచేశారు. ఇది చాలదు అనేది కనబడుతున్న సమస్య. కాని ఏమి జరగడంలేదవడం సబబుకాదు. ఏమీ జరగలేదంటేనే కాని జరుగదని వాదిస్తే అది సబబు కావచ్చును. శ్రీ కూర్మయ్యగారు మరొక point తెచ్చారు. గత ఏడాది బడ్జెటులో కేటాయించినదానికన్న ఈ ఏడాది తరిగిపోయిందని, ఇది తిరోగమన విధానంగా వున్నదని అన్నారు. గత ఏడాది విషయంలో చెప్పినది budget allotment కాదు. ఏడాది పూర్తి అయిన తరువాత revised budget క్రింద ఎంత ఖర్చు అయినదో చెప్పాను. 1954-55 లో రు. 60,29,000 లు ఖర్చు అయినది. ఇపుడు proposal 50 లక్షలు. ఇది పూర్తి అయేసరికి పెరగదు అనుకోడం పొరపాటు; పెరగడం సహజం. 20 హాస్టల్సు నిర్వహణకోసం ఖర్చుక్రింద 45 వేల రూపాయిలు ప్రత్యేకించిన సంగతి మీకు తెలుసు. ఏడాది ఆఖరైపోయేసరికి 50 లక్షలకన్న ఎక్కువ ఖర్చు అవుతుంది. ఇప్పుడే అంచనా వేయడం సాధ్యంకానిపని. గత ఏడాది ఖర్చైన దానితో ఈ ఏడాది కేటాయించిన సొమ్మును compare చేసి తగ్గిపోయింది అనే ధోరణిలో విమర్శించడం సరియైన మార్గం కాదని నాకన్న పరిపాలనలో ఎక్కువ అనుభవం వున్న కూర్మయ్యగారికి మనవిచేస్తున్నాను. ఆవేశంతో చెపుతున్న సమాధానం కాదు. వినయపూర్వకంగా చేస్తున్న మనవిమాత్రమే.

Sri S. VEMAYYA :— ఇప్పుడు మంత్రిగారు పది లక్షలలో నుంచి రెండు లక్షల చిల్లర ఖర్చుపెట్టాము దానికి మళ్ళీ contribution చేస్తామని అన్నారు.

"No contribution is proposed to be made from Revenue to the fund in 1955-56" అని Memorandum లోని 11 వ పేజీలో వ్రాసి ఉన్నది.

The Hon. Sri G. LATCHNNA :—వేమయ్యగారు చట్టాలు, సిద్ధాంతాలు, Sections భాగా తర్కించి విమర్శించగలిగిన వారు. నేను చెప్పినటువంటిది

contribution కుగా అర్థము చేసుకోవడం న్యాయంకాదు. గవర్నమెంటు budget allotment లో Houses item క్రింద 2.6 lakhs as usual గా allot చేసినదని మనవిచేశాను. కాని Revenue Department contribution కాదు. 2.6 lakhs houses item క్రింద usual గా చేస్తున్న allotment యథాప్రకారంగా చేసినది. 10 లక్షలు reserve fund లో మిగిలింది. ఇదంతా reserve funds కాదు, contribution గా పెట్టామని నేను మనవిచేయలేదు. ఇది సమంజసము కాదని మనవి చేస్తున్నాను. పోతే యిప్పుడు గత 1953–54 ఆఖరు అర్థ సంవత్సరంలో ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడిన తరువాత కేటాయించింది, ఖర్చుచేసినది హరిజనాభ్యుదయ శాఖ 30 లక్షల 44 వేల రూపాయలు. ఇందులో యింతవరకు వచ్చిన లెక్కల వివరాలు పరిశీలిస్తే 15 లక్షలు విద్యాభివృద్ధిక్రింద, 30 లక్షలు యితరత్రా మంచి నీటి వసతుల క్రింద, యిండ్ల స్థలాలు కాకుండా, విద్యాభివృద్ధికి, scholarships కు, mid-day meals కు గాను 15 లక్షల రూపాయలు ఖర్చయినది. 50 percent ఉద్యోగస్థుల క్రింద ఖర్చవుతుందని కూర్మయ్యగారన్నారు. ఉపాధ్యాయుల ఖర్చుకూడా దీనిలో చేర్చి చెప్పడం సరికాదని హరిజన మాజీ మంత్రులు, హరిజన నాయకులు అయిన కూర్మయ్యగారికి మనవిచేస్తున్నారు.

Sri V. KURMAYYA :— ఉద్యోగస్తులలో teachers ను కూడా చేర్చామని చెప్పలేదు. హరిజన పాఠశాలలో అన్ని కులాలవారిని చదివించినందుకు Harijan fund లో కలుపడం బాగుగాలేదు. ఆడబ్బును జిల్లా బోర్డుల విద్యాశాఖ నుండి Welfare Department కు transfer చేస్తే యింకా ఎక్కువ మంది హరిజనులకు విద్య సాధ్యపడుతుంది.

The Hon. Sri G. LATCHANNA:–Harijan Welfare Schoolsలో హరిజనేతరులు చదువుకున్నందుకు అవుతున్న ఖర్చు హరిజన మొత్తంలో నుండి ఖర్చవుతున్నదనడం సమంజసం కాదు. Anti-untouchability క్రింద కేంద్ర ప్రభుత్వం యిచ్చిన మొత్తంనుంచి యీది ఖర్చు పెడుతున్నారు. హరిజన fund లో నుంచి హరిజనేతరులకు ఖర్చుపెడుతున్నామనే ఆవేదన, అపోహ, కొంతమంది సభ్యుల కున్నది. ఆ విధంగా ఎప్పుడూ కాదు, కానేరదు. ఈ విషయం హరిజన శాసన సభ్యుల సమావేశంలో, పత్రికా విలేఖరులతో, బెజవాడ హరిజన ప్రచారకుల సమావేశంలో స్పష్టంగా ప్రకటించి వున్నాము. ప్రభుత్వం ఒకరిగురించి కేటాయించిన డబ్బు మరొకరి క్రింద ఖర్చు చేయదని మనవిచేస్తున్నాము. కేంద్ర ప్రభుత్వం అంటరానితనం నిర్మూలనకు ప్రణాళిక కొనసాగించాలని, హరిజనులకు హరిజనులనే మానసికతత్వం పోగొట్టడానికి సవర్ణ హిందువులతో హరిజన బాలబాలికలను చదివించడానికి గాను అంటరానితన నిర్మూలన కార్యక్రమం క్రింద యీ గ్రాంటులు ఏర్పరుపబడినవి. కనుక హరిజన స్కూల్సులో హరిజనేతరులను చేర్పించవలసిన అవసరం ఏర్పడింది.

Sri V. KURMAYYA :— అంటరానితన నిర్మూలన క్రింద Central Government grant యిస్తుందని మంత్రిగారు చెప్పారు. బందరు, గుంటూరు,

ఏలూరు Government Hostels లో 10 percent హరిజనేతరులను చేర్చారు. డబ్బు provide చేయలేదు. Private managed hostels లో యితర కులాల వారిని చదివించాలని వుంది గాని Government hostels కు యివ్వమని కాదు. బాగా information తెప్పించుకోమని నేను మంత్రిగారిని కోరుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA :— విద్యార్థి గ్రాంటులు అన్ని ప్రాంతాలలో వున్నవి. కాని ఎక్కడెక్కడ ప్రభుత్వం వాగ్దానం యిచ్చినదో ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తే చర్యతీసుకుంటాము. ఈ రోజు నిరుద్యోగులు, విద్యావిహీనులు కోట్లకొలది వున్నారు. మాకు వచ్చిన లక్షన్నరలోనూ యీ గ్రాంటులన్నీ యిమ్మంటే సాధ్యంకాదు. లక్షలాదిగా వున్న వారికి provide చేయడం సాధ్యంకానిపని. అందువల్ల నేను మనవిచేసేది ప్రధాన సమస్యగురించి సభ్యులందరూ ఈ Social Welfare Department లో యితరులను చేర్చినదెందుకు, హరిజనులను ఏ గంగలో కలపడానికి అని అంటున్నారు. నిజంగా గౌరవ సభ్యులు ఆత్మపరిశీలన చేసుకొని హృదయపూర్వకంగా ఆలోచించి దీనిమీద వారు ఒకనిర్ణయంచేస్తే నాకు అభ్యంతరంలేదు. హరిజనులు హరిజనులుగానే గ్రామాలలో వుండాలని హరిజన నాయకుల అభిప్రాయం కాదనుకుంటాను. ఇంకా గిరిజను లున్నారు. లంబాడీలు, కోయలు వున్నారు. వీరిని ఉద్ధరిస్తున్నంత మాత్రాన హరిజనులను ఉపేక్ష చేస్తున్నాం అనుకోడం సబబుగా కనపడదు. గాంధీ మహాత్ముని ధర్మంవల్ల హరిజనాభ్యుదయం ఉపేక్షింపబడదు. కాంగ్రెసు, ప్రజాస్వామ్యం భారతదేశంలో వున్నంతకాలం హరిజనులకు భయంలేదు. ఎంతటి మహానాయకుడు, నిరంకుశ నాయకుడు వచ్చినా యీ కార్యక్రమాలకు అడ్డు రాలేడు, రానేరడు, వస్తే నిలువనేరడు అని మనవి చేస్తున్నాను.

ఈ కార్యక్రమాలు అమలుజరిగించుకునే హక్కు హరిజనులకు శాసనరీత్యా, చట్టరీత్యా వున్నది. గాంధి మహాత్ముని ఆత్మబలంవల్ల నయితేనే, కాంగ్రెసు కృషి వల్ల నయితేనేం హరిజనులకు యీ పౌరసత్వ హక్కు ఏర్పడింది. ఈనాడు హరిజనశాఖ నిర్వహింపబడదు అనుకుంటే అది పొరపాటు. హరిజన శాఖకు హరిజన నామకరణం చేసినంత మాత్రాన అపోహపడరాదు. అంతటి సంకుచిత దృష్టి ప్రభుత్వానికిలేదు. అటువంటి తత్వానికి చోటివ్వవద్దని మనవిచేస్తున్నాను. హరిజనులు పునాదిరాళ్ళు వంటివారు. వారికి Social Welfare Department ఏర్పాటు చేయబడింది. కాని audit objection మీద జరిగింది కాదు. ఇటువంటి objection కొంతవచ్చింది మొదట్లో. Harijan Welfare శాఖ Secretary, social welfare కార్యక్రమాలు అమలు జరపడం వాటికి allot అవుతున్న డబ్బు Director of Harijan Welfare ఖర్చుపెట్టడం అనేవి anomaly గా point out చేశారు. Social welfare grant క్రింద వస్తున్నది Harijan Welfare క్రింద ఖర్చుకావడం క్రమపద్ధతికి, చట్ట సాంప్రదాయానికి భిన్నవిధానం అని ఆ Audit శాఖ వారి objection. కాని audit శాఖవారికి అర్థరాత్రి కలవచ్చి ఉదయం చెప్పింది కాదని మనవి చేస్తున్నాను.

అందువల్ల ఈ హరిజన welfare శాఖను social welfare కి చేయడానికి సంఘంలో హరిజనులకు ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వవలెననే సత్సంకల్పంతోను, దీక్షతోను, అభిమానముతోను చేయబడిన కార్యక్రమంగాని అది మరొక దురుద్దేశంతో చేయబడిన కార్యక్రమం కానేరదు. ఎంతమాత్రం మీరు సందేహ పడవలసిన అవసరంలేదని నేను మనవిచేస్తున్నాను. అందువల్ల ముఖ్యంగా అనేకమంది గౌరవసభ్యులు ఏమి అన్నది నేను జాగ్రత్తగా నోటుచేసి ఉన్నాను. (అధ్యక్షులవారు ఇప్పటికే గంటకాలము జరిగింది అనుకున్న కాలంలో పూర్తి చేయాలని సౌంజ్ఞలు చేస్తున్నారు) అందువల్ల నేను మనవి చేసేది, ఇపుడున్న రూల్సులోనే emergency రూల్సు క్రిందనే ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ప్రభుత్వం జిల్లాకలెక్టర్లకు తాఖీదు ఇచ్చింది. దాని ప్రకారం పనులు తొందరగా జరుగుతున్నవి. ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చేసరికి acquisition proceedings క్రింద ఉన్నటువంటి ఇండ్లస్థలాల కార్యక్రమంకూడ, సెప్టెంబరు 30 వ తేదిలోగా పూర్తి చేయవలెనని స్పష్టమైన తాఖీదులు జిల్లాకలెక్టర్లకు జారీఅయి ఉన్నాయి. కాబట్టి ఇక ఆలస్యానికి అవకాశం ఉండదనిమాత్రం నేను మనవిచేస్తున్నాను. సభ్యులు ఇంకా అనేక విషయాలు మనవిచేసి ఉన్నారు. గిరిజనులను గురించి శ్రీ కోదండరామయ్యగారైతేనేమి, అప్పారావుగారు అయితేనేమి, వారు నిజంగా అక్కడ ఉన్నటువంటి, పరిస్థితులు చెప్పారు. నేను ప్రత్యేకంగా అక్కడకూడ కొంతకాలం వారి మధ్య రాజకీయ వాతావరణంలో నివసించిన పరిస్థితులు ఉన్నాయి. అందువల్ల అక్కడ ఉండే వ్యవహారాలు తెలుసును. Financial Marketing Corporation అనే విధానం అమలు పరచడానికి ఇపుడు ఢిల్లీ గవర్నమెంటువారి administrative sanction ఆలస్యం అవుతుందేమో, మనపని ప్రారంభించుటకు ఇప్పటికే జాగు అయింది అనే ఆలోచనచేత, మన ఆంధ్ర గవర్నమెంటు funds నుండి 2 లక్షలు రూపాయలు దీనిక్రింద advance తీసుకొని కార్యక్రమం ప్రారంభించడానికి ప్రభుత్వము తీర్మానించిందనే సంగతి తమకు ప్రారంభంలోనే మనవిచేశాను. అది రెండుచోట్ల మేము experiment గా start చేసి జాగ్రత్తగా పనిచేయదలచాము. ఆ Marketing Society పద్ధతి అమలులోకి వచ్చినతర్వాత మరికొన్ని శాసనాలు చేయవలసిన అవసరంకూడా వచ్చిందని ప్రభుత్వం గుర్తించి ఉన్నది. దీనిని గురించి Law Department లో పరిశీలన జరుగుతున్నది. ఋణములు ఇచ్చేటటువంటి సావుకార్లు అనేకమంది, తాత, ముత్తాతలనుంచికూడ, ఎన్ని సంవత్సరములైనా, ఇరవైరూపాయలు ప్రతి ఒక్క కష్టజీవి వానిమీద చిట్టాలలో మిగులు ఉంటుంది. ఈ మిగుళ్ళు అనేది రద్దుచేయడానికి శాసనరీత్యా మనకు ఉన్న అవకాశాలు ఏమిటో పరిశీలన చేయవలసిందని Law Department వారిని కోరడం, మన ముఖ్యమంత్రిగారు కూడ దానికి తగిన చర్యలు తీసుకోవలసిందని department కు తాకీదులు ఇవ్వడం జరిగింది. అందువల్ల నేను మనవిచేసేది ప్రభుత్వం 'ఏమిచేసింది' 'ఏమిచేసింది' అనేదానికంటే (అనకూడదని నేను అనను.) ఏమి

చేస్తున్నది. ఇదిగో మాతో రండి, మీరు మేము కలిసి పనిచేస్తామనే పద్ధతులలో వ్యవహారం చేసుకోవాలి, Hostels విషయంలో ఒక సంగతి మాత్రం మనవిచేస్తున్నాను. Hostels విషయంలో కాశీశ్వరరావు పంతులుగారు అది కారణంలేని ఆర్డరు అని అనుకొన్నారు. శ్రీ కాశీశ్వరరావుగారి అంతటి పెద్దలు కారణంలేని పని ప్రపంచంలో జరుగుతుందని అనుకొంటున్నారంటే ఇక వారికి నేను మనవిచేయడం, సమాధానం చెప్పడం కష్టం. కారణాలు వారికి తెలియవు అని కాదు. చెప్పవలసివచ్చి చెప్పారో నాకు తెలియదు. గాని చెప్పడం మాత్రం జరిగింది. అయితే ఏదీ తొందరపడి, అకారణంగా చేసిన పని కాదని మాత్రం నేను చెబుతున్నాను. కావాలంటే మరొక సమావేశం హరిజన సభ్యులతో పెట్టి ఎవరెవరు ఏప్రిల్ 26 వ తేదిన జరిగిన శాసనసభ్యుల సమావేశంలో పాల్గొన్నారో, ఏ ఏ సభ్యులు hostels గురించి ఎటువంటి సలహాలు ఇచ్చారో అవి అన్నీ కూడ వారిముందు ప్రవేశపెట్టగలాను. అధిక సంఖ్యాకులు ప్రకటించిన అభిప్రాయాన్ని మన్నించి కొంత కార్యక్రమాన్ని ఈ ఏడాది మనము ప్రారంభించకపోతే ఈ సమావేశాలు ఉత్త బూటకమనే విశ్వాసం మరింత దృఢపడుతుంది. మనం ఏదైనా ఒక కార్యక్రమం ప్రారంభించాలంటే అభిలాషతోను, మరి ఆవేదనతో చర్యతీసుకొనవలెనే గాని, తప్పులు ఒప్పులను గురించి విచారించవలెననే అభిప్రాయంతో కాదు. వెనుకటి చరిత్ర ఇపుడు తర్కించడం మంచిదికాదని ప్రభుత్వం ఆ ప్రయత్నం విరమించుకొన్నది. రిపోర్టులేని హాస్టలు లేదని ఖచ్చితంగా మీకు మనవిచేస్తున్నాను. అది నిజం, అబద్ధం అనేది నేను ఇపుడు చెప్పలేను. ఏవో రిపోర్టులు వచ్చాయి ఇందాక నేను మనవిచేసినట్లుగా, ఎవరు పంపించినా అనామత్తు దరఖాస్తులమీద ఆధారపడి ఒక హాస్టలుమీద అభిప్రాయం చెప్పడం, అది చెడ్డది అనే ఆలోచనతో వ్యవహారం చేయడం అనే పద్ధతి మంచిదికాదు. ఇపుడు అది విచారణకు పెట్టితే అది ఇసుకపాత్రమాదిరి ఉంటుంది. ఏమి జరిగిందో జరిగింది.

ఇప్పుడు ప్రభుత్వం 20 hostels ను రద్దుచేశారని చాలామంది సభ్యులు విమర్శించారు. రద్దుచేయడం కాదు. 20 hostels తాలూకు management ప్రభుత్వం అధికార రీత్యా 20, 25, 30 సంవత్సరాల నుంచి ఈ హరిజనులకు సేవచేస్తూ, హరిజనులలో ఉండి హరిజనాభివృద్ధి కార్యక్రమాలు అమలుచేస్తూ, అనధికార రీత్యా అనేకమంది విద్యార్థులకు, బాల బాలికలకు సేవచేసి, విద్యా బోధన గరిపిస్తున్నటువంటి పెద్దలయొక్క భారం కొంత ప్రభుత్వం వహించడానికి చేసింది, ఈ కార్యం. దానికి పెద్దలు నిజంగా అభినందిస్తారని నేను ఆశించాను, ఎందుకు ఈ విధంగా వారియొక్క కృషి వారు ఇదివరకు లేవదీసిన సంస్థలు ప్రభుత్వం మీద బాధ్యత పెట్టి తమయొక్క శక్తిని కొత్త సంస్థల నిర్మాణానికి ఉపయోగిస్తే ఎక్కువమంది విద్యార్థులను మనము అభివృద్ధి చేయడానికి, విద్య గరిపించడానికి అవకాశం ఉంటుంది. సేవ చేస్తున్నటువంటి వారికి ఏ ప్రభుత్వం sanction గాని, ప్రభుత్వం యొక్క ప్రతిబంధకాలు గాని అడ్డురావు. 30 ఏండ్లుగా గాంధీగారి నాయకత్వాన స్వతంత్ర పోరాట చరిత్రలో మన కర్షపరకు అనుభవం ఉంది. అందువల్ల ప్రభుత్వం ఏదో అడ్డువచ్చింది, మా

కార్యకలాపాలు ఆగిపోయినవి అని అనుకోవలసిన అవసరంలేదని నా విశ్వాసము. అందువల్ల ముఖ్యంగా నేను మనవిచేసేది ఏమైనా లోపాలు ఉంటే వాటిని సరి దిద్దుకుంటాను. ఇపుడు క్రొత్తగా తీసుకున్న వాటిలో (నేను టెలిగ్రాములు ఎప్పటికి అప్పుడు ఇచ్చి తెప్పిస్తున్నాను.) 4 చోట్ల కార్యక్రమం ప్రారంభించ బడినట్లు తెలిసింది. అయిదో స్థలంలో కార్యక్రమం జరుగబోతున్నది. వీలైనంత తొందరగా అనధికార రీతిగా ప్రజాసేవకులు, నాయకులు వహిస్తున్న భారం ప్రభుత్వం నెత్తిమీద వేసుకుంటుందని, అది శాశ్వతంగా తప్పించుకోడానికి అవ కాశం ఉండదన్న విషయాన్ని మీరు గుర్తించాలి. ఈ పాయింటు నాదే కాదు. శాసనసభ్యులు చెప్పినదేకాదు. శ్రీ కూర్మయ్యగారే ఒకప్పుడు దీనిమీద నోటు కూడ వ్రాసి ఉన్నారు. అదికూడ Secretariat వారు మీ దృష్టికి తీసుకొని వచ్చారు. అందువల్ల నేను మనవిచేసేది, ఎవరిమీద ఏవిధమైనటువంటి ద్వేషంతో గాని, లేక ఏదో. అరాచకం, ఆందోళన జరిగిపోతుందని ఈ నిర్ణయం చేయలేదు. ఈ హాస్టల్సు విషయమై విచారణ పెట్టదలచుకోలేదు. విచారణ పెట్టినట్లయితే నాకు అభ్యంతరం లేదు. నేను అందుకు సిద్ధంగా ఉన్నానని మాత్రం మనవి చేస్తున్నాను.

Sri V. KURMAYYA :— Hostels ను గవర్నమెంటు తీసుకోవడం బాగానే ఉంది, భారం తగ్గించారు వాండ్లకు. కాని వాండ్లకు నోటీసు ఇచ్చి మేము తీసుకొంటున్నాము అంటే సంతోషించే వాండ్లు. అయితే ఏమైందంటే, గవర్న మెంటూ అధికారం ఉందని, హాస్టలు పెట్టినతరువాత recognition, aid మొదలైన వాటిని withdraw చేస్తున్నాం అని ఆర్డరు ప్యాసు చేశారు అని బాధపడుతున్నారు అంతే.

The Hon. Sri G. LATCHANNA :—ఒకవేళ ప్రభుత్వం అమలుపెట్టిన విధానంవల్ల కొంత అసౌకర్యాలు ఏమైనా సభ్యులకు గాని, సేవకులకు గాని జరిగివుంటే వారు దానిని మన్నించవలెనని చెప్పడానికి సందేహంలేదు. ఎందు వల్లనంటే ప్రభుత్వం క్రొత్త కార్యక్రమం ప్రారంభించినపుడు, కొన్ని కార్యాలకు దిగినపుడు, లోపాలు ఉద్దేశపూర్వకంగా జరిగేవి కావు, కార్యకలాపాలలో తప్పనిసరిగా జరుగవచ్చును. మీరందరుకూడ కొంత సానుభూతితో సహకరించి సర్దుబాటు చేయడానికి తోడ్పడవలెనని నేను సభ్యులందరికి మనవిచేస్తున్నాను. ఇంకా మిగతా 32 మంది గౌరవ సభ్యులు ఇందులో పాల్గొన్నారు. వారి, వారి ప్రాంతాలలో కొండజాతి ప్రజలకు, వెనుకబడిన జాతులవారికి, మత్స్య పారిశ్రామికులకు, జరుగవలసిన సౌకర్యాలనుగురించి అనేకమంది సభ్యులు అనేక సూచనలు చేసిఉన్నారు.

ఒక విషయం వారందరి దృష్టికి నేను తీసుకొనివస్తాను. Harijan Welfare Department అన్నేది, ఈ Social Welfare Department అన్నేది, మిగతా department లతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపించి వారందరితో సంప్రదించి,

భోగట్టాలను సేకరించి ఒక జనరల్ పోస్టు ఆఫీసుగా మీతో సంబంధం కలిగిఉండే టటువంటి department. అందువల్ల మీరు కొంత సానుభూతితో సహకారం చేసి, అందరు దానికి తగినటువంటి భోగట్టాలు ఇస్తూ ఉన్నట్లయితే తప్పనిసరిగా ప్రభుత్వం ఈ department ద్వారా హరిజనులకు, గిరిజనులకు మాజీ నేరస్థులకు, తదితర వెనుకబడిన జాతుల వారందరికికూడ సేవచేస్తారు. మల యప్పన్ కమిటీ రిపోర్టు ఏమైంది అని కొంతమంది ఆందోళన వెలిబుచ్చారు. Malayappan Committee Report ప్రాతిపదికగా తీసుకొని షుమారు 86 లక్షల రూపాయల విలువకలిగినటువంటి స్కీములు ఇపుడు కేంద్ర ప్రభుత్వం వారి పరిశీలనకు పంపబడి ఉన్నాయి. అందులో కొన్నిటికి full grants వస్తాయని ఆశపడుతున్నాం. ఈ మధ్యనే Director ఢిల్లీ వెళ్ళిరావడం జరిగింది. ఈ జూలై 31-వ తేదీలోగా కేంద్ర ప్రభుత్వంయొక్క ఆమోదం వస్తుంది. ఆగస్టులో తెలిస్తే, ఈ agency ప్రాంతంలో అభివృద్ధి శాఖ మళ్లీ పూర్వం మాదిరిగా వేరుచేసి ఒక డైరెక్టరును ఆ అడవి ప్రాంతాలలోనే ఉంచి వ్యవహారం చేస్తే బాగా ఉంటుందని ప్రభుత్వ ఆలోచనలో ఉంది.

కనుక ఈ విషయంలో ప్రభుత్వము ఉపేక్ష చేస్తున్నదనిగాని, అశ్రద్ధ చూపుతున్నదనిగాని, ఏదో కళ్ళతుడుపు పద్ధతిలో ప్రభుత్వము వ్యవహారము చేస్తున్నదనిగాని, ఇటువంటి ఆలోచన మాత్రము ఏ సభ్యులు పెట్టుకోవలసిన అవ సరంలేదని, అవకాశం ఉన్నంతలో ఎక్కువ ఉపయోగకరమైన పద్ధతులలో ప్రజా సామాన్యాని కంతటికి సేవచేయాలనే సంకల్పంతోనే ప్రభుత్వము పని చేస్తున్నదని మనవిచేస్తున్నాను. గౌరవ సభ్యులు అందరుకూడ మా మాటలమీద విశ్వాసముంచి తప్పనిసరిగా, వారి cut motion ను withdraw చేసి కొని ఈ Demand ను ఏకగ్రీవంగా ఆమోదించాలని కోరుతూ సెలవుతీసు కొంటున్నాను.

Mr. DEPUTY SPEAKER: —ఈ డిమాండును మీ అందరి ఆమోదానికి పెడుతున్నాను. దీనికి సవరణలు ప్రతిపాదించిన వారు వారి సవరణలను ఉపసంహ రించుకోదలచి నటువంటివారు ఉపసంహరించుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

(At this stage Mr. Speaker resumed the chair.)

Sri P. SUNDARAYYA :— 183 (2) తప్ప మిగిలినవన్నీ ఉపసంహ రించుకొంటున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— వాటిని ఉప సంహరించుకోకుండా, అవి వీగిపోయినట్లు consider చేస్తే సరిపోతుంది.

Mr. SPEAKER :— Are you pressing for division.

Sri P. SUNDARAYYA :— ఏ రకంగా అయితే సవరణలన్నీ ఉపసంహ రించుకోడానికి ఒకేమారు House యొక్క permission కు పెడతామన్నారో, అదే విధంగా మిగతా సవరణలన్నీ ఒకేసారి వోటుకుపెట్టి వీగిపోయినట్లు తీసుకో వచ్చును.

22nd July 1955]

Mr. SPEAKER :— I do not read the cut motion.

Sri PILLALAMARRI VENKATESWARLU :— సుందరయ్య గారు చెప్పినట్లుచేస్తే time కూడ కలిసివస్తుంది.

Cut motions 174, 175, 176, 177, 178, 179, 181, 182, 184, 185, 187, 188, 190 were put to vote and lost.

Mr. SPEAKER :— I shall now put cut motion No. 183 to the vote of the House. The question is :

> To reduce the allotment of Rs. 99,99,600/- for Welfare of Scheduled Tribes, Castes etc., by ... ... Rs. 100/-

ఇందులకు కావలసిన ల్యాండు అక్విజిషన్ వగైరా చట్టాలను సవరించి హరిజనులకు ఇండ్లవసతి కలుగజేయుటలో జరిగే అనవసర ఆలస్యాన్ని నివారించుటకు.

The motion was lost.

Mr. SPEAKER :— I shall now put the main Demand to the vote of the House. The Question is :

> That, Government be granted a sum not exceeding Rs. 99,99,600 under Demand No. XXII – Welfare of Scheduled Tribes, Castes and other Backward classes.

The motion was carried and the grant made.

Mr. SPEAKER :— I now adjourn the House to meet again at 11-00 A. M., tomorrow.

(The House then adjourned).

---

*APPENDIX I*

[Vide answer to L. A. Q. No. 834 (Starred) printed at page 147 supra.]

[Vide answer to L. A. Q. No. 834 (Starred) printed at page 147 supra.]

EDUCATION, HEALTH AND LOCAL ADMINISTRATION DEPARTMEMT

**(Local Administration)**

# G. O. No. 315, 14th March 1955

Establishment—Engineering—Panchayats—Constitution of "The Andhra Panchayat Engineering Subordinate Service"—Orders Issued.

READ—the following papers:—

From the Inspector of Municipal Councils and Local Boards, dated 6th January 1955, Roc. No. 29327/54.

From the Chief Engineer (Highways), dated 18th August 1954, Letter No. 16580/B1/54-1.

Order—No. 315, Local Administration, Dated 14th March 1955.

In G. O. No. 2462, L.A., dated 13th December 1952, one Supervisor of the Highways Department was allotted for each district to attend to the preparation of plans and estimates for panchayat works. These Supervisors are placed under the administrative control of the District Panchayat Officers of the district concerned, but for technical purposes they are under the control of the Highways Department. It has been brought to notice that this dual control has not been working satisfactorily. The Supervisors drafted from the Highways Department have been anxious to rejoin their parent Department and were averse to transfers from one district to another. There have also been considerable delays in securing the services of Supervisors to fill up leave vacancies. The result has been that the Panchayats anxious to execute works and for which they had funds ready had to wait indefinitely for plans and estimates, leading to much local public dissatisfaction.

2. With a view to secure the speedy execution of Panchayat works, it has now been proposed that a separate Engineering Service should be constituted for Panchayats to be exclusively under the administrative control of the Inspector of Municipal Councils and Local Boards. The Government have

examined the proposals in consultation with the Chief Engineer (Highways) and direct that a separate Engineering Service called "The Andhra Panchayat Engineering Subordinate Service" should be constituted. This sanction will remain in force for a period of two years with effect from 1st April 1955 or the date of constitution of the service whichever be later. The service will consist of 13 Supervisors and 23 Overseers. The Supervisors and Overseers will be recruited in consultation with the Andhra Public Service Commission, immediate appointments being made on a temporary basis by the Inspector pending regular appointments. The Divisional Engineer and the Assistant Engineers will be appointed by transfer from the Highways Departments.

3. The Government sanction the employment for a period of two years from the date of appointments, of the following staff to attend to the Panchayat Works :—

(1) One Divisional Engineer.
(2) Three Assistant Engineers.
(3) Thirteen Supervisors.
(4) Twenty-three Overseers.
(5) Five Clerks.
(6) Twenty-one peons.

4. The expenditure on account of the staff mentioned in paragraph 3 above will be met from a Central Fund, which will be specially constituted for the purpose and contributions will be recovered from the Panchayats at a percentage rate of the income of the Panchayats that may be fixed by Government from time to time and credited to that Fund. Pending Constitution of the above Fund, the Government will consider the question of sanctioning an interest free advance of Rs. 2 lakhs to be repayable in 4 annual instalments of Rs. 50,000 each, to meet the expenditure on the salaries of the Panchayat Engineering service and other expenditure incidental to the starting of the department. The amount of advance will, however, be sanctioned only after constitution of the Central Fund and appointment of an Administrator to the Fund. The Inspector of Municipal Councils and Local Boards is requested to submit necessary proposals in this regard together with the draft rules for the constitution and administration of the Fund.

5. The Inspector of Municipal Councils and Local Boards is also requested to submit draft *ad hoc* rules to govern the posts

of Supervisors and Overseers of the new Panchayat Engineering Subordinate Service for consideration of Government.

[ By order of the Governor. ]

S. R. KAIWAR,
*Secretary to Government.*

To the Inspector of Municipal Councils and Local Boards, Andhra, Madras-14.

To the Chief Engineer [Highways], Andhra, Madras-1. [with copies to the Divisional Engineers [Highways].

Copy to all Collectors.
„ all Departments of Secretariat.
„ the Accountant - General, Andhra, Madras, through Finance Department.
„ the Examiner of Local Fund Accounts, Andhra, Guntur.
„ Finance Department [Estt. II and Exp. 'A'].

*APPENDIX II*

[Vide answer to L. A. Q. No. 834 (Starred) printed at page 147 supra.]

EDUCATION, HEALTH AND LOCAL ADMINISTRATION DEPARTMENT

**(Local Administration)**

# G. O. No. 427, 21st April 1955

Establishment—Engineering—Panchayats—Constitution of "The Andhra Panchayat Engineering Subordinate Service"—Orders—Amended.

READ—the following paper :—

G. O. No. 315, Local Administration dated 14th March 1955.

Order—No. 427, Local Administration, dated 21st April 1955.

In the G. O. cited the Government have ordered that the Divisional Engineer and the Assistant Engineers required to attend to panchayat works will be appointed by transfer from the Highways Department. On further consideration, the Government consider that these officers should be recruited by transfer also from the Municipal Engineering Service and the Town Planning establishment of the Municipal Councils.

2. The Government direct accordingly in modification of the orders issued in the G. O. cited.

(By order of the Governor)

S. R. KAIWAR,
*Secretary to Government.*

To the Inspector of Municipal Councils and Local Boards, Andhra, Madras-14.
To the Chief Engineer (Highways), Andhra, Madras-1, with copies to the Divisional Engineers (Highways).
To the Chief Engineer, Public Works Department (General and Buildings), Kurnool.
To the Director of Town-Planning, Andhra, Madras.
To the Commissioner of Municipalities through the Chairmen, Municipal Councils.

Copy to all Collectors.
,, all Departments of Secretariat.
,, the Accountant-General, Andhra, Madras through Finance Department.
,, the Examiner of Local Fund Accounts, Andhra, Guntur.
,, Finance (Estt. II and Expenditure) Department.

